# త్వరగా నురగను తెచ్చు సన్‌లైట్ బాదకుండ తెల్లగాను మరియు ప్రకాశవంతముగాను ఉతుకును



"మీ బట్టలను సన్‌లైట్‌తో ఉతికినచో మలినము ఎంత సులభముగా దొర్లిపోతుందో మీరే చూడండి. కొద్ది నిమిషములలో మీ తెల్లని బట్టలన్నియు ( రుమాలునుండి దుప్పట్లు వరకు) క్రొత్తవాటికంటె తెల్లగా నగును ! మరియు సన్‌లైట్‌తో ఉతుకుట వలన మీ బట్టలు చాలకాలము నిలబడును."



"దీనిని బాగా జ్ఞాపకముంచుకొనండి— సన్‌లైట్ సబ్బు రంగు బట్టలను తళతళమని మెరసేటంత ప్రకాశవంతముగా ఉతికేటట్టు మరేదియు ఉతుకదు. సన్‌లైట్ సబ్బునుండి త్వరగావచ్చు నురగ బట్టలను బాదకుండగనే వాటిలోని మలినమును తరిమివేసి వాటి అసలు రంగును తిరిగి తెచ్చుటను మీరే చూడండి."




## సన్‌లైట్ సబ్బు

బట్టలను కాపాడును • శ్రమను తగ్గించును • ఖర్చును తగ్గించును

222-X52 TL

ఇండియాలో తయారుచేయబడినది

# భారతి

సాహిత్య మాసపత్రిక

సంపాదకుడు :

శివలెంక శంభుప్రసాద్

డిశంబరు 1954

సంపుటము 31 : సంచిక 12

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

—:o:—

## డిశంబరు 1954

# భారతి ముప్పదియొకటవ సంపుటము

[1954 జూలై - డిసెంబర్]

## కారాది విషయసూచిక

# ఆంధ్ర ప్రజానీకానికి మా ప్రచురణలు

ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రికద్వారా ఆంధ్ర ప్రజానీకమునకు
పరిచయము గలిగిన యీ ప్రచురణలు మావద్ద
చిల్లరగాను, టోకుగాను దొరకును.

| | | |
|---|---|---|
| **రాజూ పేద** | (మార్క్ ట్వేన్) | **2-0-0** |
| **టామ్‌సాయర్** | ( ,, ) | **2-0-0** |
| **హకల్ బెరీఫిన్** | ( ,, ) | **2-0-0** |
| **విచిత్ర** | ( ,, ) | **2-0-0** |
| **కాంచనద్వీపం** | (స్టీవెన్సన్) | **1-8-0** |

పై ఐదింటికి అనువాదం: నండూరి రామమోహనరావు

| | | |
|---|---|---|
| **అల్లీబిల్లీలోకంలో అమ్మాయికథ** | | **1-0-0** |
| (లూయీకెరోల్) అనువాదం : వి. డి. ప్రసాదరావు | | |
| **కౌంట్ ఆఫ్ మాంటి క్రిస్టో** (అలెగ్జాండర్ డ్యూమా) | | |
| (రెండుభాగములు) | ఒక్కొక్క భాగము | **3-8-0** |
| అనువాదం : సూరంపూడి సీతారామ్ | | |
| **డాన్ క్విక్‌సెట్** | మూలం : సెరివాన్‌టెజ్ | **2-0-0** |
| (అనువాదం) విశ్వాత్ముల నరసింహమూర్తి | | |
| **రెండు మహానగరాలు** | (తెన్నేటి సూరి) | **3-0-0** |
| **ఆత్మకథ** రెండుభాగములు | (మహాత్మాగాంధీ) | |
| | ఒకొక్క భాగం | **5-0-0** |
| **శ్రీమద్భగవద్గీత** | (కా. నాగేశ్వరరావుపంతులు) | **4-0-0** |
| **ఆంధ్రవాఙ్మయ చరిత్ర** | | **2-0-0** |
| **శ్రీ మదాంధ్ర మహాభారతము** | | |
| **ఉద్యోగపర్వము** | | **1-0-** |
| **బసవపురాణము** | (పాల్కురికి సోమనాథకవి) | **4-0-0** |

---

**ఆంధ్రగ్రంథమాల, మదరాసు 1.**



జయ
మార్గశీర్షము

భారతి

సంపుటము **31**
సంచిక **12**

# చిన్నిపూలు

మురయా

చింతతోనే చివికిపోతే, వగపుతోనే దిగులుపడితే,
చింత విడచీ చేరుకొమ్మని, దిగులు విడచీ తేరుకొమ్మని,
చిన్నిపూలే పలుకరించాయీ!
చిన్నవాడని చెలిమి చూపాయీ !

ఎవ్వరెరుగని బాధతోనే,
నవ్వులెరుగని బాటలోనే,
ఒంటిగానే నిలచిపోతే
వెంటరమ్మని పిలిచిపోతూ,
దారిపోయే యేటినీరము
లేటికోయీ చింతలనుచూ,
మాటలాడీ వలపు చూపాయీ!
వాటిలాగే మెలగమన్నాయీ!

ఎడద చేసే రోదనలతో
మనసులోనే కుమిలిపోతూ
వేడియూర్పుల వెతలపాలై
వెఱ్ఱినై నే క్రుంగిపోతే
హోరుగాలికి మారు పలికే
పైరుభూముల పైన నెగిరే
పికిలిపిట్టలె పలుకరించాయీ!
పిన్నవాడని కనికరించాయీ!

కారుమబ్బుల కటికిచీకటి । కలచుజీవితగాథలన్నిటి
తలచుకొని నేభువిని రాలీ । తల్లడిలిపోతే
మిణుగుపుర్వులె వెలుగు చూపాయీ!
కీచురాళ్లే మేలుకొల్పాయీ!

# శత్రువు

శ్రీ నిర్మల్ కుమార్ ముస్తాఫీ

అఖిలభారత పోటీలో నాల్గవ బహుమతినిపొంది, ప్రపంచపోటీకి పంపబడిన నాలుగవ కథ. నిర్మల్‌కుమార్ ముస్తాఫీ ఈకథను ఆంగ్లంలో రచించి పోటీలో పాల్గొన్నారు. వీరు ఇప్పుడు చంద్రనగర్ ప్రభుత్వకళాశాలలో ఆంగ్లశాఖలో లెక్చరర్‌గా పనిచేస్తున్నారు.

దబాదబా బూట్లచప్పుడు; ట్రైనింగ్ కాంప్ నుంచి సిపాయిలను విడుదల చేశారు. ఎక్కడివాళ్ళక్కడ గుంపులు గుంపులుగా వెళ్లిపోతున్నా, హెర్‌మన్ సైనికశ్రేణిలో వున్నట్టు ఇంకా అలానే నిల్చునున్నాడు. ట్రైనింగ్ కాంప్ కమాండర్ సందేశ వాక్యాలు ఇంకా అతని చెవుల్లో మారుమోగుతూనే వున్నయ్. 'మాతృదేశంయొక్క గౌరవప్రతిష్ఠలను పరిరక్షించే మహత్తరమైన బాధ్యత మీ భుజస్కంధాలమీద వుంది. ఈ బాధ్యతను నిర్వహించుకోగలగటానికి ఈ కేంద్రం మీకు తగిన శిక్షణనిచ్చి తరిఫీదు చేసింది. మీరు పేల్చే ప్రతిగుండూ ఒక శత్రువును రూపుమాపాలి! మీరు పొడిచే ప్రతి (తుపాకి) సన్నీపోటూ ఒక శత్రువు హృదయాన్ని చీల్చాలి. మీ నేత్రాలకు సునిశితమైన లక్ష్యశుద్ధినీ, మీ హస్తాలకు అచంచలమైన లాఘవాన్నీ భగవంతుడు ప్రసాదించుగాత!'—





'లక్ష్యశుద్ధిగల నేత్రాలూ — లాఘవంగల హస్తాలూ'—ఈమాటలు తనలో తను గొణుక్కుంటూ, హెర్మన్, పెరేడ్ మైదానానికి అడ్డంపడి దిగులుగా నడుస్తున్నాడు.

శిశిర ఋతువు; ప్రొద్దు గర్భాన పడ్డది. మసక మసకగా చీకట్లు క్రమ్ముకొస్తున్నయ్. హెర్మన్ వెనక్కు తిరిగి నిర్మానుష్యంగా వున్న కాంప్‌వంక చూచాడు. చుట్టూవున్న పొలాలమీద తెరదించినట్టు పొగమంచు వ్యాపించివుంది. అతని మనస్సు యింటిమీద పోయింది. కళకళలాడే తన గృహానికీ ఈ వాతావరణానికీ ఎంత వ్యత్యాసముంది! ప్చ్! లాభమేమిటి? ఇప్పుడు ఇంటికి తిరిగివెళ్లే అవకాశం లేదు. వెంటనే రణక్షేత్రానికి వెళ్లిపోవాలని ఉత్తరువులు! తన మనస్సులో కలుగుతున్న విచారాన్ని తోటిసైనికులతో చెప్పుకుని వాపోయాడు.

'ఇలాంటి విచారాలు పనికిరావురా! భయ్యా! —శత్రువు చెయ్యి దాటి తప్పించుకు పారిపోతే తప్ప మరిక దేనికి విచారపడగూడదు'—ఇది బిల్లీ సలహా.

'సైన్యంలో వున్నవాడికి ఇలాంటి ముచ్చట్లూ, మురిపాలూ ససేమీ రంజించవనుకో'—ఇది తక్కినవారి మందలింపు.

తన తెలివితక్కువకు పశ్చాత్తాపపడుతున్నట్టు మొహం బెట్టి, హెర్మన్ క్షమార్పణ చెప్పుకుంటున్నట్టు అన్నాడు: 'నిజవే—ఇలాంటివి మంచివి

కావు—కాని నాలో అప్పుడప్పుడు ఇలాటి పిచ్చి ఊహ లేవో పుడుతూ వుంటాయి—మళ్ళీ ఇట్టే క్షణంలో అంతరించిపోతాయనుకోండి' —అన్నాడు. చేతినున్న గడియారంవంక చూసుకున్నాడు. ఒక రెండు గంటలు మాత్రమే వ్యవధి వుంది: 'మైమైపోతోంది— సామానూ జట్టా సర్దేసుకోవద్దూ ?' అన్నాడు. అతని వెంబడే తక్కినవాళ్లు కూడా, బారకాసులవేపు బయలుదేరారు.

హెర్మన్ సర్వసన్నాహాలూ పూర్తిచేసుకుని నిల్చునున్నాడు. కన్నూ కన్నూ పొడుచుకున్నా కనుపించని చీకటి—అంధకారం; ఆ చీకట్లో అతని చుట్టూ అనంతమైన సంచలనం. కళ్ళు పెగల్చుకు చూస్తే ఆ చీకట్లో పెనుభూతాల్లా మిలిటరీ ట్రక్కులు కనుపించుతున్నయ్. చాలా చలిగా వుంది. చేతులకు 'గ్లౌస్' తొడుక్కున్నాడు. నెమ్మదిగా ముందుకు నడిచి, ఆ లారీల ప్రక్కకు పోయి నిల్చున్నాడు. రెండు మూడు నిమిషాలు అలానే నిల్చున్నాడు. ఇంతలో దూరాన చక్రాల చలనం వినిపించింది. 'ఓహో ! బయలుదేరుతున్నట్టున్నయ్' — అనుకున్నాడు. ట్రక్కులోకి ఎక్కేశాడు. ట్రక్కులో తొలగదొయ్యటానికి సందులేకుండా క్రిక్కిరిసి వున్నారు. కాస్త విశ్రాంతిగా కూర్చుని ప్రయాణం చేసే సావకాశం వుంటుందనుకున్నాడు. కాని మోకాళ్లు డొక్కల్లోకి ముడుచుకుని గొంతుక్కూర్చుని ప్రయాణం చేయవలసి వచ్చింది. లారీ గర్రుమని కదిలింది. లారీ వడివడిగా పోయినకొద్దీ, చలిగాలి జివ్వు జివ్వున ముఖంలోకి బాదుకుని ముఖం వాచిపోతోంది. నుదురుతుడుచుకుని, చినుకులు వ్రేళ్లతో చిలకరించుతున్నాడు.

హెర్మన్, అతని సహచరులూ యుద్ధరంగంలో దిగారు. పరిస్థితులు అంత అధ్వాన్నంగా వుంటాయని వాళ్లు యెప్పుడూ ఊహించలేదు. ట్రైనింగ్ లో వున్నప్పుడు, సైనికుడు దుస్తుల విషయమై తీసుకోవలసిన శ్రద్ధనుగురించి వీరందరికీ ఎంతో ఉదాత్తమైన అభిప్రాయాలుండేవి. ఇక్కడి పరిస్థితుల్లో అలాంటి అభిప్రాయాలన్నీ తుక్కుతుక్కయిపోయాయి. జీవాలు నిలిచివుండటానికి, కావలసిన కనిష్ఠావసరాలు లభించటం అక్కడికి బ్రహ్మప్రళయం. ప్రాణాలు నిలిపివుంచుకోవటానికి కచ్చగా పోరాడే అడవిమృగాల ఆవేశం వాళ్ళల్లో పొటమరించింది. ఒక కందకంలో తలదాచుకుని, ఆకలిబాధ తీర్చుకోవటానికి ఆ వేళకు అందిన కబళాలను ఆప్యాయంగా తింటున్నారు. ట్రైనింగ్ కాంపులో వుండగా వీరభోగ వసంతరాయిళ్లలా అనుభవించిన అనుభవాలను తలపుకు తెచ్చుకుని, వర్తమాన స్థితికి లోలోపల దురపిల్లుతున్నారు.

ఒకళ్లతో ఒకళ్లు మాట్లాడుకుందామనే మానవ సహజమైన ఉత్సాహంకూడా నశించి ఎవరికి వారు మౌనంగా కూర్చుని ఆ కాస్త ముద్దా గొంతులో వేసుకుంటున్నారు. ఇంతలోనే సమీపంలో సైరన్ ధ్వని వినిపించింది. మరుక్షణంలో ఎక్కడనుంచో రివ్వున ఒక ఫిరంగిగుండు ఎగిరివచ్చి కందకం అంచుకు కొట్టుకుని 'ఢన్' మని పేలింది. మట్టి, దూగరగా పైకి లేచి కూళ్లనిండా పడ్డది. ఆ చీకట్లో ఏమీ కనుపించక హెర్మన్ ఇంకా అలా తింటూనే వున్నాడు. నోట్లో పెట్టుకున్న ముద్ద మట్టికంపు కొట్టింది. అతనికి చిరాకెత్తిపోయి అవతల పారేద్దామనుకున్నాడుగాని, ఆకలితో వుండటంచేత ఎలాగోలా ఆ రెండుముద్దలూ నోట్లో కూరుకున్నాడు. యుద్ధరంగంలో జీవితం అంటే ఇదికాబోలు, కనీసం ఈ రకంగా వుంటుంది కాబోలు ననుకున్నాడు.

ఫిరంగికాల్పులు సమసిపోయినై. హెర్మన్ బృందానికి ఉత్తరువులు అందినై: 'దొంగచాటుగా బయలుదేరివెళ్లి . శత్రుస్థావరాలను రూపుమాపాలి.' ఆ ఉత్తరువులప్రకారం ముందుకు సాగిపోతున్నారు. ఉన్నట్టుండి, శత్రుశ్రేణి ముందు జాజ్వల్యమానంగా ఏవో మంటలు కనుపించినై. ఆ మంటల కాంతిలో పరిసరాలన్నీ శత్రువుకు విస్పష్టంగా కనుపించినై. వెంటనే శత్రుఫిరంగులు మృత్యువును వర్షించటానికి ప్రారంభించినై. ఇటు ఎడమవైపున ఒక గుండు అటు కుడివేపుగా ఒకటి — నెత్తిమీదుగా రివ్వున ఎగసిపోయేదొకటి! బిల్లీ కూడా హెర్మన్ప్రక్కనే

నేలమీద పాకుతున్నాడు. పట పటా పళ్లు కొరికి: 'అక్కడికి చేరాలే గాని...ఆ కుక్క వెధవల్ని...నాశ...';ఇంకా ఆ వాక్యం ముగియకముందే 'సర్ ర్' మంటూ ఒక తుపాకిగుండు ఎగిరివచ్చి అతని గుండెల్లో కొట్టుకుని, అతన్నీ అతని కచ్చనూ కూడా అంతంచేసి వేసింది. హెర్ మన్ ఓలి ప్రక్కనే వొరిగి, అతని శరీరాన్ని తడివిచూచాడు. మృత్యువు ఎంత నిర్దాక్షిణ్యంగా సర్వాన్నీ అంతం చేసి పారేస్తుందో అతనికి అర్థమైంది. "పేల్చిన ప్రతి గుండూ ఒక శత్రువును రూపుమాపాలి" అనే వాక్యాలు తిరిగి అతని స్మృతిపథంలో వినిపించినై. చివాల్న లేచి నిల్చున్నాడు. మొండి ధైర్యంచేసి ముందు కురికేశాడు.

చుట్టూ చీకటి అంధకారం: గగనపథాన అక్కడక్కడ నక్షత్రాలు మాత్రం మినుకు మినుకు మంటున్నయ్. పైన ఆకాశం ఎంతటి విస్తృతావధిని పఱచుకుని వుందో, క్రింద అగ్నిగోళాలు వర్షించుతున్న ఆ రణక్షేత్రం కూడా అంత విస్తృతావధినీ పఱచుకుని వున్నట్టు కనుపించుతోంది. ఆ రణక్షేత్రానికి మధ్యగాబడి హెర్ మన్ ముందుకు సాగుతున్నాడు. ఫిరంగిగుండ్లు భూగర్భాన్ని భీభత్సంగా ఛిన్నాభిన్నం చేసేస్తున్నయ్. తుపాకులు నిప్పులు చెరుగుతున్నయ్. 'మోర్ టారులు' అగ్గిగోళాలను విసిరివేస్తున్నయ్. వీటి భీభత్సరావంలో హతభాగ్యుల హాహాకారాలు కూడా కలిసి ప్రళయసంఘోషంగా వుంది. అలా నేలనుబడి పాకిపోవటంతో హెర్ మన్ మోకాళ్లు కొట్టుకుపోయి రక్తాలోడుతున్నాయి. కాని అతను లక్షించలేదు. ముందుకు సాగుతున్నాడు. శత్రువుల మెషిన్ గన్ దళంవున్న స్థావరం అనతిదూరంలో వుంది...ముప్ఫై అడుగుల దూరం! నేలనుబడి ప్రాకులాడుతూ, క్రమేపీ ఆ స్థావరం దగ్గిరికి చేరుకుంటున్నాడు. చీకటి పిశాచాలు నిల్చున్నట్టు ఇప్పుడు అక్కడున్న మనుషులు అతనికి స్పష్టంగా కనుపించుతున్నారు. చేతిబాంబు తీసుకుని విసిరెయ్యడానికి సిద్ధంగావున్నాడు. ఇంతలోనే శత్రుశ్రేణిముందు మరొక పర్యాయం, హఠాత్తుగా మంటలు లేచాయి, యుద్ధభూమియావత్తూ పట్టపగలైకనిపించింది. శత్రువులు అతని మీద ఒక్కుమ్మడి తుపాకిగుండ్లు కురిపించారు. మరుక్షణంలో ఆ శత్రుస్థావరం కూడా పేలిపోయింది—హెర్ మన్ విసిరిన చేతిబాంబు దాని సమాధానం అది చెప్పేసింది. అలాంటి స్థితిలో మృత్యువు అనేది అసందిగ్ధం—అటు శత్రువును కబళించుతుందో, ఇటు మన్నే కబళించుతుందో చెప్పలేము. ఈ తలపుతో అతనికి ఎంతో విచార మేసింది.

'ఏది యేమైనా, నా బాధ్యతను నేను నిర్వహించాను' అని నచ్చచెప్పుకుని తనను తాను అభినందించుకున్నాడు. అక్కడే ఆగి క్షణం విశ్రాంతి తీసుకుని ఊపిరి పీల్చుకున్నాడు. లేచి నెమ్మదిగా ముందుకు సాగాడు. బాంబు పేలనంవల్ల యేర్పడిన ఒక పెద్దగోతిలో తల్లక్రిందులుగా పడిపోయాడు. తల దిమ్మెక్కి కూరుకుపోయింది. మోకాళ్లకు బలంగా దెబ్బలు తగిలాయి — మోకాటిచిప్పలు తొలగిపోయాయేమో కూడా; ఆ మోకాళ్లబాధ భరించలేక చేతులతో పట్టుకున్నాడు. చేతులనిండా రక్తం! భూమండలం యావత్తూ ఒక్కసారి గిర్రున తిరిగిపోతున్నట్టు తల తిరిగిపోయింది—ఉండీలేని స్పృహ—గోతి అంచుమీద వాలబడిపోయాడు. తడిమట్టి చిదుపలు చిదుపలుగా పైనించి నెత్తిన పడుతోంది నోటి వెంట చొంగకూడా బయటికి వస్తోంది.

అతనికి తిరిగి స్పృహ వచ్చేసరికి తెల తెలవారుతోంది. నెమ్మదిగా కళ్లువిప్పి మోకాళ్లవంక చూచుకున్నాడు. మోకాళ్లు రెండూ బాడెలైవున్నాయి. లేచి నిల్చోటానికి ప్రయత్నించాడు—కాని కాలు కదపలేకపోయాడు. ఆ హతాశలో ఆవుర్న యేడిచెయ్యాలనిపించింది. 'నిన -నిన్న నేగా !...'

తన తుపాకి యెక్కడున్నదా అని చుట్టూ చూసుకున్నాడు. తుపాకి సన్నీ అతని నెత్తిమీదనే తళతళా మెరుస్తోంది, గోతి ఒడ్డుమీదనుంచి. అతను గోతిలో పడిపోయినప్పుడు తుపాకి జారి గోతివడ్డున పడ్డది. కొంచెం పైకి లేచి చెయ్యెత్తితే అందే స్థితిలో వుంది—కొంచెం పైకి లేవగలిగితే చాలు! సరే పోనీ మనుకుని, యేమి చెయ్యటానికీ తోచక—కాస్త

రొట్టెముక్కన్నా కొరుక్కుతిందామని, జేబులో నుంచి పొట్లాం తీసి విప్పుతున్నాడు. ఒక ముక్క మునిపంట కొరికాడో లేదో...అడుగుల చప్పుడు! నిర్ఘాంతపడి వదిలివేశాడు. ఇంకా ఇంకా చేరువౌతున్న అడుగుల చప్పుడు! తల పైకెత్తి చూచాడు. ఒక మానవముఖం గోతి అంచుమీదనుంచి తనవంక తొంగిచూస్తోంది—ఉక్కు టోపీరంగునుబట్టి గుర్తుబట్టాడు—శత్రువు!

కలవరంగా లేచి తుపాకీ అందుకోబోయాడు—మోకాళ్ళు విరిగిపోయిన సంగతి జ్ఞప్తిలేక—'అమ్మో' అని ఆర్తనాదంచేస్తూ గోతి అంచుమీద పడిపోయాడు.

అతనికి తిరిగి తెలివివచ్చి కన్నువిప్పి చూసేసరికి ఆందోళనతో కించపడుతున్న ఒక ముఖం అతని వంక జాలిగా చూస్తోంది—గోతి అంచుమీద కనుపించిన ఆ ముఖమే—హెర్మన్ గుర్తుపట్టాడు. శత్రువు మంచినీటి 'ఫ్లాస్కు' బయటికితీశాడు. మూత తీసి హెర్మన్ నోటికందించాడు. హెర్మన్ అతని వంక ఆశ్చర్యంగా చూశాడు. 'తాగు తమ్ముడూ!' —అన్నాడు. శత్రువు దుస్తులలోవున్న ఆ మానవుడు. ఎడమ చేత్తో, హెర్మన్ శిరోజాలను జాలిగా దువ్వాడు. హెర్మన్ దీనుడై తన మోకాళ్లవంక చూసుకున్నాడు—అతన్ని చూడమన్నట్టు. చినిగి జేబులైపోయిన లాగూలోనుంచి రెండు మోకాళ్ళూ ఎద్దుపుండ్లులా బాడలై కనుపిస్తున్నయ్. 'మోకాళ్లు బాగా బాధగావున్నాయా తమ్ముడూ!' అన్నాడా వ్యక్తి. ఆ మాట్లాడుతున్నవాడు నిజంగా శత్రుపక్షానికి చెందినవాడని హెర్మన్ నమ్మలేకపోతున్నాడు. అతనితో మాట్లాడకుండా మొండిచటిచి మౌనం వహించాలనుకున్నాడు గాని, అతని అదుపులో వుండక దుఃఖసంతప్తాలైన అతని రెండుకళ్లూ కన్నీటిని విడిచివేసినయ్.

'బలంగా దెబ్బలు తగిలినట్టేవున్నయ్!—మనం డాక్టరు నెవణ్ణన్నా చూడాలిసిందే'—

'డాక్టర్ ఎక్కడ దొరుకుతాడిక్కడ'—హెర్మన్ హతాశుడై అన్నాడు.

'ఈయుద్ధరంగంలో మీ హాస్పిటల్ ఏ చాయల వుందో చెప్పగలవా తమ్ముడూ?'—

ఆ వ్యక్తి తన్ను పరియాచక మాడుతున్నాడను కున్నాడు హెర్మన్: కొంచెం కచ్చగానే అన్నాడు: 'అక్కడికి వస్తే, నిన్నేం చేస్తారో అదే మన్నా కొంచెం ఆలోచించావా...?'

'అవును, ఖైదుచేస్తారు.—లేదా చంపుతారు' అని చిరునవ్వు నవ్వాడు: 'కాని మానవుడుగా నా బాధ్యతను నేను నిర్వహించుకున్న వాణ్ణవుతాను.

'బాధ్యతను నిర్వహించుకున్న వాణ్ణవుతాను' —ఇవే మాటలు తానూ లోగడ అనుకున్నాడు. కాని ఆ సందర్భం జ్ఞప్తికి వచ్చి సిగ్గుపడి తలవంచుకున్నాడు.

ఆ వ్యక్తి ఏదో ఒక నిర్ణయానికి వచ్చేస్తున్నట్టు నెత్తిమీది ఉక్కుటోపీ తీసి తుపాకిసన్నీకి తగిలించి, తుపాకి చేత్తో బట్టుకుని లేచి నిల్చున్నాడు. మౌనంగా నిల్చుని రెండు క్షణాలు ఆలోచించాడు. దబాల్న తుపాకి నేల పారేశాడు. ఉక్కుటోపీ తీసి తిరిగి నెత్తిన బెట్టుకుని దానితోలు పటకాలు గడ్డం క్రిందికి గట్టిగా బిగించుకున్నాడు.

'సరే తమ్ముడూ—ఇక చెప్పు!—హాస్పిటల్ ఏ వేపు నుంది,' అతి ప్రశాంతంగా అడిగాడు.

'ఇంతకీ నువ్వు ఏమిచేద్దామని'—అతని ధోరణి బోధపడక హెర్మన్ ఆశ్చర్యపడుతూ ప్రశ్నించాడు.

'చెప్తానుగా—హాస్పిటల్ సంగతి చెప్పతే!'

'అటు ఉత్తరంగా చర్చి గోపురం కనుపించుతోంది కదూ—ఆ చర్చిదగ్గిరే వుంది మా హాస్పిటల్!

అతను నిల్చుని చుట్టూ పారజూచాడు. చర్చి గోపురం కనుపించింది. సరే, చాలా దూరమే—శత్రుస్థావరాల మధ్య వుంది. అతను హెర్మన్ ప్రక్కనే, మోకాటి తండావేసి కూర్చున్నాడు. 'పాపం! కదిలిస్తే బాధపెడుతుందేమో—ఎల్లాగైనా క్షణం ఓర్చుకో' అంటూ హెర్మన్ను నెమ్మదిగా రెండు చేతులా పైకెత్తి, నెమ్మదిగా గోతి అంచు మీద పడుకోబెట్టాడు. తానుకూడా గోతిలోనుంచి

పైకి ఎక్కివచ్చాడు. హెర్‌మన్ ప్రక్కనే నేల మీద బోర్లగా పడుకున్నాడు. 'తమ్ముడూ! నీకేం ఫరవాలేదు; నెమ్మదిగా నా వీపుమీదికి ఒత్తిగిలి నా మెడ కావలించుకుని హాయిగా పడుకో!"

హెర్‌మన్ను వెన్నుమీద పడుకోబెట్టుకుని అర చేతులతోనూ, పాదాల మునివ్రేళ్లమీదనూ నేలమీద వానపాములా పాకిపోతున్నాడు—చర్చి గోపురం కనుపించుతున్న దిశగా. అలా గంటల తరబడిపాకాడు. అతని ఒళ్ళంతాకూడా కొట్టుకుపోయి నెత్తురు కారుతోంది. ఆ కదలికతో హెర్మన్‌కు కూడా చాలా బాధగానే వుంది. కాని చర్చిదగ్గిరికి వచ్చేసరికి అతనికి ఎంతో హాయి ననిపించి ప్రాణం లేచివచ్చినట్టయింది. అతని వెన్నుమీదినుంచి నెమ్మదిగా క్రిందికి దొర్లాడు. అతన్ని అక్కడికి జేరవేసుకొచ్చిన ఆ వ్యక్తి లేచి మోకాళ్ళమీద కూర్చున్నాడు. రక్తధారలు ఓడుతూ, దుమ్ముకొట్టుకుని భీభత్సంగా వున్నా, అతని ముఖంలో వెన్నెలలా ఏదో ఒక మహా తేజం ప్రకాశించుతోంది. దేవతల ముఖాలు ఇలాగే వుంటాయి గాబోలు ననుకున్నాడు హెర్‌మన్. కాని ఇంతలో మోకాళ్లు మళ్లీ అపరిమితంగా బాధ పెట్ట సాగినై. మోకాళ్ళకు కట్టిన కట్లు మళ్ళీ రక్తంతో తడిసినై. తన కృతజ్ఞతను తెలుపుతూ అతని వంకచూసి ఒక చిరునవ్వు నవ్వాలనుకున్నాడు కాని, పెనవేస్తున్న బాధతో చుట్టలు జుట్టుకు పోయాడు—స్పృహ లేకుండాపోయింది.

తిరిగి హెర్‌మన్‌కు తెలివి వచ్చేసరికి అతని చుట్టూ కొంతమంది నిల్చున్నారు. అతని కిప్పుడేమీ జ్ఞప్తికి రావటంలేదు. నెమ్మదిగా మనో బలాన్నికూడదీసుకుని: 'ఆ మనిషేడీ?' అని గొణిగాడు.

'వాడి గ్రంథం కనుక్కున్నాంలే—నీ కెందుకింకా ఆ బెంగ — దొరికిపోయాడని కులుకుతున్నాడు వెధవ, అదృష్టం—సమయానికి వచ్చాం; ఒక్క గుండుదెబ్బతో తల పేలిపోయింది వెధవకి—అసలు ఆ కుక్కవెధవ, మన హాస్పిటల్ చుట్టూ తచ్చాడటానికి తెగించినందుకు చెప్పాలి!—ఏమిటి వాడి వెధవ ధీమా!!'

'ఆ సమాధానంతో హెర్‌మన్ ప్రాణాలు ఆవటించిపోయినై. ఆ మానవులవంక చూడలేక మొగం తిప్పేసుకున్నాడు. పెద్దపెట్టున యేడిచెయ్యాలనే క్షోభ కలిగింది గాని—ఏడవలేకపోయాడు.

శిథిలావస్థలోవుండికూడా, సూర్యకిరణాలుపడి ధగధగా మెరుస్తున్న చర్చిగోపురంమీద అతని చూపులు లగ్నమై పోయినై.

# కరుణారసము

## శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

కరుణరస మత్యుత్తమమైనది. కరుణరస సంవాదము లలిత కళాసృష్టికి హేతుభూతము. కళాసృష్టిలో శోకప్రతీతి గలదు. క్రౌంచద్వంద్వవియోగ జనితమగు శోకము శ్లోకరూపముగా వాల్మీకియందు కన్పడినదని సంప్రదాయ వాక్యము. శోక మాత్మవిశ్రాంతిలో విఘ్నమును చూపుటచేతను, ఈ విఘ్నమే జీవితమునకాధారభూత మగుటచేతను, కరుణరస ప్రతీతి లేని మానవుడుగాని, మహాకావ్యముగాని సంభవించుట దుర్లభము. పురుషార్థము నుపహితముగా జూపు విషయసామగ్రి, ఆత్మసంస్కారము, అవిశ్రాంతితో నుండుటచేతను, విషయనష్టత్వాదికముచే నుద్దీపితమై మానసముండుటచేతను, కరుణరసమున కలుగు హృదయస్పంద మతి తీవ్రమైనది. నశించిన విషయమును, వస్తురూపమున కన్పించజాలని విషయమును భావనా వశమున మనస్సులో చిత్రించుకొనుచున్నాము. కాని భావనాజనితమగు మానసచిత్రము క్రమేణ కాంతి విసంవాదమగుటచే, దీనికి కావ్యాది లలితకళల ద్వారా శాశ్వతరూపము నర్పింప యత్నించుచున్నాము. కావుననే శ్లోకరూపమగు కావ్యము శోకజనితమని రామాయణసంప్రదాయము చెప్పుచున్నది.

రసములలో కరుణయే రసమను లోకోక్తి గలదు. ఆర్ద్రమగు మనస్సు చిత్తద్రుతివశమునని చట మిక్కుటముగా కన్పించు కరుణరసమున మాధుర్యము గలదని ఆనందవర్ధనాచార్యులనినారు. ప్రదర్శింపబడుచున్న విషాదమునుండి ఉత్తమ పురుషార్థము రాగల్గిననే ఈ విధమగు మాధుర్యము కన్పించగలదు. బాహ్యవిషయ జనితమగు అధర్మాద్యశుభమునకే పాత్రలెట్లు ప్రవర్తించగలుగుచున్నారో గమనించు సమయమున మనకు విశిష్టప్రతీతి గలదు. బాహ్యజగమున నొక మహాశక్తి గలదని, ఈ శక్తియే మనల నాకర్షించుచు భయమును గొల్పునదనియు కరుణరస ప్రతీతిలో గలదు. సన్నివేశములు నియతితప్పక అభివ్యక్తములగునని స్పష్టముగా గ్రహించగలుగుచు, ఈ సన్నివేశపరంపర చూపు ఆరోహణావరోహణసంశ్లిష్టమగు భావాదుల విన్యాస వైచిత్ర్యము నవగాహన చేసికొనుచున్నాము. ఈ విధమగు అవగతివలననే కరుణరసము మనకత్యంత మభిప్రేత మగుచున్నది. ధర్మాధర్మము లలౌకిక తత్త్వానుస్యూతములై కరుణజగమును ప్రవేశించుచున్నవి. కరుణరసములో గల మనోవైక్లవ్యముద్వారా అభివ్యక్తమగు పురుషార్థమును కరుణజగమున కన్పించు అధర్మమే తీసికొనిరాగల్గుచున్నది.

## 2

మానవునకు తన పరిసరములతో గల వైలక్షణ్యము, సంఘర్షణ అను వానినుండి బయలుదేరునది కరుణరస పరిపోషకమగు విషాదము. పురుషార్థములు తమను తామే నశింపజేసికొనగల శక్తి సమన్వితములని ఈ విషాదము తెల్పుచున్నదని "డెస్వార్" (*Dessoir*) పలుకుచున్నాడు. విషాదమున గల దుఃఖానువేనయం దంతర్లీనముగా నున్న ధర్మము బహిర్గతమై అధర్మముతో సంఘర్ష నందుచున్నదని "లిప్స్" (*Lipps*) చెప్పుచున్నాడు. ఈ సంఘర్షణలో ధర్మమోడిపోవుచున్నట్లు కన్పించుచున్నది. కాని జీవితమునకు వ్యాఖ్యారూపము, భావనాసమన్వితమునగునది కావ్యమనినాము. అనగా కావ్యము జీవితముతో నభిన్నమైనది. జీవితములో కన్పించు విషయములు, భావములు, సంవేదనములు మొదలగునవన్నియు కరుణరసములో నంతర్గతము లగుచున్నవి. జీవితమున కన్పడు సంఘర్షణయే విషాదరూపమున కరుణలో కన్పించుటచే భయవిస్మయోత్సాహము లీ ప్రతీతియందు గలవు. అందుచే "పావనం వచనామృతం కరుణాద్భుత రసం చ కించిదుపనిబద్ధం" అని భవభూతి పలికినాడు. కరుణ, అద్భుతము అనునవి రెండు రసములు కాజాలవు. ఇంతటితో తృప్తినందక కరుణ ఒక్కటే రసమని గూడ పలికినాడు.

"ఏకో రసః కరుణ ఏవ నిమిత్త భేదా
ద్భిన్నః పృథక్పృథగివ శ్రయతే వివర్తాన్

ఆవర్తబుద్బుద తరఙ్గమయాన్వికారాన్
అంభో యథా సలిలమేవహి తత్సమస్తమ్"

అని ఉత్తరరామ చరిత్రలో గలదు. ఏకైక రసమగు కరుణ నిమిత్త భేదవశమున అనేక రూపములుగా వివర్తింపబడగా శృంగారాది రసములు వచ్చుచున్నవి. జలమున కన్పించు తరంగాది వికారములవలె భిన్న రసములు, ఈ తరంగముల నిజస్వరూపము జలమువలె కరుణరసమున గలవు. శృంగారాదులు కరుణయొక్క ప్రాతిభాసికరూపములని భావము. సఖిత్వ, పతిత్వ, పత్నీత్వాద్యుపాధి భేదములవలన విలక్షణముగా కరుణరసము కన్పించుచున్నది. వ్యంజకవిభావాది విచ్ఛిత్తివిశేషవశమున పరస్పర విలక్షణ శృంగారాద్యాత్మకములగు వ్యస్త పరిణామములను కరుణరసమందుచున్నది. అనగా కరుణరసమున పర్యవసితము లగు శృంగారాదులకే రసత్వము సిద్ధించగలదు.

ఉపహితత్వము, దుఃఖము, అఘర్మము అనునవి లౌకిక జగమున మనకు పరిచితములగుచున్నవి. ఏవిధమైన యనుభూతి కల్గినను అంగీకరించజాలవు. తీవ్రతమమగు ఆత్మాభివ్యక్తియే ప్రయోజనముగాగల మన అనుభూతులలో దుఃఖాదులు తిరోహితములు కాజాలవు. కావుననే విషాదరూపకమున మన అనుభూతులలో విశిష్టము, శాశ్వతమునగు విషయము ప్రతీతమగుచున్నది. ప్రాచుర్యమువలన, రాగి విరాగి సాధారణ్యమువలన, కరుణయే ప్రధానమైన రసమగుచున్నదని వీరరాఘవ వ్యాఖ్య.

మానవజీవితము దుఃఖానువిద్ధ మగుటచే విశ్వప్రవృత్తికి ప్రతీకగా కన్పించగలదు. ఈ దుఃఖము తీవ్రముగా అనుభూతమగు కొలది ఆత్మవిస్మృతి వికాసము లద్భుతంతములు కాగలవు. విషాదరూపకమున కతీతమై, ఈ రూపకమును తనలో నంతర్లీనముగా చేసికొనియున్న కరుణరసమున ప్రపంచ రహస్యమే ప్రతీతమగుచున్నదో యన్నట్లుండునని "ఎ సి. బ్రాడ్లే" (A. C. Bradley) పల్కినాడు. విషాదపాత్రల దుఃఖానువిద్ధసమయములలో కన్పించు ప్రేమోత్సాహములముందు వారు పడు బాధ అతి స్వల్పమని పించగలదు. "నశించుచున్న ఈ అత్యుత్తమ జీవులు దేశకాలోపహితమగు నీ జగమతి స్వల్పమైనదగుటచే నిచట స్వేచ్ఛగా తిరుగజాలరేరని, భౌతికముగా నశించుచున్నను అలౌకికమగు స్వేచ్ఛను, స్వాతంత్ర్యమును పొందుచున్నారని మన మొక్కొక్కప్పు డుద్ఘోషించగలుగుచున్నాము. క్రోధ, భయ, వైక్లవ్యాదులు, శక్తిహ్రాసము, దైన్యము, విషాదము అనునవి కేవలము భ్రమాత్మకములని, స్వప్నమాయా సన్నిభములని మాటిమాటికి మన కీ సన్నివేశములయందు స్ఫురించుచున్నది" అని "ఏ సి. బ్రాడ్లే" (A. C. Bradley) చెప్పియున్నాడు. పారమార్థికదృష్ట్యా ఈ విషాదమునకు విషాదత్వమే లేదను విశ్వాసము మనకు కలుగుచున్నది.

విషాదసన్నివేశమున నతితీవ్రమగు బాధ కలదు. ఈ బాధను ఓర్చుటకు తగిన శక్తిసామర్థ్యములు, స్థైర్యోత్సాహములు లేనిచో మానవుడు కూలిపోగలడు. గ్లాని, ఆవేగము, శ్రమ, మోహము, అశ్రుపాతము, పరిదేవనము, వైవర్ణ్యము, ప్రస్తగాత్రత మొదలగున వప్పుడు కన్పడగలవు ఇంత మహత్తరమైన బాధయున్నను ఇచ్ఛాశక్తి, సంవేదనా పాటవము, భావనామహిమ, బుద్ధిబలము, ఆత్మవిశ్వాసము అను వాటిని విషాదపాత్ర కోల్పోవుటలేదు గనుకనే మానవ దుఃఖానుభూతికి ప్రతినిధిగా నిలబడగలుగుచున్నాడని "ఫోల్కెల్ట్" (Volkelt) పలికినాడు. అస్వాభావికముగా ప్రవేశించిన చిత్తవైక్లవ్యములను నశింపజేయగలిగిన కరుణ ప్రతీతియందు సమన్వితమై, విశ్రాంతియుతమై ఆత్మ భాసించగలదు. కావుననే కరుణరసాస్వాదము దుఃఖమయమగుటగాని, బాధాకరమగుటగాని లేదు. సహజ దుఃఖాత్మకత్వము కరుణలో నున్నచో సామాజికు డెవ్వడును కరుణరస ప్రతీతిని వాంఛించజాలడు. దుఃఖమున నంతర్లీనమై అలౌకికమగు పురుషార్థమున్నదని తెలిసికొన గలుగుచున్నాము.

విషాదము జీవితవిరోధి కాదు. ఎక్కడనుండియో వచ్చి జీవితమును ప్రవేశించునదియూ కాదు. విషాదమున భ్రమాత్మకత్వప్రతీతి లేదు. ప్రమాతృప్రమేయములకు గల భేదముల నంగీకరించని అలౌకిక సూత్రమునుండి ఉత్పన్నమగునది దుఃఖము. ప్రమాతృప్రమేయము లసంబద్ధములని ప్రదర్శించు నీ విషాదము, ప్రమేయమందే ప్రమాతగలడని చెప్పుచున్నది. కరుణజగమున లోకోత్తరమగు తత్త్వము ఒక విశిష్టరూపమున నభివ్యక్తమగుచు, విశ్వమున దాగియున్న రహస్యమును వ్యాఖ్యానించ యత్నించును. కాని ఈ వ్యాఖ్యలో మనకు పూర్తిగా జ్ఞానగోచరమగు విషయము కన్పించకపోవుటచే, నేదో ఒక మహత్తరమగు పురుషార్థము అనిర్వచనీయముగా

భాసించుచు, సమగ్రత్వప్రతీతికై జగము పను భేదములను సూచించుచు, ఈ భేదమున సుఖదుఃఖములు, ధర్మాధర్మములను ఉత్పన్నము చేయుచున్నదని గ్రహించుచున్నాము. స్వనాశాదిరూపమగు ఆత్మార్పణమువలననే మానవుడీ అధర్మమును జయించగలుగుచున్నాడు. ఇట్టి అనిర్వచనీయమగు పురుషార్థమే కరుణరసమున గలదు. ఈ పురుషార్థసాధనయందాత్మనాశము కన్పించుటచే కరుణరసము శోకప్రభవమగుచున్నది. ఆత్మనాశమున మృత్యువు మొదలగునవి కన్పించినను, ఇందాత్మ నశించుటలేదని, ప్రాకృతస్వరూపమును పరిత్యజించి అనుపహితమగు స్వరూపస్వభావములతో నాత్మ కన్పించుచున్నదని మన కవగతమగుటచే నీశోక ముత్సాహజనకమే యగుచున్నది.

## 4

కరుణరసము సర్వానుగ్రాహకమగుటచే అన్ని విషయములకు నిచట అనుప్రవేశము కలదు. ప్రతివిషయము స్వస్వరూపస్వభావములతో భాసించుచు భిన్నజ్ఞానమునకు తావొసగుటలేదు. ఇందు పరిత్యక్తమగుచున్న విషయమేమియు కన్పించదు. అన్ని విషయములు పరస్పరసంబంధములచే నావిష్టములై, సమ్యగన్వితములగుచున్నవి. ఇట్టి అవస్థ దుఃఖజనకము కాజాలదు. కాని మానవునకు ప్రవృత్తికి గల సన్నిహిత సంబంధముద్వారా విషాద ముత్పన్నమగుచున్నది. మానవస్వభావము ననుసరించి ప్రవృత్తి వచ్చుచున్నది. మానవుడొక విషయము నుద్దేశించి ప్రవృత్తుడగుచున్నాడు. అతి ముఖ్యములగు ప్రవృత్తులలో నుద్దేశించిన దొకటి, సిద్ధించునది వేరొకటి. తానొకటి దలచిన దైవమొకటి తలచునన్నాడు. కాని సిద్ధించు ఫలితము ఆప్రవృత్తి గలిగిన మానవస్వభావము నాశ్రయించుకొనియే వచ్చుచున్నది. స్వతంత్రుడైన మానవుని ప్రవృత్తి మానవస్వభావాధీనము. ఈ ప్రవృత్తివలన నిష్పన్నమగు ఫలితము మానవస్వభావ పరిపోషకమగుచున్నది. అనగా మానవస్వభావమునుండి బయలుదేరు ప్రవృత్తి మానవస్వభావమునే పోషించుచున్నది ఇట్లు అవినాభావ సంబంధముగల స్వభావ ప్రవృత్తులలో చిక్కుకొనినవాడు మానవుడు. ఈ చిక్కుకొనుటవలనే చిత్తవైక్లవ్య హేతుకమగు భావసంఘర్షణ, ఆధ్యాత్మిక విక్షేపము కలుగుచున్నది

ఈ సంఘర్షణను గర్భసంధి యనినారు "దృష్టనష్టస్య బీజస్యాన్వేషణం ముహుః" అని గర్భసంధిని సమీక్షకులు నిర్వచించియున్నారు. నష్టమగు విషయమెంత ఆంతరంగికము, ఆధ్యాత్మికమునైన అంత మంచిది. సంఘర్షణకారకములగు భావము లాధ్యాత్మికములు. వీటిని ధర్మాధర్మము లనవచ్చును. ధర్మాధర్మములు రెండును పారమార్థిక తత్త్వముయొక్క విభిన్నోపాధులే అని చెప్పనక్కరలేదు. విషాదపాత్ర వీటిలో నొకదానిని ఏరుకొని, రెండవదానిని తిరస్కరించుచున్నాడు. తానేరికొనినదే ధర్మమని, మిగిలినది అధర్మమని అహంకారమును పోషించుకొనుచున్నాడు. తద్ద్వారా అవిభాజ్యమగు పారమార్థిక తత్త్వమును రెండుగా విభజించి, రెంటికి వైలక్షణ్యము నాపాదించి, ఒకదానితో తాదాత్మ్యమంది రెండవదానిపై కత్తిదూయుచున్నాడు. తత్త్వముయొక్క ఒక విశిష్టరూపమునకు, మరియొకరూపమునకు అవాస్తవికమగు సంఘర్షణ తీసికొనివచ్చుట, దానిని నిర్వహింపగల్గుట మానవునకు సాధ్యము కాని కృత్యమగుటచే విషాదము ప్రతీతమగుచున్నది. కాని అద్వితీయము, పారమార్థికమునగు విషయమున సంఘర్షణను తీసికొని రాగలిగిన శక్తి, స్థైర్యము, ఉత్సాహము, ప్రతిభ కొనియాడదగినవి. వీటియందు ఆత్మోత్కర్ష, ఆత్మశక్తి కన్పించుచున్నవి. ఈ సంఘర్షణలో మానవుడు భౌతికముగా కూలిపోవుచున్నను, ఆధ్యాత్మికముగా విజయవంతుడే యగుచున్నాడు. లౌకిక ధర్మాధర్మ వివేకము పారమార్థికము కాదని, తాను పరిచ్ఛిన్నుడు కాజాలడని, తత్త్వమునకు తనకు భేదము లేదని అభివ్యక్తము చేయుచున్నాడు. ఈ అభివ్యక్తి వలననే హృదయసంవాదము, ఆర్ద్రాంతఃకరణ, ఆదరాభిమానములు, భయము, ఉత్సాహము, విస్మయము మనకు కలుగుచున్నవి. అనగా కరుణాద్భుతము లొకే ఒక విషయముయొక్క ముఖ్యరూపాంతరములని స్పష్టమగుచున్నది. కరుణప్రతీతివలన విషాదపాత్రలో మానవత్వము, అద్భుతప్రతీతివలన దివ్యాంశ అవగతములగుచున్నవి. మానవత్వ దివ్యాంశల సంవలనమే జీవితము.

ఉత్తమజీవితము లోకమున వ్యర్థమగుటచే మనకు దుఃఖము కలుగుచున్నది. ఈ దుఃఖమున మనలనావేశించు దైన్యము జీవితమునుగూర్చి మనల నుదాసీనులను చేయగల్గుచున్నది. ఏతదౌదాసీన్యజనితమైనది నిష్కామభావన. కాని నిష్కామభావనలో ఆత్మసంస్కారమభిప్రేతమగుటచే సాపేక్షముగా కరుణరసమున నిది భాసించుచున్నది. భయంకరము, విస్మయజనకము, అనిర్వచనీయమునగు నీ భావన

అధ్యవసాయాత్మకముగు బుద్ధిని వ్యాకులపరచునది, తన కృత్యములకు తా ననుభవించక తప్పదని మనము అంగీకరించుచున్నను, విషాదపూరితుడగు మానవునకు భరింపరానిది, అసమంజసమైనది, తను చేసిన కృత్యమునకు మించినదియునగు దుఃఖము కలుగుచున్నదని కరుణరసమున చూచుచున్నాము. తద్ద్వారా, ఆర్ద్రమనస్కులమై సాపేక్షభావనతో కరుణరసము ననుభవించగలుగుచున్నాము. ఇట్టి దుఃఖమును తెచ్చినది మన కిష్టతమమగు తత్త్వమగుటచే, నీ తత్త్వము మానవుని దయార్ద్రదృష్టితో రక్షించక పోయినను మన మీతత్త్వమును,విషాదగ్రస్తుడగు మానవునికూడ ప్రేమించుచు, గౌరవించ గలుగుచున్నాము. ఏవం విధమగు తత్త్వముతో కయ్యము సలుపుటయే కరుణరసమున కాధారభూతమైన విషయము.

ప్రతి విషాదరూపకమున నొక విచిత్ర సన్నివేశముకలదు. ఉత్తర రామచరితలో గర్భిణియగు సీత ఆశ్రమవాసులగు మునులను దర్శింపగోరినది. కాని ఆమె కది వనవాసరూపమున, భర్తృపరిత్యాగ రూపమున సిద్ధించినది. ఇదే సందర్భములో శకుంతలయున్నచో ఇట్లర్థించెడిది కాదు. అనగా నే సందర్భములనుండి పాత్రలు జయప్రదముగా బయటపడజాలరో, ఆ సందర్భములయందా పాత్రలు మాత్రమే కన్పించుచున్నారు. సీతకు కల్గిన సన్నివేశము శకుంతలకుగాని, శకుంతలకు సందర్భించిన సన్నివేశము సీతకుగాని కల్గిన ఈ నాటకము లిట్లుండెడివి కావు. జయప్రదముగా బయటపడగలిగిన సన్నివేశములు తప్ప మిగిలిన సన్నివేశములే వీరలకు సిద్ధించుచున్నవి. ఈ సన్నివేశములలో నీ పాత్రల కెన్ని సద్గుణములున్నను, అవన్నియు వారి దుఃఖమునే పోషించుట కుపకరించుచున్నవి. తద్ద్వారా సుఖదుఃఖ సమ్మిశ్రితము, ధర్మాధర్మ సంవలితమునగు జీవితమున సుఖధర్మములనుండి దుఃఖాధర్మములు వ్యక్తములై సుఖధర్మముల కవిశ్రాంతిని కల్గించ గల్గుచున్నవి. ఇట్లు రజోవృత్తి ఎక్కువగుకొలది సత్త్వము తిరోహితము కాగలదు, కావున తమ కాశ్రయ మొసగిన శక్తితో పోరాడుచు, తాము గౌరవింపవలసిన శక్తిని తామే తృణీకరించుట ప్రతి విషాదఘట్టమున కన్పించుటచే శోకమునకు శ్లోకత్వము, కరుణకు రసత్వము సిద్ధించుచున్నవి.

సంస్కృత వాఙ్మయమున ఊరుభంగము మొదలగు అపరిచిత రూపకములను వదలినచో, పూర్తిగా విషాదమునే అభివ్యక్తము చేయు విషాదాంత రూపకములు కన్పించవు. అనగా గర్భసంధితో నిలిపివేయబడుచున్న రూపకములు శాస్త్రీయములు కాజాలకున్నవి గర్భసంధి దాటిన తర్వాత విషాదము క్రమక్రమముగా సుఖముగా పరిణమించుచున్నది.

కావ్యజగమున కన్పించు విషాదము బాహ్యజగమున కన్పించు పరిచ్ఛిన్నత్వముకంటెవని "హెగెల్" (*Hegel*) పలికినాడు. పరిచ్ఛిన్న విషయములన్నియు అపరిచ్ఛిన్నముగు, అనుపహితమునగు తత్త్వమున పర్యవసితము లగుట అయా విషయముల స్వభావములయందే కన్పించుచున్నది. ఇట్లే పరిచ్ఛిన్న మనబడు విషాదముకూడ తద్భిన్నమగు సుఖమున పర్యవసితమై తీరవలెను. తత్త్వముయొక్క ఉపహితాంశ యగు విషాదము విషాదభిన్నమగు విషయమున లీనమై నిజస్వరూప స్వభావముల నందగలగు. కావుననే సుఖదుఃఖములకు వాస్తవముగా నభిన్న స్వభావమే కలదని చెప్పగలుగుచున్నాము. తత్త్వముయొక్క అంశయగు విషాదము, తత్త్వమున లీనమై విషాదత్వరహితమగుచున్నది. కావుననే రూపకచరిత్రలో విషాదాంత నాటకములు, సుఖాంతములగు రూపకములకు తావొసంగినవి. అందుచే సంస్కృతరూపకములు గర్భసంధితో నాగిపోలేదు.

విశ్రాంతి లక్షణమగు ప్రతీతి కావ్యానుశీలనమున గలదని చెప్పియున్నాము. సమగ్రమైన ఆత్మవిశ్రాంతి కావ్యజగమున రసములద్వారా సంభావ్యము సాధ్యమునగుచున్నది. ఈ ఆత్మవిశ్రాంతి కంతరాయములు కల్పించునవి రసములు కాజాలవు. రూపకము పూర్తిగా విషాదమయమై, విషాదాంతమైన నేవంవిధమగు ఆత్మవిశ్రాంతి లభించదు. అనగా కరుణకు రసత్వము సిద్ధింపవలె ననిన విషాదము తద్భిన్న విషయమగు సుఖమున నెట్లు పర్యవసితము కాగలదో చెప్పితీరవలయును. కావుననే వ్యంజనావ్యాపారసమాశ్రితమగు కరుణరసము గర్భసంధిలోని ఆత్మవిశ్లేషముతో సమాప్తినొందక, నిర్వహణసంధిలో అనుపహితముగా, అపరిచ్ఛిన్నముగా ప్రతీయమానమగుచు విశ్రాంతి లక్షణ లక్షితమగు ఆత్మానుభూతి నొసగుచున్నది. తద్ద్వారా కరుణరసమున అద్భుత రసప్రతీతి కన్పించుచున్నది. ఇట్టి కరుణరసమే సంవిద్రూపమగును.

# వాత్సల్యం

"బాలకృష్ణ"

మోహనుకు జ్వరం చాలా ఎక్కువగా ఉంది. 'నూటరెండు' అన్నాడు డాక్టరు. నీలిమ హృదయాన్ని ఆమాట కలచివేయ సాగింది.

"అబ్బే యీ సామాన్య జ్వరానికి భయమేమీ లేదండీ రేపు పొద్దుట యీపాటికి తగ్గిపోదూ"

అని ం చెప్పి డాక్టరు జారుకున్నాడు. మాటలు అలా చెప్పాడు కాని డాక్టరు ముఖంమీద రోగిని చూచినప్పుడు పొడసూపిన నిరాశా రేఖల్ని, ఆతురతతో చిన్ని అశుభసూచనలైనా పసికట్టే నీలిమకళ్లు గమనించకపోలేదు. అటునుంచి యిటు తిరిగి హృదయాన్ని చీల్చుకువచ్చే విచారాన్ని పైట చెంగు నోటికి అడ్డుపెట్టుకుని ఆపుకుంది. కంటినీరు చూస్తే భర్త కేకలు వేస్తాడని, నీలిమ బాధను హృదయంలోనే అణుచుకుంటూ కళ్లు తుడుచుకుంది. కంటినుండి చెక్కిలిమీదకు జారిన కన్నీటి చార అల్లాగే ఉండిపోయింది. అది యింక చెరగదేమో.

డాక్టరుబూట్లధ్వని హఠాత్తుగా ఆగింది. నీలిమ ఒళ్లంతా చెవులు చేసుకుని వింటోంది; డాక్టరు ఏమిచేస్తాడో విందాం అని. ఆమె హృదయం అశ్లీలాన్ని శంకిస్తూ వేగంగా కొట్టుకుంటోంది. డాక్టరు భర్తతో "ఈరోజు దాటితే రోగి బ్రతుకుతాడు"అని చెపుతున్నాడు. నీలిమ హృదయం పగిలింది. ఆపుకోలేక 'భోరు'మని ఏడ్చింది. భర్త లోపలకువచ్చి "అబ్బే అదేమిటి అల్లా అధైర్యపడకూడదు ఇప్పుడేగా డాక్టరుగారు యింక తగ్గిపోతుందని చెప్త". నీలిమ ఎందుకు ఏడుస్తోందో అతనికి తెలుసు. ఇద్దరికీ తెలుసు మృత్యువు ఛాయలు రోగిని కప్పుతున్నాయని. అయినా ఒకరికి ఒకరు ఆమాట చెప్పుకోరు. ఆమాట అంటే అమితమయిన భయంతో వణకిపోతారు. "ఇదుగో యింక యిల్లా ఏడవటం మొదలుపెడ్తే యీ యింట్లో బ్రతకటం నా తరంకాదు జంధ్యాలు తెంపుకుపోతాను యెక్కడికయినా" నీలిమకు తెలుసు అతడు అంతటి సాహసి అని.

నీలిమ భర్తపేరు మాధవరావు. ఇప్పుడు న్యాయవాదవృత్తి చేస్తున్నాడు. నీలిమను యిద్దామని నీలిమ తండ్రి వెళ్ళినపుడు ఖచ్చితంగా చెప్పేశాడు మాధవరావు 'నే పెళ్ళిచేసుకోను' అని. అయినా పెద్దలు "తప్పదు తల్లిలేని పిల్ల మేనరికం వాళ్లు చేసుకోకపోతే ఎవరు చేసుకుంటారు" అన్నారు. 'తప్పించడం నా చేతులోది'అని అజంతా ఉడాయించాడు. చాలాకాలం చాటుగా తిరిగాడు. చివరకు పట్టుకుని పెళ్లిచేశారు పెద్దలు. పెళ్లి అయిన తర్వాతకూడా చాలాకాలం అత్తవారింటికి రాక, చాలా మారాము చెయ్యడం, మామగారు పోయిన తర్వాత నీలిమను తీసుకువెళ్ళడం...అంతా మరొక గాథ.

హృదయం పగిలిపోతున్నా, భర్త మాటమీద నోరు మూసుకుని మూగబాధను అనుభవిస్తోంది నీలిమ. 'నిన్ను చూస్తే వాడు ఎంత బెంగపెట్టుకుంటాడో తెల్సా' అని మందలించాడు మాధవరావు. ఈమారు నీలిమ కంటిధార కట్టువడింది. మోహను ఇది చూస్తే ఎంత బెంగపెట్టుకుంటాడు. తను సంతోషంగా పరిచర్యలు చేస్తూఉంటే కోలుకోవచ్చు. తన ప్రేమతో తన ఆయుర్దాయాన్ని సగంచేసి మోహనుకు పొయ్యలేదూ..."ఈరోజు దాటితే___" ఆశారేఖ 'తళుక్'మంది. తను వెయ్యికళ్లతో కాస్తూ ఉంటుంది రోగిని, ప్రాణం ఎల్లా పోతుందో చూస్తుంది.

మోహనుకు తొమ్మిదిఏళ్లు. ముఖంమీద నీరసం ఏదో నిరాశ తాండవిస్తోంది. అప్పుడే అది ఇరువదవ లంఘణం. మరణం అంటే అతనికి ఏమీ తెలియదు. కాని తను మరణిస్తే మళ్లీ వదినను చూడలేడు అని మాత్రం తెలుసు. అందుకోసమే అతనిలో ఏదో ఆవేదన ఆరంభమయింది. ఇరవయిరోజుల క్రితం అమ్మ చచ్చిపోయింది. అది చూశాడు. అంతా ఏడ్చారు. తనూ ఏడ్చాడు గుండె పగిలేలా. ఎవరో ఒకామె వచ్చి 'ఎందుకు నాయనా అల్లా ఏడుస్తావు మీ అమ్మ

మీ నాన్న పిలిస్తే అక్కడకు వెళ్ళింది' అని చెప్పింది. 'నాన్న ఎక్కడ ఉన్నారు' అనడిగాడు మోహాను అమాయకంగా. 'స్వర్గంలో' అని చెప్పిందామె సమాధానం. "మరి అయితే ఎక్కడకు వెళ్లినా మా అమ్మ నన్ను తీసుకువెళ్లేది ఇప్పుడు తీసుకువెళ్లలేదేం' అని అడిగాడు. 'కొన్నిచోట్లకు పెద్దవాళ్లే కాని పిన్నవాళ్లు వెళ్ళకూడదు' అని సమాధానం.

'ఏం ఎందుకు వెళ్ళకూడదూ?'

"స్వర్గంలో చాలా సౌఖ్యంగా ఉంటుంది. కాని గుమ్మంవగ్గర పెద్దభూతం ఉంటుంది. దాన్ని చూస్తే నువ్వు భయపడతావు. అందుకు నిన్ను తీసుకు వెళ్లలేదు."

'అమ్మకి భయం వెయ్యదూ?'

'మీ అమ్మ చాలా భూతాల్ని చూడటం నేర్చుకుంది. ముందు మీ నాన్న నేర్చుకుని స్వర్గానికి వెళ్ళిపోయారు. అప్పుడు మీ అమ్మ కూడా తనను తీసుకువెళ్లమని ఏడ్చింది—కాని మీ అమ్మ అప్పటికి భూతాలను చూడటం నేర్చుకోలేదు. అందుకు మీ నాన్న తీసుకు వెళ్ళలేదు. పెద్ద అయినతర్వాత నీకు కూడా భూతాలను చూడటం, భయపడకపోవటం అలవాటు అవుతుంది. అప్పుడు నువ్వు కూడా వెళ్ళవచ్చు'

"మీకు చాతవచ్చా భూతాలను చూడటం?'

'ఇంకా పూర్తిగా రాదు. అందుకే నేను ఉండిపోయాను' అని సర్ది చెప్పింది ఆ యిల్లాలు.

ఆమె చెప్పింది చూస్తే సరిగానే ఉంది. తను కూడా భూతాలను చూడటం నేర్చుకుంటే, అమ్మదగ్గరకు వెళ్లవచ్చు అనుకున్నాడు. ఆవాళ రాత్రి యిల్లంతా చాలా హడావుడిగా ఉంది. చాలా మంది చుట్టాలు వచ్చారు. వాళ్లంతా అమ్మ ఎంత ధైర్యం గలదో భూతాల భయం తొందరగా వదుల్చుకుంది అనుకుంటూ చాలా యిదిగా ఉన్నట్టు అనిపించింది. ఒకళ్ళిద్దరు మోహన్‌ని ఒళ్లోకి తీసుకుని 'అయ్యో యీచిన్నివయసులోనే నీకెంత బాధొచ్చిందిరా' అని రాగాలు తీశారు. వాళ్లు ఎందుకు అల్లా ఏడుపుమొఖాలు పెట్టారు అని ఆలోచించాడు చిన్ని మోహాను. అమ్మ సుఖపడేందుకు వెళ్తేమాత్రం తనకి బాధకదూ అమ్మ తనను వదలివెళ్తే...తన బాధచూసి వాళ్లు బాధపడ్తున్నారు అని సమాధానం చెప్పుకున్నాడు. నిజంగా అందుకే అయిఉంటుంది. వెర్రివాళ్ళల్లా ఉన్నారే తను అంత బాధపడటం లేదనీ, తొందరగా భూతాలదగ్గిర భయం వదుల్చుకుని తనూ వెళ్లిపోతున్నాననీ చెప్దాం అనుకున్నాడు. ఇంతలో వదినవచ్చి తనను చేతుల్లోకి తీసుకుని 'అతనికేం తెలుసు...మీరేం పరామర్శచేసి బాధ పెట్టొద్దు' అని తనని దూరంగా తీసుకువెళ్లింది.

రోజూ మోహాను 'అమ్మ'పక్కన పడుకునేవాడు. అమ్మ కథలు చెప్పేది అమ్మ కథ చెప్తూ ఉంటే అల్లా నిద్ర ఎప్పుడో ముంచుకువచ్చేది. తను నిద్రపోయేవాడు అమ్మమీద చెయ్యి వేసుకుని. ఆవాళ అంతా వదిన తనను వదలిపెట్టలేదు. అన్నయ్య అసలు కనపడనేలేదు. ఆవాళ అన్నంతినే బుద్ధివేసింది కాదు. వదిన, దగ్గరకూర్చుని కలిపి పెడ్తోంది.

"వదినా అమ్మ, నాకు యిల్లా అన్నం కలిపి పెట్టమని చెప్పి వెళ్ళిందా."

"అవునమ్మా' అని ముఖం అటు తిప్పుకుంది.

ఇల్లా పెట్టడం వదినకి కష్టమేమో వదిన ఇల్లా కలిపిపెట్టడం యిష్టంలేక ముఖం తిప్పుకుందేమో. వదిన కళ్ళవెంట నీళ్లు కారుతున్నాయి.

"ఇల్లా ఏడుస్తూ పెట్టేమాట ఉంటే, నేనే కలుపుకు తింటాలే!...

'లేదునాయనా ఏడవనుగా' అని ఒళ్ళోకి తీసుకుంది నీలిమ. మోహాను ఆమెవడిలో ఒదిగిపోయాడు. ఇంకా దగ్గరగా హృదయానికి హత్తుకుంది. అదోలా ఉంది. వదిన చాలా మంచిది.

'చాలా మంచివాడవు. యిది తిను మరి'

ఒదిన చాలా మంచిది. నెమ్మదిగా మోహానుకు వదినకూడా అమ్మలా తనను వదిలి స్వర్గం వెళ్ళిపోతుందేమో నని అనుమానం వచ్చింది.

"నువ్వుకూడా నన్నువిడిచి స్వర్గం వెళ్ళిపోతావా వదినా?"

చిట్టెమరది, అమాయకత్వంతో తనకు తను సమాధానం చెప్పుకోవడం చూస్తే, గుండె తరుక్కుపోయింది.

"నేను చెప్తున్నాగా నిన్నువిడిచి నేను ఎక్కడికీ వెళ్ళను. ఇంక బెంగలేదులే తిను" అని తినిపించింది అన్నం. ఎందుచేతో మోహాను తినలేకపోయాడు.

"పోనీలే సయించకపోతే" అని పీటమీదెత్తి మరది మూతికడిగింది నీలిమ.

ఆవాళ మోహనుపక్కన నీలిమ పడుకుంది. సరిగా అమ్మలాగే; అల్లాగే మీద చెయ్యివేసి. మోహను నిద్రపోయేందుకు ప్రయత్నిస్తున్నాడు. ఆలోచనలు, సందేహాలు... "అమ్మ ఈపాటికి స్వర్గం చేరిఉండవచ్చు' అనుకున్నాడు. సుమ్మందగ్గర భూతాన్ని దాటి ఉంటుంది. ఏమో ఆ భూతం అమ్మను మింగేసిందేమో. ఎల్లాగ తెలుస్తుంది?

"ఒదినా ఒదినా మరి ఆ భూతం అమ్మను మింగ య్యేదా?"

"అబ్బే మింగడం దానికి చేతకాదు."

'ఉహు అల్లాగా' అనుకుని మోహను నెమ్మదిగా కన్ను మూశాడు, తను భూతాలను ఎల్లా తొందరగా అలవాటు చేసుకుని అమ్మదగ్గరకు పోతానా అని ఆలోచిస్తూ.

ఈమధ్య రాత్రులు భూతాలు కనపడుతున్నాయి. మొదటి రోజున చాలా భయం వేసింది. పిచ్చిగా గావుకేక వేసి వదిన మెడకు చేతులు చుట్టి అల్లా బిగుసుకు ఉండిపోయాడు. "ఏమిటి నాయనా.. యిల్లా చూడు నీకు భయమేముంది. చెప్పు?..."

"ఒదినా...అదుగో...అదుగో...భూతం"

"భయం లేదు నాయనా...అబ్బే భూతం లేదు ఏమీ లేదు...యిల్లా చూడు నేను..."

"అదుగో వదినా...అక్కడా...భయం ..."

"మీ అన్నయ్య ఉన్నారు. నేను ఉన్నాను. నీకేం ఫరవాలేదు. భూతం వచ్చినా మేము కొట్టి పంపేస్తాము. ఇంక నిద్దరపో" అని ప్రక్కన పడుకుంది నీలిమ.

'ఇల్లా భూతాలంటే భయపడ్తే ఎల్లా? వాటి దగ్గిర అలవాటు చేసుకోవాలి. అమ్మదగ్గరకు వెళ్లాలి' అని ఆలోచిస్తూ పడుకున్నాడు. భూతాలు కనపడుతూనే ఉన్నా, నెమ్మదిగా అలవాటు పడుతున్నాడు మోహను రోజులు తిరుగుతున్నకొద్దీ. రోజూ ఆ దినంనుంచీ కొద్దో గొప్పో జ్వరం తగుల్తూనే ఉంది. మొదట్లో కొంచెం భయపడ్డాడు కుర్రాడు అనుకున్నారు. అది టైఫాయిడులో దింపింది.

నీలిమ, భర్త మందలింపుతో కళ్ళు తుడుచుకుని రోగి మంచం దగ్గరకు వెళ్లింది. మోహను మూసిన కన్నెరగకుండా ఉన్నాడు. నీలిమ హృదయంలో ఏదో ఆవేదన ఆరంభమయింది. దగ్గరకు పోయి మీద చెయ్యివేసి 'బాబూ' అని పిలిచింది. ఎందుకో ఊరికే...కళ్లు తెరిచాడు. "ఇల్లా చూడు నేనూ..." "ఊఁ" అని అటునుంచి యిటు తిరిగి పడుకున్నాడు.

"ఒదినా నాకు భూతాలదగ్గర అలవాటయిపోయింది; ఇక అమ్మదగ్గరకు పోవచ్చు కదూ...?" స్పష్టంగా, ఆరోగ్యంగా ఉన్న మనిషల్లే అడిగాడు మోహను.

"బాబూ ... బాబూ ... యిల్లా చూడు ... నేను... నేను ...నీ ఒదిన్ని..."

కళ్లు విప్పిచూసి 'ఒదినా' అన్నాడు.

'ఆ నేనే...ఒదినను ఏంకావాలి బాబూ..."

"అమ్మదగ్గరకు వెళ్తున్నా..."

"నే అమ్మదగ్గరకు వెళ్తున్నా వదినా!..." నీలిమ నోటిలో గుడ్డ కుక్కుకుని బావురుమంది.

## 2

మోహను నెమ్మదిగా కోలుకుంటున్నాడు. ధైర్యం చెప్తూ వదిన ప్రక్కన పడుకుంటోంది. వదిన మీద చెయ్యివేసుకుని నిద్రపోయేవాడు మోహను ఏవేవో కలలుకంటూ. ఒక్కరోజున ఏవో కబుర్లు చెప్పేవాడు వదినతో. తల్లి లేని ఆ బిడ్డమాటలు వింటూఉంటే కడుపు తరుక్కుపోయేది. మోహనును యింకా దగ్గరకు తీసుకునేది. వదిన కౌగిలిలో కోటలోలా, ప్రశాంతంగా నిద్రలో వాలిపోయేవాడు. తనలో నీరసం అంతాపోయి వదినలో ధైర్యం బలం తనలో ప్రవేశిస్తున్నట్టు అనిపించేది. రోజురోజుకు ఆరోగ్యవంతు డవుతున్నాడు.

'వదినా పుస్తకాలు లేవు...అబ్బబ్బ ఎక్కడ పెట్టావు...ఇప్పుడు బడికి వెళ్లాలా? అవి కనపడక పోతే ఎల్లాగ?"

'నాయనకాదూ కోపపడకు మరి...యిస్తున్నాగా. వస్తున్నా...అన్నయ్య పిలుస్తేను కొంచెం ఆలస్యం అయింది!"

"నేను ఇంక వెళ్లను వదినా బడికి...కుదరదు యిల్లా ఆలశ్యం చేస్తే ఎల్లా?"

అని మారాం చేస్తాడు చిట్టిమరది. ఈమధ్యే పదవ పుట్టినరోజు పండుగ తల్లి లేని లోటు కనపడకుండా జరిగిపోయింది.

'వదినా' అనే పిలుపు వినగానే నీలిమ ఆతురతగా, భర్త పని చూస్తూఉన్నది వదలి మరదిదగ్గరకు వెళ్తుంది. మరదిని గారం చేసి బడికి వెళ్తూఉంటే బుగ్గగిల్లి ముద్దు పెట్టుకు పంపుతుంది.

మోహానుకు భోజనంపెట్టి చదువుకోమని దీపం యిచ్చి, పుస్తకాలు యిచ్చి వంటయింట్లోకి వెళ్లింది.

అతను తన ఊహకు అందినంతవరకు తను చదివే పద్యానికి అర్థం చెప్పుకుంటున్నాడు. "ఆకలేసినపుడు మా అమ్మ తలతు"... ఇది రేపు పొద్దుట అప్పగించాలి. ఒకసారి రెండుసార్లు చదివాడు. ఏవో ఆలోచనలు సాగిపోనారంభించాయి. 'ఆకలేసినపుడు మా వదిన తలతు' అనుకున్నాడు. జోడుపదాల మధ్యనున్న భావాన్ని తనకు తెలిసున్న కొన్ని విషయాలతో కలిపి అర్థం చేసుకుందుకు ప్రయత్నిస్తున్నాడు. అమ్మ అంటే మంచియొక్క పోగు అన్నమాట. తనను అన్నివిధాలా వదిన అమ్మను మరపిస్తున్నా ఎక్కడైనా దెబ్బతగిలితే 'అమ్మా' అనే అంటాడు అనుకోకుండా. అమ్మా అంటే ఏదో బాధ దిగిపోయినట్టు అవుతుంది. అమ్మ స్వర్గానికి వెళ్ళింది అనుకున్నాడు మరోకసారి. అన్నట్టు స్వర్గానికి వెళ్లినవారు కనపడకుండా తిరగగలరట మొన్న అల్లా స్కూలునుంచి వస్తూఉంటే, ఎన్నాళ్లో అయి స్వర్గానికివెళ్లిన వాళ్ళ అమ్మ, ఒక పదిహేనుఏళ్ళ అమ్మాయికి కనపడిందట. ఏవో కోరికలు కోరుతుంటే చూశాడు. వాళ్ల అమ్మ అల్లా కనపడింది కదా తన అమ్మ ఎందుకు తనకి కనపడలేదో అర్థంకాలేదు. ఇది తేలని సమస్య అయిపోయింది. ఆ పద్యం రావటల్లేదు. పద్యం బదులు ఏవో ఆలోచనలు అమ్మగురించి బుర్రలో తిరుగుతున్నాయి. వదినని అడుగుతే వదిలిపోతుందిగా అనుకుని బయల్దేరాడు లోపలకు వెళ్లేందుకు.

అన్నయ్య భోంచేస్తున్నాడు. వదిన గుమ్మం మీద కూర్చుని కబుర్లు చెప్తోంది.

'నువ్వు మరీ గారంచేసి గాడిదలా... తయారు చేస్తున్నావు!'

"అదేమిటండీ అల్లా అంటారు. తల్లి లేని పిల్లాడాయె. బెంగపెట్టుకోడుటండీ..."

"ఒక నెల రెండు నెల్లు ఎన్నాళ్లకయినా ఆ రోజు పాతపడదూ?"

"తల్లి లేని లోటు పాతపడేది కాదు"...

"అవుతే అల్లా నెత్తి నెక్కించుకుని గాడిదలా తయారు చేస్తానంటావు?"

"అది కాదండీ మీరు ఆలోచించటల్లేదు. అతనిది ఎంత సున్నితమయిన మనస్సో..."

"మహా నీకే తెలుసు..."

"అహ అల్లా గట్టిగా అనకండీ...పొరపాటున వినపడ్డా బాధపడ్తాడు. అతనూ ఒక మనిషి అయేదాకా ఆ లోటు కనపడకుండా చూచే బాధ్యత మనదా..."

"ఆమాత్రం బాధ్యత నాకూ తెలుసు...... అతిగా పోతే గాడిదలా తయారు అవుతాడనే నేననేది. రేపు పొద్దుణ్ణుంచి వాడిని బడికి పంపేందుకు దానికీ అల్లా గారం చెయ్యడానికి వీలు లేదు తెలిసిందా?...ఈసారి మారాం చెయ్యనీ చెమడాలు ఎక్కదీస్తాను..."

"పోనీ మీరు చెప్పినట్టే లెండి. మీరేమీ అనకండి. నే నెమ్మదిగా చెప్పిచూస్తాను..."

మోహాను మాటలు వింటున్న వాడు అల్లాగే ఆగిపోయాడు. ఏ వ్యక్తి వినిపోతాడేమో అని వదిన తహతహలాడిందో ఆ వ్యక్తి చెవిని ఆ మాటలు పడ్డాయి. అతను వచ్చిన పని మర్చిపోయి అల్లా నుంచుని ఉండిపోయాడు. ఎందుకో ఆ సమయంలో వాళ్ళిద్దరూ మాట్లాడుతూ ఉంటే తను వెళ్ళకూడదు అనిపించింది వనకకు తిరిగాడు. అయినా...అన్నమాట అమ్మకు వదినకూ తేడా. అదే అమ్మఅవుతే ఇల్లా అన్నయ్య అనేందుకు వీలు ఉంటుందా.? అమ్మలేని లోటు ఇప్పుడు కనిపించింది. దుఃఖము పొంగి పొరలివచ్చింది. అమ్మదగ్గరకు పోతే బాగుండు ననిపించింది. అన్నయ్య వదినతో అల్లా చెప్తూంటే విన్నాడు. రేపు ప్రొద్దుట నుంచి తను ఏంచెయ్యాలి. వదినకూడా 'నే చెప్పిచూస్తా' అంది కదూ. తను వదినను పుస్తకాలగురించి అడగకూడదు. ఏదో ఒకచోట చూసిపెట్టుకుని తనే తెచ్చుకోవాలి. ఇంక తను బడికి వెళ్ళనని మారాం చేస్తే ప్రేమతో "వెళ్లాలి మరి ..మీ అన్నయ్యగారికి మల్లే పెద్ద ఉద్యోగం చెయ్యాలి" అనే వదినమాటల బదులు అన్నయ్య రూక్షరుణనయనాలు ఎదురు అవుతాయి. తను భయం భయంగా భారంగా బడికి వెళ్తాడు. ఇంటికి రాగానే 'వచ్చావా...ఇదుగో ముఖం కడుక్కొని బట్టలు మార్చుకువస్తే మంచి తాయిలం పెడ్తాను' అనేది.

"నేను మార్చుకోను...."

"అవుతే తాయిలం లేదు'...

"పోన్లే తిననే తినను..." అని తాను కోపం నటించినప్పుడు వదిన బతిమాలడం ఇటువంటివి ఇంక ఉండవు. అన్నయ్య, మూడ్టరుకేకలు వినేందుకే తను

బ్రతకాలి. వదిన తనకు దూరంగా ఉంటుంది అల్లా దూరమయిపోతుంది. భరించలేకపోయాడు మోహాను.

లోపలికి పోయి వేసివున్న పక్కమీద పడుకున్నాడు ఇంక చదవలేక. ఏడుపు ఆగలేదు. చెక్కిళ్ళమీద చారలు కట్టాయి కన్నీళ్ళు.

మోహానకు వదిన ప్రక్కన పడుకోవడం అలవాటయిపోయింది. అతనిది చిన్నమంచం. ప్రక్కనే ఆ గదిలోనే పెద్దమంచం. దానిమీద అన్నయ్యా పడుకుంటాడు. అది మోహాను నుంచుంటే అందదు. దాని కోళ్ళుపట్టుకుని చెట్టెక్కినట్టు ఎక్కేవాడు, అప్పుడప్పుడు చిన్నపిల్లలా దానిమీద కూర్చుని వదిన 'నన్ను ముట్టుకోకు' అన్నప్పుడు.

"క్రిందికి రావాలి మరి ముట్టుకుంటానో ముట్టుకు చూపిస్తానో; పైన నాకందని చోట కూర్చోడం ఏమిటి గొప్ప?..." అని బుంగమూతి పెట్టేవాడు.

"ఆహా యికనేం నువ్వు ఓడిపోయావు క్రిందకు వస్తే నువ్వుముట్టుకోవడమే ఏం, ఇప్పుడు పుట్టిన చంటి పాపకూడా ముట్టుకుంటుంది"...

మరిదికి పౌరుషం వచ్చేది.

"ఉండు నీపని చెప్తా. నేను ముట్టుకోలే ననుకుంటున్నావా? నీకే కాదండోయ్ నాకూ చేతొచ్చు ఆమాత్రం" అని కష్టపడి ఒక కోలు పట్టుకుని పైకి ఎక్కేవాడు. నీలిమ మూలకు ఒదిగిపోయేది మరిది ఇక ముట్టుకుంటాడు అని భయపడ్డట్టు. పెద్ద వీరుడిలా వదినను భయపెడ్తూ ముందుకు పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ పరుపుమీద నడిచేవాడు. వదినని ఇట్టే ముట్టుకునేవాడు వదిన తన ముఖంఅంతా ముద్దులతో కప్పేసేది. తను వదిన కౌగిలిలో కరగిపోయేవాడు.

మోహాను అంతవరకూ జ్ఞాపకం తెచ్చుకున్నాడు ఎప్పుడో జరిగిన సంఘటన...తను పరుపు మీద నడుస్తున్నప్పుడు అన్నయ్యా వచ్చాడు.

"వెధవా పరుపు అల్లా తొక్కుతావేమిట్రా మళ్ళీ పడుకోవాలా" అని కేకలు వేశాడు.

తను భయంతో వణకిపోతున్నాడు. వదిన తనని ఒడిలోకి తీసుకుని

"చాల్లెద్దురూ కుర్రవాణ్ణి కేకలు వేస్తారు. మాసిపోతే కొంపేం మునగదు. దుప్పటి మార్చవచ్చు" అంది.

అన్నయ్యా అల్లా కేకలువేస్తే వదిన ఈవాళ ఏమీ మాటాడదు తనను పులికి అప్పగించిన ఎరలా వదిలేసి, భయం వేసింది. వణకిపోయాడు.

అన్నయ్యమాట వినపడింది గదిబయట.

"దొరగారు అప్పుడే మంచం ఎక్కారు"

వదిన ఏమీ మాట్లాడలేదు. వదినముఖం ఒక్కమారు చూడాం అనుకున్నాడు. అన్నయ్యా ఉన్నాడు. భయం వేసింది. నిండా ముసుగు కప్పుకున్నాడు.

అన్నయ్యను చూడటంతో భోజనం దగ్గర వదినతో అన్నయ్యా అంటున్న మాటలు జ్ఞాపకం వచ్చాయి. వదిన దూరమయిపోతుంది. తను ఎల్లాగ భరించడం. దేవుని దయవల్ల అమ్మకు ఈ విషయం ఎల్లాగయినా తెలిస్తే బాగుండును. ఆ అమ్మాయికి వాళ్ళ అమ్మ ఏవో చెప్పినట్టు తనకుకూడా చెప్తే బాగుండును.

వదిన దూరంగా తప్పుకుంటోంది సాయంత్రం సూర్యబింబంలా. ఏదో క్లిక్కుమంది. చీకటి ముసురుకుంది. ఆ చీకటిలో భయం వేసింది.

నీలిమ తెల్లటి చీర కట్టుకుని విచ్చిన కలువలా ఉంది. ఆమె చెక్కిళ్ళు సిగ్గువల్ల ఎరుపెక్కి విరిసీ విరియని గులాబిపువ్వుల్లా ఉన్నాయి.

'నాయనా నిద్రపట్టిందా?' అది వదినకంఠం.

మోహాను ఈ దృష్టిలో లేడు. చీకటిలో దారి లేక తన్నుకుంటున్నాడు.

కిలకిలా నవ్వింది నీలిమ మాధవరావు చిలిపి చేష్టకి.

గది అంతా చీకటి. నీలిమ కిలకిల నిశ్శబ్దాన్ని భంగపరుస్తోంది.

మోహానుకు దారి కనిపించటల్లేదు. ఇటువంటి అవసరం ఇదివరకు రాలేదు. వచ్చిఉంటే వదినను అడిగి ఉండేవాడు. కాని దీనితోవదినకుకూడా సంబంధం ఉంది. అందుచేత వదినను అడగకూడదు అనిపించింది. చీకటిలో చిన్న దీపం దూరంగా కనిపించింది దాని వెనకాల ఎవరో తనవైపే వస్తున్నారు పరకాయించి చూశాడు. అమ్మ... నెమ్మదిగా వస్తోంది. స్వర్గానికి వెళ్ళిన చీరతోటే ఉంది. ఇప్పుడు దుద్దులూ మంగళసూత్రం కూడా ఉన్నాయి. చెవులు రిక్కించుకుని వింటున్నాడు ఆమె ఏమన్నా చెపుతుందేమోనని ఆశగా. ఆమె దగరకు వచ్చి చెవిలో చెవిపెటి 'అవును నాయనా వదినకు అన్నయ్యా ఉన్నాడా మరి...అస్తమానూ నీతో ఉంటే ఎల్లా?... శెప ఇప్పించి వదినకు కష్టం కలిగించకుండా నువ్వే దూరదూరంగా ఉంటూఉండు. వదినని అన్నయ్యకూ

నీకూ మధ్య నలిగిపోయేట్టు చెయ్యకు' అని చెప్పింది. ఏదో సందేహం తీర్చుకుందుకు నోరు తెరవాడు. అమ్మ మాయం అయింది దీపం లేదు. అల్లాగే చేద్దాము అనుకున్నాడు. ఇంక రేపట్నుంచి వదినకు దూరంగా ఉండాలని. నిశ్చయించుకున్నాడు. అమ్మ మళ్లీ కనిపిస్తుందేమోనని ఆశగా చూస్తున్నాడు.

ఏదో 'కిలకిలా' వినిపించింది.

చీకటి ఉండకట్టుకుని భూతంరూపంలో ముందుకు వచ్చి నుంచుంది.

"మీ అమ్మ స్వర్గం వదలి రాకూడదు. ఇక్కడకు వచ్చినట్టు తెలిసింది. వచ్చిందా లేదా నిజం చెప్పు" అని ఉరుముతూ అడిగింది ఆ నలటిభూతం.

ఏమి చెప్పాలో అర్థం కాలేదు.

"రాలేదు" అన్నాడు.

"నిజం చెప్పు" మింగేందుకు నోరు తెరచింది ఆ భూతం.

"అమ్మా..." అని పెద్ద కేక పెట్టాడు మోహాను భయంతో.

వదిన మంచం దిగి వచ్చి ప్రక్కన పడుకుని 'భయంలేదు నాయనా' అని వెన్ను రాస్తోంది.

నిశ్శబ్దంలో మాధవరావు నరాల బిగువు సడల్చుకునే నిట్టూర్పు తన సుఖపుబాటకు అడ్డువచ్చినపుడు కొట్టే పాము బుస్సలా ఉంది.

వదిన అమృతహస్తం వెన్నుమీద పడటంతో భూతం చీకటిలో కరగి మాయం అయింది. ఇంకా గుండె కొంచెం వేగంగా కొట్టుకుంటూనే ఉంది.

'ఏం జరిగింది నాయనా?"

"ఆ...ఆ భూతం వచ్చింది"...

"అబ్బే ఏమీ లేదు యిల్లా చూడు..."

కాని ఆ పదేళ్ల తల్లిలేని కుర్రవాడు ఎదురుగా కనపడి తనను భయపెట్టిన భూతం 'వట్టిది ఏమీ లేదు' అంటే నిజమని నమ్మి మరచిపోగల్గడం అసంభవం. అదీ కాక ఈమధ్య భూతాలు కనపడ్తూనే ఉన్నాయాయెను.

"అవును ఇప్పుడేం లేదు..."

"ఏం లేదు పడుకో నాయనా..."

అని ఒదిన అన్నయ్య కళ్లను చూసేమో ప్రక్కమీదనుంచి లేవబోయింది. వదలని ప్రేమపాశంలా చీర చెరగు పట్టుకుని "ఒక్కసారి యిల్లా పడుకో వదినా" అని ప్రాధేయపడ్డాడు.

"ఒదినా వదినా నువ్వు వెళ్లిపోతే ఆ భూతం మళ్ళీ వస్తుందని భయంగా ఉంది" అని తన భయాన్ని వెళ్లబోశాడు.

"అబ్బే నే నెందుకు వెళ్లిపోతాను. అన్నయ్యకి మంచినీళ్లు కావాలట. యిచ్చివస్తా..." అని లేచి వెళ్ళి అన్నయ్యతో ఏదో చెప్పింది.

విసుగ్గా వాలిపోయాడు అన్నయ్య మంచం మీద.

"అదంతా మనం అనుకోవడంలో ఉంటుంది అంతే...భూతాలు అనేవి అసలు లేనే లేవు" అని సర్ది చెప్పబోయింది, చెయ్యి మీద వేసుకుని ఆమె చేతుల మధ్య ఒదిగి ధైర్యంగా ఊపిరితీస్తున్న మరిదికి.

ఈవిడ నేగా కొన్నాళ్ళ క్రితం భూతాలు ఉన్నాయని ఒప్పుకుంది. ఇప్పుడు లేవంటుందేం?

ఇలా పెద్దాళ్ళు ఎందుకు అబద్ధాలు చెప్తారో అర్థం కాలేదు అయినా ఈనాటి వదిన మాటలు ఊరికే తనకు ధైర్యం చెప్పేందుకు అన్న వే కాని నిజం కావని కనిపెట్టేశాడు. హఠాత్తుగా అతనికి ఆ వయస్సులో రావటం సంభవం కాని సందేహం వచ్చింది. మరి తిరిగిరాని అమ్మను మరపించేందుకు అప్పుడే అటువంటి అబద్ధం ఆడారేమో; ఇప్పుడే నిజమేమో. ఈ విషయాన్ని నమ్మరాదామని శక్తివంచన లేకుండా ప్రయత్నం చేస్తున్నాడు. కాని తన హృదయం ఇన్నినాళ్లుగా పాతుకుపోయిన ఏ నమ్మకంతో తను అమ్మ పోవడంలో బాధను మరచిపోగలిగాడో, ఆ నమ్మకం అపనమ్మకమయినా విడిచిపెట్టలేడు. వదిన మాటలమీద ఎంత విశ్వాసం ఉన్నా ఆ నమ్మకాన్ని కూకటివేళ్లతో కూల్ప్రోయలేక పోతూడు. తను యిన్నాళ్లుగా భూతాలదగ్గిర భయం లేకుండా ఉండటం అలవాటు చేసుకుంటున్నాడు. అవికూడా సుమారుగా మచ్చిక అయిపోయాయి. అయినా భూతాలుకూడా అబద్ధాన్ని సహించవేమో ఇందాకటి భూతం తను నిజం దాచటంచూసి నోరు తెరచింది మింగేందుకు. చీకటి కరడుకట్టుకుంటోంది...కరడు కట్టిన చీకటి పైభాగంలో పొడుగుపాటి కోరలు సానపట్టిన కత్తుల్లా తళుక్కుమన్నాయి...'ఒదినా...ఒదినా' అని పిలిచిన అతని పిలుపు గొంతుకులోనే ఆగిపోయింది. ఒదినమీద తను కూడా చెయ్యివేసి యింకా దగ్గిరగా ఒదిగిపోయి కౌగలించుకున్నాడు. వదిన యింకా దగ్గిరకు తీసుకుంది. ఇరువురి హృదయాలూ యింకా దగ్గిర అయాయి.

'ఇదుగో' అని పిలిచాడు మాధవరావు నీలిమను

మోహను మళ్ళీ ఈ ప్రపంచంలో పడ్డాడు అన్నయ్య గొంతుక వినపడటంతో.

మాధవరావు నిద్రపట్టని విసుగులా దొర్లుతున్నాడు మంచంమీద. అంత మంచంకూడా దడదడ లాడుతోంది అతని చర్యచూసి.

'ఊ'....మెత్తగా అంది నీలిమ నిద్రపోతున్నట్టు పడుకున్న మరదికి నిద్రాభంగం అవుతుందని.

అటునుంచి ఇటు దొర్లి పడుకున్నాడు మాధవరావు.

మోహను ఎందుకో వదిన తనదగ్గర పడుకోవటం అన్నయ్యకు కిట్టదు అనుకున్నాడు అన్నయ్యకు కోపం వస్తుంది వదినమీద, అనికూడా అనుకున్నాడు. వదినకు తను మెలుకువగా ఉన్నట్టు తెలుస్తే తనకు భయం వేస్తుందని కవలదు. అమ్మ చెప్పినట్టు పాపం వదినని తను యిద్దరిమధ్యా బాధ పెట్టకూడదు అనుకున్నాడు.

నీలిమ, మరది నిద్రిస్తున్నాడనుకుని; తన కౌగిలికోటలో రక్షణకోసం తలను దాచుకున్న మరదిని తన కౌగిలినుంచి సడలించి పక్కకు జరిగింది. నిద్రమత్తులో తన చేతులు తీసుకుంటున్నట్టు, చేతులు తీసి అటు తిరిగి పడుకున్నాడు మోహను. నీలిమ 'నాయనా' అని పలుకరించి చూసింది. ఈమాదు వదినను కష్టపెట్ట తలుచుకోలేదు. వదిన తను నిద్రపోతున్నాడనుకోవాలనిపించింది. మోహను పలకలేదు.

"వాడికి అన్ని లక్షణాలూ మప్పావు. సాగుతుంటే సరి గాడిదలా ఉన్నాడు. భయమేమిటి? దానికి సాయం నువ్వ వచ్చి పక్కన పడుకోవటం సరిపోయింది..."

నీలిమ భర్త నోరు నొక్కింది మోహనుకు వినపడీ వినపడని చిన్న మాటతో.

నీలిమ కిలకిల గదిని సుగంధ సౌరభంలో ముంచి ఎత్తుతోంది.

మోహను మొదటిసారిగా అనుకున్నాడు తన దగ్గర వదిన పడుకోడం అన్నయ్యకు సుతరామూ ఇష్టంలేదని. అయితే తను ఇంకేం చెయ్యాలి అన్న సమస్య...అమ్మ మళ్ళీవస్తే బాగుండును. ఆ భూతం ఇంక రానివ్వదేమో......

గాజుల చప్పుడు వినపడింది.

కళ్ళు మూతలుపడి ఉండగానే ఆశగా చూస్తున్నాడు. అమ్మరూపం కనపడి చెప్పింది.

"నువ్వ ఇంక వదినకు అంత అల్లా దగ్గరగా ఉండకు. వదిన హృదయంలో స్థానం మీ అన్నయ్యది—అది నువ్వ ఆక్రమించుకోడం మీ అన్నయ్య సహించలేడు" అని.

మోహను నిశ్చయించుకున్నాడు తనకూ వదినకూ మధ్య వదినను బాధపెట్టకూడదు అని. ఏదో బరువు గుండెలమీదనుండి దిగిపోయినట్టయింది.

మళ్ళీ గది అంతా చీకటి ఆక్రమించింది. చీకటి నీడలా వచ్చి మోహనును జోకొట్టింది.

పొద్దున్నే లేచి మోహను పళ్ళుతోముకున్నాడు నీళు చెంబుతో తెచ్చుకుని గుమ్మంమీద పెట్టుకుని. నూతిలో చేద ఎప్పుడూ వేసి ఎరుగని మోహను, నీలిమ చూడని సమయం చూసి తోడుకుని నీళ్ళు పోసుకున్నాడు. బట్టలపెట్టె వెతుక్కుని బట్టలు తీసుకున్నాడు. శుభ్రంగా తల దువ్వుకున్నాడు. కొంచెం వంకరటింకరగా ఉంది. అవుతేనేం? నీళ్లు తోడినప్పుడు చిన్న దెబ్బ ‥ రకం కారింది. కొబ్బరినూనె రాసుకున్నాడు.

నీలిమ, మాధవరావు ఆశ్చర్యపోయారు ఈ మార్పు చూసి.

'ఉండు బాబూ కట్టుకడ్తను' అని కొబ్బరినూనెలో గుడ్డ ముంచి కట్టుకట్టింది వేలుకు. 'ఫరవా లేదు వదినా' అంటూ వదినకూడా వెళ్ళి, వంటయింట్లో పీట వాల్చుకుని 'చద్దిఅన్నం పెట్టు' అన్నాడు. కాని...నోట్లోకి ఒక్క ముద్దకూడా వెళ్ళలేదు.

'ఏంనాయనా' అంటూ వదిన హృదయం కారణం తెలిసికోడంకోసం తహతహ డింది.

"ఏం లేదు అంటూ" చెయ్యి కడుక్కుని పుస్తకాలు వెదుక్కుని, స్కూలుకు తయారుఅయాడు.

ఎప్పుడూ అన్నయ్యతో మాట్లాడి ఎరుగని మోహను "స్కూలుకు వెళ్తున్నానన్నయ్యా' అని చెప్పాడు, వదిన అక్కడ ఉన్నా మాట్లాడకుండా. కాని, వదిన వంక చూసిన జాలిచూపుతూపు ఆమె హృదయాన్ని నాటుకుంది వాడిగా.

'ఇల్లా బుద్ధిగా చదువుకోవాలి' అని మాధవరావు తమ్ముడిజేబులో అణాకాసు వేశాడు మోహను వదులుకున్న సౌఖ్యాన్ని దాంతో కొనవచ్చుఅన్నట్టు.

మోహను నెమ్మదిగా మనసుకు ధైర్యం చెప్పుకుంటూ వెళ్ళిపోయాడు, గుండె రాయి చేసుకుని.

నీలిమ అటు తిరిగి వెల్లువలా వచ్చే దుఃఖాన్ని పైట చెంగుతో ఆపుకుందుకు వ్యర్థ ప్రయత్నం చేస్తోంది.

మాధవరావు అది చూసీ చూడనట్టు తమ్ముడు బుద్ధిమంతుడయిపోయినందుకు సంతోషిస్తూ లోపలకు వెళ్ళాడు.

అతనికేం తెలుసు తమ్ముడిహృదయంలో ఎన్ని అగ్నిపర్వతాలు పగులుతున్నాయో.

నీలిమ తమ సంభాషణను నిశ్చయంగా మరిది విన్నాడని స్థిరపరుచుకుంది. అతని సున్నితహృదయం తనకు తెలుసు. విశ్వప్రయత్నం చేసినా మామూలు దారికి రాడని తెలుసు ... మనసు విరిగినతర్వాత మళ్లీ అతుక్కుంటుందా? ఏమో...!

చిన్నప్పుడు తనకికూడా తనమరదికిలాగే తల్లి పోయింది. చిన్నవదిన తనని చీడపురుగులా చూసేది. ఒక్క ప్రేమించే హృదయం, హృదయం విప్పి చెప్పుకుందుకు ఒక్కజీవి లేక ఎంత బాధపడింది తను. ఒకొక్కరోజున చిన్నన్నయ్య వదినమాటకు తందాన అన్నప్పుడు ఆత్మహత్య చేసుకోవాలి అనిపించేది. నాన్నగారికోసం, ఆయన ఎక్కడ బాధపడిపోతారో అని బ్రతికేది. ఎన్ని బాధలుపడ్డా నాన్నగారికోసం బ్రతికింది. అల్లాగే తల్లి పోయినా మోహను తను ఏమీ అనకుండా కళ్లచూస్తోంది కనుక కోలుకున్నాడు. కాక అతను పడ్డ జబ్బుకి మళ్ళీ బ్రతుకుతాడనుకున్నారా? నాన్నగారు తనకు పెళ్ళిచేశారు. మరొక మనసు తనను ప్రేమించేందుకు ఉంది అని తృప్తిపడేది. తనను చూడక హింసించినపుడు తను ఎంత బాధపడింది. నాన్నకోసం బ్రతికి ఉంది అంతటి బాధను సహిస్తూ. ఆయన మాయమయ్యారు. ఆత్మహత్యకు ప్రయత్నించింది. "చిన్నవదిన అన్న "చచ్చిందేనా కాదు ముష్టిముండ" అన్నమాట శల్యంలా ఇప్పటికీ బాధిస్తోంది. ఆయన (భర్త) తనను దగ్గరకు తీసుకున్నారు. అందుకు బ్రతకగల్గింది. తనను ప్రేమించే నాన్నగారు మాయమయినప్పుడు, లాలనగా మాటమాత్రం చెప్పేవారు లేక తను ఎంత నిరాశలో కృంగిపోయింది. తను యిల్లా మరదికి దూరం అయిపోతే ప్రేమించేవారు ఎవరున్నారని మరది తనని మరచిపోగలుగుతాడు? మరది చేతులోని సౌఖ్యాన్ని చేజేతులా, తనకోసం త్యాగం చేస్తున్నట్టు కనపడింది. తనకోసంకదూ అతను ఇచ్ఛాపూర్వకంగా దూరమయిపోతూ ఉంటే? ఈ త్యాగాన్ని అతని లేత హృదయం తట్టుకోగలదా?

మోహను ఎంత బాధపడుతున్నాడు? అతను చేసే ప్రతి పనిలోనూ తీరని బాధ, ముఖంలో నిరాశా స్పష్టంగా చూసింది. నీలిమ భర్త ఏమనుకున్నా సరే...కుదరదు ఇది ఇంక సాగనివ్వకూడదు...అతను బాధపడేందుకు వీల్లేదు అనుకుంది.

మధ్యాహ్నం అయింది. భోజనం చేసి అదే చూపుతో అల్లాగే ఇల్లు విడిచి వెళ్లాడు మోహను. నీలిమ ప్రాధేయపడి కూడా అతని చేత కారణం చెప్పించలేకపోయింది

"ఇల్లా ఉండటం నాకు సుఖం అనుకుంటున్నావా? ఎంతమాత్రం కాదు. నువ్వు ఇల్లా ఉంటే నేను క్షణంకూడా బ్రతకలేను."

వదిన కంటినీరుకూడా అతని వ్యధనిశ్చయాన్ని కదిలించలేకపోయింది. మరది వెళ్ళిపోగానే పరుపు మీద బోర్లపడుకుని ఏడ్చింది ఏడ్చినకొద్దీ యింకా భారమయింది హృదయం. ఏడ్చి ఏడ్చి నిద్రపోయింది. కళ్ళు తెరచేటప్పటికి మోహను బట్టలు మార్చుకుని ముఖం కడుక్కుని కనపడ్డాడు.

వదిన వెళ్ళి మరదిని కౌగిలించుకుంది.

"నా నాయన కదూ. నువ్వు యిల్లా ఉండకు. ఇల్లా ఉంటే నే బ్రతకలేను" అంది. ముఖమంతా ముద్దులతో నింపింది. ఏ భావమూ లేని మరది ముఖం చూసి గొల్లుమంది. వదిన కంటినుంచి కారుతున్న నీరువైపు అల్లాగే చూస్తున్నాడు కన్ను ఆర్పకుండా.

కంటినుండి బయల్దేరిన నీటిప్రవాహం చెక్కిలి మీదకు ప్రవహించి, కొంచెం దూరం ప్రయాణం చేసి తటాలున పైటమీదపడి ఇంకి పోతోంది.

ఒదిన మాటలలోని బాధ మరిదిహృదయం మీద పడి బీటవారిన అచోటులో ఇంకిపోతోంది.

మోహను ఇంక చూడలేకపోయాడు "ఒదినా" అని ఏడ్చాడు.

అమ్మ, జలపూరితాలయిన వదినకళ్ళలో కనపడి...

'మాట మర్చిపోయావు' అన్నట్టయింది. క్రింద కూర్చుని బాధలో కొట్టుకుపోతున్న వదినను...... వదలి తనను కానట్టు వెళ్ళిపోయాడు మరది.

చీకటిపడింది. అన్నం దగ్గర కూర్చుని లేచాడు, మోహను. దీపందగ్గర చదువుకుంటున్నాడు. మన

సులో సుడిగుండాలు తిరుగుతున్నాయి. వాటిలో తను...వదిన దూరమయిపోతోంది.

అన్నయ్య వీధిలోంచి వస్తూ బుద్ధిమంతుడయిన తమ్ముణ్ణి చూసి సంతోషించాడు.

అన్నయ్య భోజనం చేస్తున్నాడు. ఇంక చదువుకోలేక పడుకుందుకు లోపలకు వెళ్ళాడు. తను రోజూ పడుకునే ఆ చిన్న మంచం గదిబయట వెయ్యాలని తాపత్రయం. కష్టపడి ఆ పట్టెమంచాన్ని ఓరగా ఎత్తగలిగాడు. దాన్ని కదపలేకపోతున్నాడు.

'ధేవ్'మని అన్నయ్య తేనుపు వినపడింది. నీలిమ ఎంగిళ్లు తీస్తోంది.

తమ్ముడు మంచం తియ్యటంకోసం పడేపాట్లు చూశాడు...

"ఏరా?"

"ఇది బయట వేసుకోవాలి"

"ఉండు నే వేస్తా..."

అని పట్టు పంచ వదలివచ్చి ప్రక్కగదిలో వేశాడు మంచం. ప్రక్కపరచుకు పడుకున్నాడు. నిద్రపట్టడంలేదు. ముసుకుతన్ని పడుకున్నాడు.

నీలిమ వచ్చి చూసింది. "అదేమిటి అక్కడ పడుకున్నావు?"

మోహను సమాధానం చెప్పలేదు.

"అబ్బే అంతయిదవుతే ఎలా...నువ్వొక్కడవూ పడుకోలేవు...లోపల వేస్తాలే..." అంది చేతులో మంచినీళ్ల చెంబు క్రిందపెట్టి.

ఇప్పుడూ మాట్లాడలేదు.

నిద్ర పట్టిందేమో...

"పడుకోనియ్యి అక్కడ పడుకోవాలనుందేమో" అని గట్టిగా అని లోపలకు వెళ్లినతర్వాత...

"నువ్వు మరీ పడుకోలేవు ఒంటరిగా...ఫరవాలేదులే వాణ్ణి పడుకోనియ్యి..." అని ఈసడించాడు మాధవరావు.

నీలిమ లోలోన అణచుకుంది మూగబాధని.

చీకటి దట్టమయింది దీపాలు ఆర్పడంతో.

మోహానుకు నిద్ర పట్టడంలేదు. ఈవాళ ఇల్లా బాధపడ్డా వదిన నెమ్మదిగా సుఖపడుతుంది. సరిగ్గా అమ్మ చెప్పినట్టు చేశాడు. అమ్మకు సంతోషం కలిగి ఉంటుంది...

"అంతా సరిగాచేశానో లేదో అమ్మవచ్చి చెప్తే బాగుండును"...

గడియారం టంగ్‌టంగ్ అని పన్నెండు కొట్టింది. మోహానుకు అవి వింటూఉంటే భయం వేసింది...

చీకటి ఉండకట్టుకుని భూతమయి వచ్చింది. కళ్లు చింతనిప్పుల్లా ఉన్నాయి. భూతం నోరు తెరచింది. నోరు పెద్ద అగాధంలా ఉంది. అగాధపు చివర తను నుంచుని ఉన్నాడు. వంగి లోపలకు చూశాడు బెరుగ్గా. కళ్ళు తిరిగాయి. అందులో తను పడిపోయాడు...

"అమ్మా..."

అని పెద్దకేక పెట్టాడు. అది ప్రతిధ్వనించింది. లేచి వదినకోసం ఆ గదిదగ్గరకు వెళ్ళాడు. తలుపు బిగించిఉంది. బాదాడు ఒళ్లు తెలియకుండా. ఒదినకోసం గట్టిగా పిలిచాడు దిక్కులు ప్రతిధ్వనించేట్టు. సమాధానం లేదు. భూతం మీదకు వస్తోంది.

'అయ్య బాబోయ్'...

తనని ఎవరు రక్షిస్తారు...

"అమ్మా..."

అమ్మ జ్యోతి పట్టుకు నుంచుంది దూరంగా. అమ్మకోసం పరుగెట్టాడు. భూతంనుంచి రక్షిస్తుందని. తన చేతిని చాచింది భూతం. పరుగెత్తుకువెళ్లాడు అమ్మవంక. అమ్మను చేరలేకపోతున్నాడు. చాలా ఆయాసంగా ఉంది ఒళ్ళంతా. మెట్లమీద దొర్లుతున్నట్టు అనిపించింది.

వెర్రికేక పెట్టి వదిన తలుపు తీసుకు వచ్చింది. ప్రక్కమీద మరది లేడు. తొందరగా మేడంతా చూచింది. మెట్లమీద దీపం వెలిగించింది. మేడపై మెట్టుమీద తను—క్రింద రక్తంలో తనమరది...

# కారెంపూడి శిలాశాసనము

శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ

ఈ శిలాశాసనము గుంటూరుజిల్లా పల్నాడు తాలూకాలోని కారెంపూడి గ్రామము నందలి వీరులగుడి ఆవరణములో ఒక రాతిమీద చెక్కియున్నది. ఇది గవర్నమెంటు శాసన శాఖ వారి 1909 వ సంవత్సరపు వార్షిక నివేదికలో 556-వ నెంబరు శాసనముగా ఈయబడినది 1904 వ సంవత్సరమునుండి 1926 వ సంవత్సరమువరకు గవర్నమెంటు శాసన శాఖవారిచే తెలుగు దేశములో సేకరించబడిన తెలుగు దేశపు శాసనములు దక్షిణ హిందూదేశ శాసనసంపుటములు — పదవ సంపుటమున ప్రకటితమైనను ఈ శాసనము మాత్రము దానిలోనికి రాలేదు. ఇదొక్కటే కాక ఇటువంటివి, ఇంతకంటెను ముఖ్యమయినవి శాసనము లనేకములు ఆ సంపుటములో లేకపోవుట కడు విచారకరము. చరిత్రాభిమానులు, శాసనపరిశోధకులు అయిన శ్రీ జయంతి రామయ్యపంతులుగారి సంపాదకత్వమున వెలువడిన సంపుట మిది. ఇది ఇంత అధ్వాన్నముగ తయారగుట ఆంధ్రుల దురదృష్టము. ప్రకటితములయిన శాసన పాఠములైనను నిర్దుష్టములయినవి కావు. అవి తప్పుల కుప్పలుగ నుండి భాషావిషయకముగ బనిచేయువారికి నిరుపయోగములైనవి. కొన్ని కొన్ని యెడల చరిత్రవిషయకముగ ఆధారపడుటకును అనుచితములుగ నున్నవి. ఇటువంటి ముఖ్య శాసన సంపుటము ఈ విధముగ తయారగుట ఆంధ్రుల దురదృష్ట మనక తీరదు.

ఇక ప్రకృత శాసనమును గురించి: ఈ కారెంపూడి శాసనమును నేను కారెంపూడి వెళ్ళినప్పుడు చూచి ప్రతిబింబము తీసి చదివితిని. ఆ ప్రతిబింబము చినిగిపోవుటచేత ప్రకటించుటలేదు. నా చదివిన శాసన పాఠమును మద్రాసు కోటలోని శాసన శాఖ వారి శాసన ప్రతిబింబము సహాయమున మరల సరిదిద్దుకొంటిని. శాసన పాఠమును సరిచూచుకొనుటకు శాసన శాఖవారు దయతో ప్రతిబింబ మొసగినందుకు వారికి నా కృతజ్ఞతాపూర్వక వందనము లర్పించుచున్నాను.

ఈ కారెంపూడి శాసనము అన్ని శాసనముల వంటిది కాదు; ఇందులో కొంత విశిష్టత ఉన్నది. సాధారణముగా శిలాశాసనము లన్నియు ఎవరో ఒక స్వామికి (దేవునికి) అఖండ దీపారాధనము నిమిత్తమో, అంగరంగ భోగాదుల నిమిత్తమో చేసిన దానధర్మములను కట్టుబాట్లను తెలుపును. సాధారణముగా ప్రతి శాసనమునను దేశము నేలు భూపతుని పేరు ఉదాహరించుట పరిపాటి. కాని ఈ కారెంపూడి శాసనము అఖండ దీపారాధన, అంగరంగ భోగాది దానధర్మములను తెలుపుటకు వేసినది కాదు; రాజుపేరును లేదు దీనిలో. అయినను ఇది విశిష్టమయినదే. దీనివలన ఈ శాసనము వేసిన కాలము నాటి కులమర్యాదలు, కట్టుబాటులు ఎట్లుండెడివో విదితమగుచున్నది. ఇదియే ఈ శాసనమును ప్రకటించుటకు కారణము.

ఈ కారెంపూడి శాసనము ఎప్పటిదను విషయమునుగురించి మనము ఊహాలపై ఊహాలు చేయుట కాని, తర్క వితర్కములు చేయుటకాని అవసరములేదు. శాసనకాల మింగు విస్పష్టముగ తెలుపబడినది. అది శకవర్షములు 1318 యువ సంవత్సర ఆషాఢ శు. 11 శుక్రవారము. యువ సంవత్సరమునకు సరియైన శకవర్షము 1317 కాని 1318 కాదు. శకవర్షము 1318 కి సరియైన బార్హస్పత్యమానాబ్దము ధాత. శకము 1317 యువ సంవత్సరములో శ్రీ స్వామికన్నుపిళ్లె గారి 'ఇండియన్ ఎఫిమెరిస్' ప్రకారము ఆషాఢ శుద్ధ ఏకాదశి శుక్రవారము కాలేదు; మంగళవారమయినది. అందువలన శాసనపు తేదిలో కొంచెము పొరపాటున్నది. శకము 1318 ధాత సంవత్సరములో, అనగా క్రీ. శ. 1396 లో ఆషాఢ శు. 11 పై నుడివిన 'ఇండియన్ ఎఫిమెరిస్' ప్రకారము జూన్ 16 వ తేది అయినది. ఆనాడు శుక్రవారము దశమి తిథి .74, అనగా $44\frac{1}{2}$ గడియలవరకు ఉన్నది. అటు తరువాత ఏకాదశి దీని ననుసరించి యువ గతాబ్దమని, శకము 1318 ధాత సంవత్సరమే వర్తమానాబ్దమని భావించవలసి యుండును. అట్లయినచో శాసనములోని తేదికి సరియైన ఇంగ్లీషు తేది క్రీ. శ. 1396, జూన్, 16 వ తేది శుక్రవారమగును.

ఈ శాసనకాలము నాటికి తెలుగు లిపి చాల పరిణామము పొందినది ఏమాత్రము స్వల్పకృషి చేసినను, స్పష్టముగా ఉన్నచో, తెలుగువారు ఈ శాసనాక్షరములను గుర్తించి శాసన పాఠమును విడదీయగలరు. క్రీ శ. 1396 అనగా శ్రీనాథ కవి కాలము శ్రీనాథుడప్పటికి చిన్నవాడుగా నుండవలెను. కొండవీడు రాజధానిగా తెలుగుదేశమును పరిపాలించిన పెదకోమటి వేమారెడ్డి ఆస్థానములో విద్యాధికారిపదవీ నియుక్తుడై అతడు సంతరించిన మొదటి శాసన మింతవరకు తెలియవచ్చినది పొన్నుపల్లి తామ్రశాసనము ఇది క్రీ. శ 1404 తారణ సంవత్సరము నాటిది. పెదకోమటి వేమారెడ్డి శాసనములలోని లిపికిని ఈ కొరెంపూడి శాసన లిపికిని భేదము లేదు. ఈ శాసనకాలము నాటికి ప్రాగాంధ్రదేశము కొండవీటి రెడ్డిరాజుల పరిపాలనలోనే ఉండెను కాని శ్రీనాథుని కాశ్రయమిచ్చిన పెదకోమటి వేమభూపతి మాత్రము ఇంకను రాజ్యమునకు రాలేదు. శాసనకాలము నాటికి రాజ్యము చేయుచుండిన రెడ్డిరాజు పెదకోమటి వేమారెడ్డికి పూర్వుడయిన కుమారగిరిరెడ్డి. ఇతని నే కొమరగిరి రెడ్డి అని అందురు. పెదకోమటి వేమ, కుమారగిరుల పితామహులు సహోదరులు. కొమరగిరిరెడ్డి తరువాత కొండవీటి సింహాసన మధిష్ఠించినవాడు పెదకోమటి వేమారెడ్డి ఈ కొరెంపూడి శాసనమున కుమారగిరిరెడ్డి కాని, అతని ప్రధాన దండనాయకులు ఎవ్వరు కాని పేర్కొనబడలేదు. అందువలన ఈ శాసనము ప్రభుత్వమున కేమాత్రము సంబంధము లేని వ్యక్తులు వేయించినది.

శాసనభాష ఇప్పటి కయిదువందల ఏబదినిమిది సంవత్సరముల క్రిందట క్రీ. శ. 1396 లో, అనగా శ్రీనాథుని కాలమున తెలుగుదేశములో వాడుకలో నుండిన భాష. ఈ శాసనములో వైష్ణవ పరిభాష, వైష్ణవాచార్య బిరుదప్రశస్తి చాల ఉన్నది. వీటిలోని కొన్ని పదముల కర్థము తెలియుటలేదు. ఇటువంటి వానిలో 'కొమళిగిళ్లు', 'చోడపందిగూను', 'తిరుందుపక ణాంతులు', 'తిరువడిపోతులు' అనునవి కొన్ని. 'త్రిభువనికుళి సముద్ర విళంబతాళగిత శ్రింగారహార' అన్న బిరుదముల నెట్లు విడదీయవలెనో తెలియుటలేదు 'త్రిభువనికుళి' అనుదానిలోని 'కు'ను 'తా'గ చదివినను చదువవచ్చును. అట్లు చదివినను అర్థము సుబోధమగుటలేదు. 'విళంబ' అన్నది 'విడంబ' కాదగును. అట్లయినచో 'త్రిభువనీకుళి సముద్ర విడంబ' అని కాని, 'త్రిభువనీకుళిసముద్ర', 'విడంబ తాళగీత శృంగారహారి (శిర)' అని కాని విడదీయవలెనేమో. 'త్రిభువనీకుళి సముద్రవిడంబ' అన్న నెంత యర్థమగుచున్నదో 'త్రిభువనీకుళి సముద్ర' యన్నను నంతే యర్థమగుచున్నది. 'త్రిభువనీకుళమను సముద్రమునకు చంద్రునివంటివాడని యర్థము రావలెను. విళంబ పదమునకు కాని విడంబ పదమునకు కాని చంద్రుడను అర్థము లేదు. ఒక వేళ "త్రిభువనీకుళిచంద్ర"అనుటకు శాసనము చెక్కినవాడు "త్రిభువనీకుళిసముద్ర" అని తప్పుగా చెక్కెనేమో. అట్లయినచో 'విడంబ తాళగీత శృంగారహార (శిరి)" అని పాఠ మేర్పరుచవలెను. ఈ విషయ మింకను విచారింపవలసినది. 'పదునెట్టినాంటి శ్రీ వైష్టాలకూను' అన్నది 'పదునెట్టినాంటి శ్రీ వైష్ణవులకును' అనుదాని అపపాఠము. 'ఎట్టు' అనగా అరవములో ఎనిమిది. 'పదినెట్టు' అన 'పదునెనిమిది'. 'నా' డన దేశము. 'పదునెట్టు నాంటి శ్రీ వైష్ణవులకును' అనగా పదునెనిమిది దేశాల శ్రీవైష్ణవులకును అని యర్థము. శ్రీ వైష్ణవులు పదునెన్మిది దేశాలవారని ప్రతీతి. తమిళ వాఙ్మయములో ఈ పదునెనిమిది దేశములు ఈ రీతిని తెలుపబడినవి 1:

| | | |
|---|---|---|
| తమిళము | కొంగణం (కొంకణం) | మగతం (మగధ) |
| సింగళం (సింహాళము) | కొల్లం | గౌడం (గౌడ) |
| శోనహం | తెలుంగం (తెలింగ) | కుశలం |
| సావహం | కళింగం | కడారం |
| కన్నడం | వంగం | శీనం (చీనా) |
| తుళు | కంగం | కుడహం |

తమిళ దేశము చుట్టును మిగిలిన పదునేడు దేశములు ఉన్నట్లు తమిళవాఙ్మయమున చెప్పబడినది. తమిళమున 'పదినెట్టు' పదమే తెలుగులో 'పదునెట్టు' గా మారినది.

---

1. ఈ పదునెన్మిది దేశముల పేళ్ళను తెలిపిన (మదరాసు విశ్వవిద్యాలయములో తమిళభాషకు 'జూనియర్ లెక్చరర్'గా ఉన్న) విద్వాన్ శ్రీ బి. పురుషోత్తమనాయుడు గారికి నా కృతజ్ఞతావందనములు.

శాసనములో వచ్చు వైష్ణవ పరిభాషా పదములకు అర్థము చెప్పవలసినదని కోరుచు వారికి వ్రాసి యిచ్చియున్నాను. ఇప్పుడు నేను తెలిపిన యర్థములలో పొరపాటులున్నను, నాకు తెలియని పదములకు వారు అర్థము తెలిపినను రాబోవు సంచికలో ప్రకటింప గలను.

‘శత్తండమువారు’ అనగా శాత్తదులు, సాతనులు అని యర్థము. ఈపదము‘శత్తండము’ అనికాక ‘శాత్తండము’ అని యుండవలెను ‘ఉప్పరపు గొడుగులు’ అను రూపము తప్పు. ‘ఉప్పరపు గొడుగులు’ అని యుండవలెను. ఉప్పరపుగొడుగు లనగా ఆకాశపు గొడుగులు. ‘కామశిగిళ్లు’ అను మాటకు అర్థము తెలియలేదు. ‘కామశిగి’ళ్లన కొమతో కూడిన శిగిళ్లేమో. శిగిడి కర్థము తెలియదు. ‘చోడపందిగూను’ అన్న పదము సరియైనదో, లేక శాసనలేఖకుడు తప్పుగ వ్రాసెనో తెలియదు. చిట్టచివరి ‘ను’ సముచ్చయార్థకమని, దానికి పూర్వాక్షరములోని ‘ఊ’ దీర్ఘము వ్యావహారికభాషవలన వచ్చినదని, సరియైన పదము ‘చోడపందిగు’ అయియుండునని నాయూహ. ఇట్లూహించినను దాని కర్థము తెలియదు. ‘తిరుండుపకణాంతులు’ అను దానిలో ‘తిరు’ శ్రీవాచకము. ‘కణాంతులు’ ‘కణంతు’ లనుదాని దుష్టరూపమేమో. కణంతి, కడంతి, కడంతి యను పదములకు కణుజు అని యర్థము. ‘తిరుండుపకణంతు’ లన్న నర్థము తెలియవచ్చుటలేదు. ‘తిరుండ’ అను పదము ‘తిరుణ’ కావచ్చు. ఇది ‘తృణ’ శబ్దభవము. ఇట్లయినను ‘తిరుండుపకణంతు’లే సాధురూపమనుకొన్నను అర్థముగుట లేదు. ‘తిరువళికోలలు’అన్నను ‘తిరువడికోల’లన్నను ఒకటే. ‘తిరువడికోల’యన దాసరివాని దీపస్తంభము. ‘తిరువిడిపోతు’ లను రూపము అసాధువని తోచును. సాధురూపము‘తిరువడిపోతులు’. దీనికినిఅర్థము తెలియలేదు. శ్రీవైష్ణవ పరిభాషలో ‘పాతపోతు’ అను పదము కలదు. ‘పాతపో’తనగా పాదపద్మము 2 ‘తిరువడి పోతు’లన శ్రీపాదపద్మములు—ఆచార్య శ్రీపాదపద్మములు లాంఛనముగా కల కేతనము కావచ్చును. ‘ఆనుమరేగ’ లన్నది అసాధువు. ‘అనుమరేక’ లని యుండదగును. ‘అనుమరేక’ లన హనుమంత చిత్రము వ్రాసిన జెండాలు కావచ్చును. ‘శ్రీముఖము’ అనగా మతాచార్యులు తమ శిష్యులకు ఇచ్చెడి యుత్తరము, లేక ఆజ్ఞాపత్రము. శాసనమును లేఖకుడు తప్పుగ వ్రాసెనో లేక శాసనము చెక్కినవాడే తప్పుగ చెక్కెనో కాని శాసనమంతయు దోషభూయిష్ఠముగ నున్నది. కొలము(కులము)నకు ‘గొల’రూపము ప్రయుక్తమయినది. ‘సార్వభౌమ’ పదము ‘సావర్భౌవుము’ అని చెక్కబడినది ఇందలి వైష్ణవ పరిభాష బిరుదలాంఛనములు అపరిచితములైనవి. పదరూపముల విషయమునను, వాటి కర్థము నిర్ణయించుటలోను నా యూహ కందినట్లు చెప్పినాను. నేను చెప్పినవి సరియైనవి కావచ్చును; కాకపోవచ్చును: తెలిసినవారు నేను చేసిన దోషము లేవయిన నున్న మన్నించి వాటికి సాధురూపములను సరియైన యర్థములను వివరింపగలందులకు వేడుచున్నాను.

శాసన విషయము: కుంకుమ వసంతము లాడుకొను విషయములో పలినాటివారికిని (పల్నాటి వారికిని) బడగులసీమువారికిని(బడగులవారికిని) వివాదము సంభవించినది. అంతకుపూర్వపు రివాజు ననుసరించి ఏయే కులములవారికి ఈ కుంకుమవసంతము లాడుకొను మర్యాదకలదో వారే కాని ఇతరు లాడుకొనరాదని పూర్వపు సాంఘిక నియమము. ఇట్టివి పూర్వపు కులమర్యాదలు (*Social privileges*) బడగులవారు కుంకుమ వసంతము లాడుకొను మర్యాద తమకును కలదని (తమ గురువులైన?) దేవ చక్రవర్తి అయ్యంగారితో నిజము కప్పిపుచ్చి చెప్పి వారియొదనుండి శ్రీముఖములు తెచ్చుకొని వసంతము లాడుకొనగా పలినాటివారు వారిని వసంతము లాడనీక అడ్డుపెట్టిరి. అంతట గురువులైన ‘చక్రకుల విజయ చూడామణి’ శ్రీమాన్ నల్లాను గోవింద చక్రవర్తి అయ్యంగారు చాత్తండమువారిని తమ సముఖమునకు పిలిపించి పూర్వము బడుగులవారికి కుంకుమ వసంత మాడుటకు తమకు హక్కు గలదని నిరూపించుకొన్నచో వారిని ఆడనిండని చెప్పగా ఆ బడగులవారు తమ కట్టి మర్యాద యుండినట్లు రుజువు చేసికొనలేకపోయిరి. అంతట గోవింద చక్రవర్తి అయ్యంగారు దేవచక్రవర్తి అయ్యంగారు బడగులవారి కిచ్చిన శ్రీముఖములు మరల తీసికొని, పలినాటివారికి ‘ఒరుగు నిశానీలు’ మొదలైన—మహాదేవరకు చెల్లునట్టి ‘వైభోగములు’ ప్రసాదించి, బడగులవారు ఎక్కడెక్కడ కుంకుమ వసంతమాడినను పధ్నెన్మిది దేశాల శ్రీ వైష్ణవులును వారి నాడకుండ అడ్డుపెట్టునట్లు ఆనతిచ్చి పదునెన్మిది దేశముల శ్రీ వైష్ణవులకు శ్రీముఖము పంపిరి. ఆ శ్రీముఖమే ఈశాసనము. మొత్తముమీద ఇది పలినాటి వారికి బడగులనాటివారికి కుంకుమ వసంతములాడుకొనువిషయములో వచ్చిన వివాదమును విచారించి శ్రీ వైష్ణవ గురుస్వాములైన శ్రీమాన్ నల్లాను గోవింద చక్రవర్తి అయ్యంగారు ఇచ్చిన తీర్పు.

2. ‘పాతపోతు’ అనగా పాదపద్మమని నిఘంట్వాధారమున చెప్పినవారు మిత్రులు శ్రీమాన్ మేడేపల్లి వరాహ నరసింహస్వామిగారు. ‘తిరువడిపోతు’ లన శ్రీపాదపద్మములు, సద్గురు పాదపద్మములు కావచ్చునని వారే సూచించిరి. వారికి నా కృతజ్ఞతావందనములు.

పూర్వము మతగురువులు కుంకుమ వసంతము లాడుకొనుటవంటి వేడుకలను గౌరవ మర్యాదలను ఒక్కొక్క కులమువారు సంఘమునకో మతమునకో చేసిన సేవాసత్కృతులను గమనించి యిచ్చువారు. వివాహసమయమున పెండ్లికుమారుడు గుర్రమెక్కి గ్రామవీథులలో మెరయుట, ఉత్సవావసరములలో కుంకుమవసంతము లాడుకొనుట, పెండ్లి పందిళ్లకు మామిడాకు తోరణములు కట్టుకొనుట, పెండ్లి పందిరి స్తంభములకు అరటిచెట్లను నరికి తెచ్చి కట్టి అలంకారము చేయుట — ఈ మొదలైన మంగళ కార్యము లన్నియు మర్యాదలే. పూర్వము చతుర్వర్ణములలోని అన్ని కులములవారికి అట్లు చేసికొనుటకు హక్కు లేదు. ఆయా కులములవారికి ఈ మర్యాదలను దేశమును పరిపాలించు అధిపతియైనను ప్రసాదింపవలెను; లేదా మతగురువైనను ప్రసాదింపవలెను. ఒకవేళ ఏ కులమువారయినను ఇట్టి గౌరవ మర్యాదలకు తమకు 'హక్కు' లేనిదే నడపుకొనిరా అట్టివారికి 'హక్కు'న్న ఇతర కులములవారు వారిని అడ్డపెట్టుచు వచ్చిరి. సంఘములో ఇట్టి గౌరవ మర్యాదలకు గల 'హక్కు' ననుసరించియే గౌరవ ప్రతిష్ఠలు. వారి హోదా ఎక్కువ. ఇటువంటి గౌరవ మర్యాదలకు సంబంధించిన పట్టుదలలు ఓరుగంటి కాకతీయ సామ్రాజ్యము పతనమై హైందూధర్మము మరల సముద్ధరింపబడినతరువాతినుంచియే, క్రీస్తుశకము పదునాలుగవ శతాబ్దము ఉత్తరార్థమునుంచి ఎక్కువ యైనవి. ఇటువంటి కులగౌరవ మర్యాదలకు, కులము ఆధికతా న్యూనతలకు సంబంధించిన శాసనములన్నియు పదునాలుగవ శతాబ్దమునుంచియే కానవచ్చును. ఈ శాసనమువలన పూర్వము మతగురువుల కెంతటి యధికారముండెనో, కులమర్యాదలు ఏవిధముగా పరిపాలింపబడుచు వచ్చినవో తెలియుచున్నది. దేశము నేలు రాజునకు పరిపాలనము విషయమునను, భద్రతను కాపాడు విషయమునను, దుష్టశిక్షణ శిష్టరక్షణముల విషయమునను మాత్రమే అధికారముండెను. మత సాంఘిక విషయములయందు అతని కేమాత్రమును జోక్యముండెడిది కాదు. దేశమునకు భూపరు డధిపతికాగా సాంఘిక ధార్మిక చక్రమునకు మతాచార్యు డధినేత. రాజకీయముగ మతాచార్యుడు నరవరునకు లోబడియుండినట్లే సంఘమునకు మతమునకు సంబంధించిన విషయములలో మతాచార్యునకు నరవరుడు లోబడి యుండువాడు. దేశములోని జనుల ఆధిభౌతికాభివృద్ధికి భూమిపుడు బాధ్యుడుకాగా ధార్మిక ఆధ్యాత్మికాభ్యున్నతికి మతాచార్యుడు బాధ్యుడై దారి చూపువాడు. బాహ్యతమాలి అధర్మముగ ప్రవర్తించుచు వచ్చినవారు ఆవర్గములోను ఈవర్గములోనుకూడ ఉన్నారు; కాని పూర్వపు రాజకీయ ధార్మిక పరిపాలనాపద్ధతి అట్టిది. సంఘము అభ్యున్నతిపతనములకు వారుభయులును సమానముగ బాధ్యులు.

విశేషవిషయములు: నల్లాని గోవిందచక్రవర్తి అయ్యంగారు గొప్ప వైష్ణవాచార్య శిఖామణులు. అయ్యంగారన్నది అయ్యగారను దాని రూపాంతరము. తెలుగుదేశములో శ్రీ వైష్ణవమును వ్యాపింపజేసిన భట్టరు, కందాడై, తిరుమల మొదలైన సుప్రసిద్ధ శ్రీ వైష్ణవాచార్యవంశములలో నల్లానివారిది ఒకటి. నల్లాని గోవింద చక్రవర్తి అయ్యంగారనగా నల్లాని కుమారుడైన గోవింద చక్రవర్తి అయ్యంగారని యర్థము. నల్లాని చక్రవర్తికే నల్లాండి (నల్లాణి) చక్రవర్తి యనియు పేరు. గుంటూరు జిల్లా నరసారావుపేట తాలూకా రొంపిచెర్లలోని వేణుగోపాలస్వామి ఆలయములోని పగిలిపోయిన గరుడ స్తంభముమీది శాసనములో[3] నల్లాండి చక్రవర్తి ఉదాహృతుడయినాడు. ఇతని శిష్యుడు రామదాసకుడు. ఈ రామదాసు ఎవరో తెలియదు. ఈ శాసనములోని నల్లాండి చక్రవర్తి గోవింద చక్రవర్తి అయ్యంగారి తండ్రి యనుట కేమియు సంశయములేదు. ఈ రొంపిచెర్ల శాసనము పయితము శ్రీ జయంతి రామయ్య పంతులుగారి సంపాదకత్వమున వచ్చిన శాసన సంపుటమున జేరకపోవుట విచారకరము. ఈ వంశములో దేవ చక్రవర్తి అయ్యంగారొకరున్నారు. మన శాసనములోని దేవచక్రవర్తి అయ్యంగారు వారే. వారు గోవింద చక్రవర్తి అయ్యంగారికి అన్నగారు. ఈ విషయము మనకు ఈ శాసనమువలన తెలియదు, కాని అనంతామాత్యకవి రచియించిన భోజరాజీయ ప్రబంధమువలన తెలియుచున్నది. అనంతామాత్యుడు నల్లాని గోవింద చక్రవర్తి అయ్యంగారి శిష్యుడు. అతడు భోజరాజీయమున గురుచరణస్మరణము ఈ విధమున చేసియున్నాడు:

భూ నభోహరిదంత పూరిత నుతకీర్తి
శాలి తిర్వెంగళ చక్రవర్తి
సకల సాత్త్విక శుకప్రకర సత్ఫలపూర్ణ
సహకార మశోఘరి చక్రవర్తి
ఘనతరాజ్ఞానాంధకార విఖండన

3. *Ep. coll; No. 300 of 1915.*

చండాంశుఁ డౌబళ చక్రవర్తి
నానార్థిజనచాతకానూన ధనవృష్టి
జలదంబు శ్రీదేవ చక్రవర్తి
యనఁగ శ్రుతిచతుష్టయముతో నెనయునట్టి
యగ్రజులతోడఁ బుట్టిన యస్మదీయ
గురునిఁ దిరుమల నల్లానివర తనూజుఁ
దలఁతు గోవింద చక్రవర్తులఁ బ్రియమున.

ఆ కాలములో శైవులకువలెనే శ్రీవైష్ణవులకును శిష్యబృందముండెడిది. ఈ శ్రీవైష్ణవ గురుస్వాములు తమశిష్యులకు ఆధ్యాత్మికజ్ఞానము నొసంగుటయే కాక వారికి విద్యాగురువులు కూడనై ప్రఖ్యాతివహించుచు వచ్చిరి. పై పద్యమువలన ఒక్క దేవచక్రవర్తి అయ్యంగారే కాక తిర్వేంగళ చక్రవర్తి, అళఘరి చక్రవర్తి, ఔబళ చక్రవర్తులుకూడ గోవింద చక్రవర్తులవారి అగ్రసోదరు లనియు, వీరి యింటి పేరు 'తిరుమల' అనియు విశదమగుచున్నది. శాసనమున 'చక్రవర్తి' కులముని కలగు పేరు చివర ఈ వంశము లోని ప్రతివారికి 'చక్రవర్తి' అని యుండుటవలన చక్రవర్తులవారని పేరు కలిగియుండవచ్చును. తిరువేంగళ చక్రవర్తి విజయనగరాధీశ్వర మహాసామంతులలో నొకడైన సంబెట ఎఱకంపరాజునకు గురువు. ఈ యెఱకంపరాజు పార్థివ సంవత్సరమునకు సరియైన శకవర్షము 1326 లో తన గురువును, మద్దర్శన స్థాపనాచార్యులును అయిన శ్రీ తిర్వేంగళ చక్రవర్తికి చియ్యవరమును గ్రామమును దానము చేసెను4

4. *Local Records, Vol. XL, p. 516.*

శాసనము1

చంద్రుడు2 — సూర్యుడు
శంఖము — చక్రము

1. స్వస్తి [||] శకవరుషంబులు ౧౩౧౭ అగునేం
2. టి యువ సం[వ]త్సర ఆషాఢ శు ౧౧ శు
3. శ్రీ నల్లాని చక్రవర్తులు ఇచ్చిన
4. శాసనము [|*]
5. . నైదశి నే3 సంత్తి వివాదో సర్వవాదినాం [|*] సమ్మతం సర్వలోకానా
6. ం దర్శనం చక్రవర్తినాం | [|*] స్వస్తి శ్రీమతు వేదమార్గప్రతిష్ఠా
7. చాయ్య౦4 చక్రగోల విజయచూడామణి దుష్ట
8. నిగ్రహ సి(శి)ష్ట ప్రతిపాలక మాయావాది కోళాహళ మం
9. త్రవాది భయంక్కర | పరమవైదిక సావ్వభౌవుము5 పరవా
10. [దిగ]జకేసరి త్రిభువని కుళసముద్ర6 విళంబ తాళగిత (తాళగీతి) శ్రీ
11. ంగా [ర] హా౦7 శరణాగత వజ్రపంజర శ్రీ అహోబలదేవ విభవ విరో
12. ధిమానమర్దన తిరువెంగళ నాథదేవ దివ్యశ్రీ పాద పద్మారా
13 ధులైన8 శ్రీ నల్లాను గోవింద చక్రవర్తి అయ్యంగారు అఖిలలో

1. శాసనప్రతిబింబమును ఇచ్చిన శాసనశాఖ అసిస్టెంటు సూపరింటెంటు శ్రీ హెచ్. వి. నరసింహాస్వామిగారికి నా కృతజ్ఞత.

2. శాసనశిలమీద సూర్య చంద్ర, శంఖ చక్ర ప్రతిమలు చెక్కి ఉన్నవి.

3. 5వ పంక్తి శ్లోకముతో ఆరంభము. దీనిలోని మొదటి అక్షరము పోయినది. మిగిలిన మొదటి రెండక్షరములు అనుమానాస్పదములు.

4. 'చాయ్య' అని చదువవలెను.

5. 'సావభౌము' అని.

6. 'త్రిభువనీకుల సముద్ర' అని. శాసనకర్త 'ల' కు తరచుగా 'శ' వాడినాడు.

7. 'శృంగారహారి(?)' అని.

8. 'దివ్య శ్రీపాద పద్మారాధకులైన' అని.

14. లోకాల పదునెట్టినాంటి శ్రీ వైష్ణూలకూను9 అవతిచ్చి వుత్తెంచిన
15 శ్రీముఖం [|*] బసగుల సివాలవారు10 తమకుం గుంక్కుమ వస
16 ంత్ర(ం)ము గల్దని దేవచక్రవత్తిగా అయ్యంగారికిని మఱుగవడ విన్నపం
17 సేసి శ్రీముఖాలు దెచ్చి వసంత్రమూడే మనంగాను పలినా
18 ంటివారు వసంతం ఆడనీక అడ్డె పెట్టెగేను నేము శతం
19 ముడవారిన్ని11 మా ముందటికి రప్పించ్చి విచారింప్ప
20. ంగాను పలినాంటివారు పూర్వ్వమంగ్దు కుంక్కుమ వస
21. ంతం బసగులవార్క్కిం గలుగం దెలుపుకోని ఆడ
22 నిమ్మం ట్టి(టి)ను ఆ బసగులవారు పూర్వ్వమంద్దు గలు
23 గం దెలుపరయిరి గాన దేవ చక్రవత్తిగా అయ్యంగా
24 రు యిచ్చిన శ్రీముఖాలు ముగుడెం బుచ్చికో
25 ని నేను12 పలినాంటివార్క్కి మహాదేవరకుం జెల్లేటి
26 వైభోగాలు అన్నిన్నిం13 జెల్లించ్చి ఉప్పరపు14 గొడుగులు
27 ఆలవట్టాలూను కనకదండె అంద్దలమూను
28. కొమళిగిళ్యాను నీలిగొడుగులూను చోడప
29 ందిగూను తిరంగుపకణాంతులును తిరు
30. వళికోలులున్ను తిగువిడిపోతులున్ను15 అనుమ
31. . రేగలున్ను16 యిస్తిమి [|*] వారి శ్రీముఖాలు
32. వి[ం*]ట్టిమి గాన మీగు యొక్కడ బసగులమగు17 గు
33. ంక్కుమ వసంత్ర[ం*] ఆడినాను పదునెట(ట్టె) నాంటి శ్రీవై
34. ష్ణూలగానుl8 కుంక్కుమ వసంత్రం ఆడనీక అడ్డ
35. పెట్టేది [|*]19 యీ శాసనం వుద్దగిలోనుండగి తే
36. నాటివారు పంబనాయంకున్ను మేడపి జే టెబో
37. ఇంకున్ను మంగళ మహా శ్రీశ్రీశ్రీ జేయు
38. శ్రీ.

9. 'పదునెట్టు నాంటి శ్రీ వైష్ణవులకును' అని.
10. 'బసగుల సీమవారు' అని.
11. చాత్తింపము వారిని అని; అనగా 'చాత్తనివారు. చాత్త్రండ శబ్దము వికృతే శాత్తద పదము. శాత్తదులన సాతానులు.
12. మేము అని యర్థము. ఏము అనురూపము కలదు. పూర్వము 'నేము' కూడ ఉండె నేమో.
13. 'అన్నిన్నిం'—అన్నింటిని అని యర్థము.
14. 'ఉప్పరపు' అని చదువవలెను.
15. 'తిరువడిపోతులు' అని.
16. అనుమ తరువాత నొక యక్షరము పోయినది. అది 'అనుమంతరేకలు' అని కాని 'అనుమనరేకలు' అని కాని యుండవచ్చును.
17. 'బసగులవారు' అని చదువవలెను.
18. 'పదునెట్టినాంటి శ్రీ వైష్ణవులును' అని చదువవలెను.
19. ఇక్కడినుంచి శాసనపాఠ మర్థముగుటలేదు.

# స్టీఫన్ స్పెండర్

★ ★ వర్తమాన పాశ్చాత్య సాహిత్యరంగాన్ని రూపొందించుతున్న ప్రధాన పురుషులలో ఒకరైన, ప్రసిద్ధాంగ్ల రచయిత స్టీఫెన్ స్పెండర్ గతమాసం భారతదేశానికి విచ్చేసి పలుతావుల ఉపన్యసించారు. ఈయన 'కల్చరల్ ఫ్రీడమ్ కాంగ్రెస్' అనేసంస్థకు అంతర్జాతీయ కార్యవర్గ సభ్యుడు. ఈ సంస్థ తరఫుననే సాంస్కృతిక రాయబారిగా భారతదేశానికి వచ్చి ప్రచారంచేస్తున్నారు.

కవిగా, విమర్శకుడుగా, వ్యాస రచయితగా జగత్ప్రఖ్యాతిని గడించుకున్న ప్రసిద్ధాంగ్ల రచయిత స్టీఫెన్ స్పెండర్ 1909 సంవత్సరంలో లండను నగరంలో జన్మించాడు. ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయంలో విద్యాసముపార్జన చేశాడు. కళాశాలలో చదువుతున్నన్నిరోజులూ ఆయన ఎడనెడా యూరపు పర్యటనలో కాలం గడుపుతూ వచ్చాడు. చివరకు పట్టా పుచ్చుకోకుండానే విశ్వవిద్యాలయంలోనుంచి బయటికి వచ్చేశాడు. పదిహేడేళ్ళ ప్రాయంనుంచీ, తనదగ్గిరున్న చిన్న 'హాండ్‌ప్రెస్' మీద మందుల సీసాలమీద అంటించే చీట్లు అచ్చువేసి తద్వారా జీవితం గడుపుతూ వుండేవాడు.

కళాశాలలో వుండగానే ఆడెన్ రచనలంటే ఆయనకు మోజు కలిగింది. ఆడెన్, స్పెండర్, లూయీ మాక్నీస్, సి. డే లూయిస్, వీరు నల్వురూ, వీరివీరి రచనావిధానాలలో వైవిధ్యమున్నా, నవ్యాంగ్ల సాహిత్యరంగంలో నాయకులుగా పేర్కొనదగిన వారు. వీరు నలుగురిలో ఒక సమానధర్మంకూడా కనుపించుతోంది — సాంకేతిక కావ్యరూపాలపట్ల (సింబాలిక్ పొయట్రీ) వీరికి గల ఔత్సుక్యం.

మొదటి ప్రపంచయుద్ధం రాజకీయరంగాన్నేగాక రంగాన్నికూడా తలక్రిందులు చేసివేసింది. పాత విలువలన్నీ పటాపంచలై పోయినై. పాశ్చాత్య నాగరికతకు చరమదశ వచ్చేసినట్టే కనుపించింది. ఈ వాతావరణం కారణంగా, 'డాడాయిజం' లాంటి అనేకరకాల నిరాశావాదధోరణులు అరాచకవాదధోరణులూ వ్యాపించినై. కాని 1930 వచ్చేసరికి యీ వాతావరణం క్రమంగా మారి ఆశాజనకమైన ఒక నూతనవాతావరణం ఆవిర్భవించింది.

యుద్ధానంతరదశలో కవి అత్యంత దుర్ఘటమైన బాధ్యతను పైన వేసుకుని తీరవలసివచ్చింది. నాటికి వ్యాపించివున్న నాగరికత శిథిలమై ఛిన్నాభిన్నమై పోతుంటే, ఆ శిథిలాలలోనుంచి ఒక నూతన నాగరికతను నిర్మించుకుని రావలసిన అవసరం కవికి యేర్పడ్డది. నిరాశావాదిగా తలక్రిందులైపోతున్న మానవునికి దారి చూపి ఉద్ధరించవలసివచ్చింది. నూతనాదర్శాన్ని కట్టెదుట చూపించి ఆత్మవిశ్వాసాన్ని కలుగజేయవలసివచ్చింది. తన ధర్మాన్ని గుర్తెరిగిన కవిగా, స్పెండర్, యీ కార్యక్రమానికి నడుముకట్టాడు.

పీడనకూ, నిరంకుశత్వానికి గురియై విలపించుతున్న అభాగ్యులపట్ల స్పెండర్‌కు అత్యంతమైన సానుభూతి వుంది. స్పెండర్‌కు తొలినుంచీ రాజకీయాలపట్ల ఔత్సుక్యం వుంది. ఈ నవీన యుగంలో, సాహిత్యరంగానికి రాజకీయాలతో తప్పనిసరి సన్నిం యేర్పడిపోయిందని కూడా అభిప్రాయపడ్డాడు. కాని రాజకీయం అన్నదానికి ఆయన యిచ్చిన నిర్వచనం చాలా విస్తృతావధి గలది. రాజకీయాలను పురస్కరించుకొని స్పెండర్ రచించిన కావ్యసంచయంలో, కరుణావిలమైన హృదయస్పందన వినిపించుతుంది. ఈ క్రింది పంక్తులు పరికించితే ఆ విషయం విస్పష్టమౌతుంది.

*The Guns spell Money's ultimate reason*
*In letters of lead on the spring hill-side*
*But the boy lying dead under the olive trees*
*Was too young and too silly*
*To have been notable to their important eye*
*He was a better target for a kiss.*

[ధనికవాదపు పరమ ప్రయోజనమేమిటో, వసంతశోభితమైన కొండకోనలలో, తుపాకులు లోహ శబ్దాలతో గుడింతం పలుకుతూనే వున్నయ్; కాని, ఆలీవు తరుచాయ్యను చచ్చిపడివున్న ఈ పసికందు అమాయకుడు—ఆ అఖండుల మహత్తరమైన దృష్టి పథాన పడతగిన వాడుకాదు. మధురమైన ముద్దుకు లక్ష్యంకాదగినవాడుగాని—తుపాకిగుండుకు కాదు.]

స్పెండర్‌కు యుద్ధోన్మాద మంటే తగని చిరాకు. యుద్ధంలో తమ సర్వస్వాన్నీ కోల్పోయిన మాతభాగ్యుల దీనావస్థకు ఆయన ఎంతో సంతాప పడ్డాడు. తన తల్లిని సంబోధించి వ్రాసిన యీ పంక్తులు ఆయన వేదనను వ్యక్తం చేస్తున్నయ్.

*'You rebuilt the Georgian house with the old laws*
*And the kitchen-garden surrounded by a wall*
*And the servants in the servant hall*
*Tidying the room down-stairs at dawn*
*And gave these play things to your son,*
*Your son grew up and thought it all real*
*Hunting, Family, the businessman's Ideal.'*

[పాతసూత్రాల పునాదులమీద మన కొత్త యింటిని పునర్నిర్మాణం చేశావు. పెరటితోట చుట్టూ గోడ కట్టించి బందోబస్తు చేయించావు. ప్రత్యూషమూ ఇల్లుపరిశుభ్రంచేస్తూ వుండటానికి సేవకులను నియోగించావు. కొడుక్కు ఆడుకోవటానికి ఆటవస్తువు లందించావు. నీ కొడుకు పెరిగి పెద్దవాడై, ఈ వేటవినోదం, ఈ గృహారామాలూ, ఈ వ్యాపారధర్మం ఇవన్నీ ఆహ్లాదకరంగానేవున్నా యను కున్నాడు'—కాని ఆదర్శప్రాయమైన ఈ జీవితం రెండవ ప్రపంచయుద్ధంలో లయించిపోయింది.

*He is thrown out on to a field abroad*
*A whip of lead*
*Strikes a strain of blood from his pure fore-head*
*Into the dust he falls,*
*The virgin face, carved from a mother's kisses*
*As though from sensitive ivory*
*Staring at the Sun—the eyes at last made open.*

[ఆ కుమారుడు, కాని దేశాలలో ఎక్కడో...ఒక రణక్షేత్రంలోకి విసరివేయబడ్డాడు. అమాయకమైన అతని నుదురు సీసపు కొరడా దెబ్బతో ప్రిదులుకు పోయి రక్తాలోడుతోంది. ధూళిలో కూలిపోయాడు. చైతన్యసంయుతమైన దంతమునుంచివలే, మాతృహృదయపు ముద్దులతో మనోహరంగా రూపొందించబడిన ఆ ముఖం, తెల్లబోయి సూర్యునివంక చూస్తోంది—ఇప్పటికి తెరిపిడిబడినై ఆకళ్లు]

1939 తో స్పెండర్ గొంతులో ఒక మార్పు వచ్చింది. కొంచెం పనక్కు అడుగువేసి ఆత్మాశ్రయ కవితారీతికి మొగ్గాడు. ఖైదీలనుగురించీ నిరుద్యోగ బాధితులనుగురించీ ఆయన రచించిన తొలిరచనలతో పోల్చిచూస్తే అనంతరదశలో వచ్చిన రచనలలో అంతటి ప్రతిభగాని కావ్యశోభగాని కన్పించదు.

ఏది ఏమైనా, స్పెండరుకు రూపకల్పన చెయ్యటంలో నేమి, శబ్దప్రయోగపరిజ్ఞానంలో నేమి, మహాకవికి ఉండవలసిన ప్రతిభాసంపద లున్నాయి. ఈ అభిప్రాయాన్నే వెలిబుచ్చుతూ 'హార్బ్రకేన్' అన్నాడు :

*'He has a talent for syphonic structure and sustained movement.'*

కావ్యరచనలో స్పెండర్ ప్రతిభా విశేషాల సంగతి ఇలా వుండగా, విమర్శకుడుగా, వ్యాస

రచయితగా, నవ్యాంగ్లసాహిత్య రంగంలో ఆయన అత్యంతప్రధానమైనస్థానాన్ని సంపాదించుకున్నాడు. బలమైన తార్కిక నిరూపణలతో తన వాదాన్ని విస్పష్టంగా చెప్పగల చాకచక్యం ఆయనరచనలలో సర్వత్రా గోచరిస్తూ వుంటుంది. ఎంతటి క్లిష్టమైన భావాన్నయినా, అతి తేలికైన భాషలో ముక్కుకు సూటిగా చెప్పివేయగలడు. సత్యాన్వేషిగా ఆయన యోజన తాత్కాలికములైన ప్రయోజనాల అవధులకు మాత్రమే పరిమితంగాక సార్వకాలీనములైన ప్రయోజనములను సాధించేమార్గంలో ప్రసరించుతుంది.

స్పెంసర్, 'హొరైజన్' అనే పత్రికకు సిరిల్ కొనల్లీతో సంయుక్త సంపాదకుడుగా పనిచేసి ఆ పత్రికను మహోన్నతమైన సాహిత్యస్థాయిని అందుకునేలా చేశాడు. ఆ పత్రిక సంపుటాలు ప్రతి ఒక్కటీ అమూల్యమైనదే. అనంతరం ఆయనకు 'కల్చరల్ ఫ్రీడమ్' ఉద్యమంతో పొత్తు కలిసింది ఇప్పుడు ఆ ఉద్యమం తరఫున నడుస్తున్న 'ఎన్ కౌంటర్' అనే పత్రికకు సంపాదకుడుగా పని చేస్తున్నాడు. ఇప్పటికే యీ పత్రిక మంచి పేరు ప్రతిష్టలను ఆర్జించుకో గలిగింది.

చెన్నపట్నంలో జరిగిన సాహిత్యోపన్యాసాలలో, స్పెంసర్ సాహిత్యరంగానికి సూత్రప్రాయములు కాదగిన కొన్ని ప్రధానవిషయాలను వ్యక్తీకరించారు.

(i) కళాకారునకుగాని, ప్రేక్షకునికిగాని వాస్తవిక జగత్తుయొక్క విస్మృతిని కలుగజేసేది ఉత్తమమైన కళ గాదు. జీవితంలోవున్న సంఘర్షణను వ్యక్తీకరించి, దాన్ని అధిగమించటానికి ఉదాత్తంగా పరివర్తనను పొందుతున్న మానవ మనోభావనను వ్యక్తీకరించటమే కళ సాధించేమహాకార్యం.

(ii) వాస్తవిక జీవితానికి వెలిగా వ్యక్తికి సంపూర్ణ స్వాతంత్ర్యమనేది హాస్యాస్పదమైన విషయం. కాని సాహిత్యకారులు గమనించవలసిన ముఖ్యవిషయమొకటివుంది. వ్యక్తినిమానవకల్పితములై, క్షణక్షణం పరివర్తన పొందుతూవుండే సాంఘిక రాజకీయాది ఉద్యమ యంత్రాలకు బానిసగా పరిగణించకూడదు. వ్యక్తికొరకే సర్వనాగరికతలనూ రూపొందించుతున్నది గనుక వ్యక్తికొరకు పరమప్రయోజనంగానే సాంఘిక రాజకీయాది సమస్తోద్యమాలలోనూ పరివర్తన తీసుకురావటానికి ప్రయత్నించాలి.

ఇంతటి విఖ్యాతి నార్జించుకున్నా స్పెండర్ ఇంకా నడివయస్సులోనే వున్నారు. సాహిత్య రంగంలో ఇంకా అనంతంగా కృషిచెయ్యటానికి ఆయనకు అవకాశం వున్నది. మహాకవికి కావలసిన ప్రతిభాసంపదలన్నిటినీ ఆయన పెంపొందించుకో గలిగారు. సాహిత్య రంగానికి గర్వకారణం కాదగిన ఒక మహారచనను ఆయన ప్రపంచానికి అందజేయగలడని మనం ఆశించవచ్చును.

# ఆచార్యబ్రువుడు

## శ్రీ పురుషోత్తమ దోభాల్

★ ★ అఖిలభారత సంస్కృత కథానికలపోటీలో ప్రథమ బహుమతినందిన కథ. సంస్కృత రచనను ప్రోత్సహించే ఉద్దేశంతో వివిధభాషల జాతీయపోటీతో నిమిత్తం లేకుండా, ప్రత్యేక సావకాశమిచ్చి, ఈకథను సరాసరి ప్రపంచపోటీకి అంగీకరించారు. శ్రీపురుషోత్తమదోభాల్ సంస్కృత హిందీభాషలలో పండితులు; సంస్కృతంలో వీరు 'ఉత్సర్గ' అనే నాటకాన్ని, 'వనిత' అనే నవలను ఇంకా కొన్ని కథానికలను రచించారు. హిందీలో చాలా నాటకాలూ, నవలలూ, కథలూ, గేయాలు రచించారు. వీరి జన్మస్థానం ఉత్తరప్రదేశరాష్ట్రంలోని మస్మోలాగ్రామం; జననం 1925.

6

'అరుణా! నాకు ఈవేళ చాలా అలసటగా వుంది'

'అవును మీరు విశ్రాంతి లేకుండా పనిచేస్తున్నారు'—జాలి గొంతుతో అరుణ మారుపలికింది.

'నీవుకూడా చాలా బడలిపోయినట్టున్నావు'

'నా అలసటకేవిఁలెండి'—చిరునవ్వుతో సమాధానం చెప్పింది.

అరుణ సంపన్న కుటుంబంలో జన్మించిన బాలిక. బాల్యంనుంచీ, నాట్య సంగీతాలూ చిత్రలేఖనం అభ్యసించుతోంది. అరుణకు ఇంకా ఇరవై యేళ్లు నిండలేదు; అయినా సంగీత కళలో ఇప్పటికే ఆమె పేరు బహుళ వ్యాప్తిలో వుంది.

'కుముద్ సంగీత పరిషత్' ప్రధానాచార్యుడు ఆచార్య కుముద్, శిష్యురాలు అరుణ తెలివితేటలు చూసుకుని ఎంతో మురిసిపోయేవాడు. అరుణ అంటే ఎంతో ఇదిగా వుండేవాడు. అలాంటి మహామహులైన సంగీత కళానిధి తన ప్రతిభను గుర్తించటం అరుణకు కూడా గర్వకారణంగానే వుంది.

పరమపవిత్రుడైన కుముదాచార్యుడూ, సౌందర్యరాశి అరుణా, ఇద్దరూ కలసి సభలో కూర్చుని గానంచేస్తుంటే కోయిల లాలకించేవి. వారిద్దరూ ఒక మహాసభలో విజయం సాధించి అప్పుడే తిరిగి వచ్చారు. ఆనాటి సభలో మహామహులు ఎందరో పాల్గొన్నారు. కాని వీరిద్దరికీ లభించినన్ని అభినందన పరంపరలు మరొకరికెవ్వరికీ లభించలేదు. అరుణ వీణ వాయించుతూ సంగీతం పాడింది; అనంతరం అత్యంత మనోహరంగా నృత్యం చేసింది. ఆవిడకు సహకారంగా గానం చేస్తున్న ఆచార్యుడు ఆ కళ్యాణి కంఠమాధుర్యానికి ముగ్ధుడై, ఆవేళ వివశుడైపోయాడు. వొళ్లు తెలియని ఆనందతన్మయత్వంలో గంగాలహరులు ఒక్కుమ్మడి పల్లవిరిసినట్టు పాడేశాడు. అనంతరం, అదే ఆవేశంతో లేచి స్వయంగా 'శివతాండవం' ప్రదర్శించాడు. సహజంగా ఇద్దరూ చాలా అలసటపడి బడలిపోయివున్నారు.

ఒకక్షణానికి అరుణ లోపలినుంచి వచ్చి, భోజనానికి లేవవచ్చునని చెప్పింది.

'ఇదేవిఁటి అరుణా ఈవేళ?—పరమశివునకు ప్రాంజలి బద్ధులము కాకండా మనం భోజనం చెయ్యమనే సంగతి నీకు జ్ఞప్తి తప్పిందేం?'—

'క్షమించండి — మరిచేపోయాను' అంటూ, వెంటనే శివపూజకు సన్నాహాలు ప్రారంభించింది: జ్యోతులు వెలిగించింది: కర్పూర నీరాజనం వెలుగు

తూన్న పళ్ళెరం ముందు బెట్టుకుని ఆచార్యుడు శివ స్తోత్రాలు గానం చేస్తున్నాడు. ఉంటుండి ఆయన కంఠం ఎందుకో రుద్ధమౌతోంది. ఏదో అంతు తెలియని వ్యథతో అతని హృదయం ఛిన్నాభిన్నమౌతోంది. అరుణ ఒడిలో తలదాచేసుకుని బిగ్గరిగా ఏడిచెయ్యాలని, ఆయనలో ఒక విచిత్రమైన దైన్యభావం కలిగింది. ఒకటి రెండుసార్లు తల పైకెత్తి అరుణవంక చూచాడు. అరుణ కన్నులు రెండూ మూసుకుని ధ్యానసమాధిలో మునిగి వుంది.

ఆచార్యుని హృదయంలో అలాంటి కల్లోలం బయలుదేరిందని ఆవిడకెలా అర్థమౌతుంది. ఆయన తన శిష్యులనందర్నీ తండ్రిలా ఆదరించేవాడు. అరుణను కూడా అలాగే చూస్తున్నాడు.

ప్రార్థనాదికం ముగించుకుని భోజనశాలలోకి వెళ్ళారు. భోజనంవగ్గిర కూర్చున్నాడన్న మాటేగాని ఆయనకు మెతుకు సాక్ష లేదు. ఎలాగోలా రెండు మెతుకులు మునివంట కొరికి లేచి చేతులు కడుక్కున్నాడు. అరుణకూడా తిన్నగా భోజనం చెయ్యలేదు. మిగతా శిష్యబృందమంతా ఎక్కడివాళ్ళక్కడ యిళ్లకు వెళ్ళిపోయారు. ఆచార్యుడు తన గదిలోకి వెళ్ళిపోయాడు. గదిమధ్య పద్మాసనం వేసుకు కూర్చుని తిరిగి ధ్యానంలో మునిగిపోయాడు. ఆచార్యుడు విశ్రాంతి తీసుకునే ఆ పవిత్ర మందిరంలోకి శిష్యులెవ్వరుగాని అడుగు బెట్టే అలవాటు లేదు — ముఖ్యంగా రాత్రివేళ ఆగదిలోకి ఎవ్వరూ వెళ్లరు. కాని ఆనాడు ఆచార్యుడు ఏదో మనోవ్యాకులస్థితిలో వున్నాడని గ్రహించిన అరుణ మనస్సు ఉండబట్టలేక పోయింది. ఆస్థితిలో ఆయన్ని ఒంటరిగా వదిలివేయటానికి ఆవిడకు మనస్కరించలేదు. అరుణ లోపలికి రావటం గమనించి ఆచార్యుడు కన్నులువిప్పి అత్యంతనిగ్రహాన్ని వ్యక్తంచేస్తున్న కంఠంతో: 'ఇలా వచ్చావేం, అరుణా?' అని ప్రశ్నించాడు.

'క్షమించండి — మీకు వంట్లో బాగులేదేమోనని...'

'అవుననుకో, కాని...'

'ఏమిటి సంకోచించుతున్నారు సెలవియ్యండి—'

'నీకు అర్థంకాదులే అరుణా'



# రచయిత

'చెప్పండి పోనీ, ఏమైనా సాయపడగల్గు నేమో చూస్తాను'

'నాకేదో పిచ్చెత్తిపోతున్నట్లుగా వుంది—'

'ఎందుకూ—ఎందుకంత వ్యథా?'

'నావ్యథకు నీకు కారణం చెప్పాలా?— పో ముందిక్కడనుంచి.'

అలాంటి కఠోరవాక్యం ఆచార్యునినోటినుంచి వెల్వడటం అరుణ అతఃపూర్వం ఎన్నడూ వినలేదు. ఇక అక్కడ నిల్చుంటే అవినయంగా వుంటుందని నెమ్మదిగా బయటికి వచ్చేసింది.

తన జీవితాన్ని కళారాధనకు అంకితం చేసుకున్న ఆచార్యుడు రెండుదశాబ్దాలుగా అత్యంత నిష్ఠతో జీవితాన్ని అసిధారావ్రతంగా గడుపుతూ వచ్చాడు. తన మనస్థైర్యాన్ని యీషణ్మాత్రమైనా చలించనిచ్చేవాడు కాడు. కాని అరుణ గురుకులంలో అడుగుబెట్టినతరువాత, ఆయన మనస్సులో ఏదో మార్పు వస్తున్నట్టు ఆయనకే తట్టింది. మనస్సు స్వాధీనం తప్పుతోంది. రానురాను ఆచినా ఆగకుండా ఆయన మనోభావన యావత్తూ అరుణ చుట్టూ

తీగలుతీగలుగా పెనవేసుకుపోతోంది. కళ్లెదుట వుంటే, ఆ మూర్తిమీదనుంచి కనుచూపులు వెనక్కు మళ్లించుకోలేకపోతున్నాడు. కళ్లెదుట కనుపించకపోతే ఆ మూర్తినిగురించే ఆలోచించుతున్నాడు. కలలోకూడా ఆ మూర్తినే దర్శించుతున్నాడు.

ఈ పదిమాసాలనుంచీ ఎలాగోలా నిభాయించుకొచ్చాడు. కాని నాటి సాయంత్రం జరిగిన ప్రదర్శనంలో ఆ ముగ్ధమోహినీరూపం చూసి తన్మయుడై పోయాడు. ఆయన మనస్థైర్యం ఛిన్నాభిన్నమైపోయింది. అరుణ సన్నిహితురాలౌతుంటే ఆయన కిప్పుడు భయంగానూ, అలజడిగానూ వుంది.

అరుణ కిదంతా ఏమీ తెలీదు. పరమపూజ్యుడైన గురుదేవుని ఈ మనోవ్యాకులతకంతకూ తనే కారణమన్న విషయం కలలోనైనా ఊహించలేకపోయింది. ఆయన అంతకల్లోలపడటానికి కారణమేమిటి? కొంప తీస్తే తనేమీ అవినయంగా ప్రవర్తించలేదుగదా! అరుణకు కంగారుగా వుంది.

ఇలా మథనపడుతూ తన గదిలోకిపోయి పడుకుంది. కాని కునుకుపట్టలేదు. తెల్లవార్లూ ఆందోళన పడుతూనే వుంది.

తూరుపురేఖలు పొడుస్తున్నయ్ పక్షుల కలకలారావం విని పక్కమీదనుంచి లేచి బయటికి వచ్చింది. సరాసరి ఆచార్యుల గది దగ్గిరికివెళ్లి కిటికీలోనుంచి తొంగిచూసింది. పద్మాసనస్థితుడై అలానే కూర్చున్నాడు. వెళ్లి స్నానంచేసి మళ్లా తిరిగి వచ్చింది. ఆయన కళ్లు తెరిచి చూచేసరికి తాను శివపూజకు కావలసిన సన్నాహమంతా చేస్తూ కనుపించింది.

ప్రభాత పూజ పూర్తికాగానే అరుణ తన గదిలోకి వెళ్ళిపోయింది. మిగతా అధ్యాపకులూ ఛాత్రులూ అంతా వచ్చారు. ఆచార్యుడు పాఠశాల కార్యక్రమంలో నిమగ్నుడైపోయాడు. ఆయన ఇప్పుడు నిర్వ్యాకులుడైవున్నట్లు అరుణకు కనుపించాడు. విద్యార్థులంతా రావటంతో వాతావరణమంతా తిరిగి కళకళలాడిపోయింది.

మామూలు మోస్తరుగానే ఆ మధ్యాహ్నంకూడ అరుణ ఆచార్యులకు భోజనం వడ్డించింది. పగలంతా మామూలుగానే ప్రశాంతంగా గడిచిపోయింది. అంతా సరీగానే వున్నదనే ఆత్మసంతృప్తి కలిగింది, అరుణకు. సాయంత్రం పంచపాళీంలోకూర్చుని హాయిగా వీణ వాయించుకుంటోంది. గీతిపై గీతిగా మహదానందంతో గానం చేస్తోంది. ఆ తన్మయతలో పరిసరాలలో ఏమి జరుగుతున్నదో కూడా ఆమెకు తెలియలేదు; ఎంత ప్రొద్దుపోయిందో కూడా అవగతం కాలేదు.

వీణావాదనం ముగించేసరికి అర్ధరాత్రి దాటింది. విశ్రాంతి తీసుకోవటానికి తన గదిలో ఉన్న పక్కచేరువకు వెళ్ళింది. ఏదో అలజడై వెనక్కు చూచింది. చిరునవ్వు నవ్వుతూ అనతిదూరంలో ఆచార్యుడు కనుపించాడు:

'అరుణా! ఇంత ప్రొద్దుపోయిందేం?'

హాఁ! అవును ప్రభూ'—అయోమయంగా సమాధానం చెప్పింది

ఆచార్యుడు ఒకొక్క అడుగే ముందుకు వేస్తూ ఆమెను సమీపిస్తున్నా ఇంద్రియ సంక్షోభంతో వికృతంగా మారిపోతున్న ఆయన ముఖం చూసి అరుణకు కంగారెత్తిపోయింది

'నాన్నా'—భీతహరిణిలా అర్చింది.

ఆ కేక ఆచార్యుని హృదయంమీద సుత్తిపు కొరడాలా ఛళ్లున మోగింది. తన అమానుషత్వానికి తానే సిగ్గుపడి తలవంచేసుకున్నాడు పశ్చాత్తాపంతో ఆయన హృదయం దగ్ధమైపోతోంది.

'మహా పాపిని—క్షమించు అరుణా!'—ఈమాట అంటూనే, బయటికి వెళ్ళిపోయాడు.

మర్నాటి ఉదయమే నిద్రలేచి అరుణ ఆచార్యుల మందిరం దగ్గరికి వచ్చి చూచింది. గది మధ్య పద్మాసనం వేసుకుని ధ్యాననిమగ్నుడై వున్నాడు. ఆయన సాధనకు భంగం కలగకుండా ఏమీ చప్పుడు చేయకుండా పిల్లికూనలా యివతలికి వచ్చేసింది. దేవాలయంలోకి వెళ్ళి పూజాదికాలు ముగించుకుని మళ్ళా తిరిగివచ్చి చూచింది. ఆయన శిలామూర్తిలా ఇంకా అలానే కూర్చునున్నాడు. అరుణకు అనుమానమేసి, దగ్గిరికి వచ్చి, ఆయన దేహాన్ని స్పృశించి చూచింది. ప్రాణంలేని మృత కళేబరం! అరుణకు కంగారెత్తిపోయింది. గురుదేవుని ముందు జ్వాలలు రేపుతున్న అగ్నిహోత్రపు దీధితులతో ఆ మందిరం ఊహకు అందని ఒక పునీత దృశ్యంగా మారిపోతున్నది. అరుణ మానసపథంలో ఏదో సుడిగాలి ఉప్పెనలా రేగిపోయింది. ఆచార్యుల పాదసన్నిధిని సాష్టాంగంగా మూర్ఛిలి పోయింది.

# అసిపంజరం

శ్రీ మంథా వెంకటరమణారావు

[గతసంచిక తరువాయి]

## రంగం: 2

★★ పార్వతీశంగారియిల్లు. పొడుగాటి పెద్దగది; గదిలో ఒక పెట్రొమాక్సు వెలుగుతోంది ఒక స్టాండుమీద; గదికి పెద్దపెద్ద కిటికీలు; రెండుద్వారాలు — ఒకటి బైటకి, రెండవది ప్రక్కగదిలోకి; దళసరైన ఎర్రటి కర్టెన్లు; రెండవగదిలోకూడా ఒక పెట్రొమాక్సు వెలుగుతోందికాని దానికాంతిని మరుగుపరుస్తోంది ద్వారానికున్న కర్టెను.

గది ఈ కొసను రెండుసోఫాలు, ఒక పెద్దటేబిలు, రెండుకుర్చీలు; టేబీలుమీద డాక్టర్ తోలుసంచి, ఇంజక్షన్ పరికరాలు, కొన్నిగ్లాసులు, బేసిన్‌తో నీరు — ఇంకా కొన్నికొన్ని మందుసీసాలు, ప్యాకెట్లు; టేబిలుమీద వెలుగుతూ ఒక స్టవ్; డాక్టర్ రామారావు నిల్చొని ఇంజక్షనుకు కావలసినవి తయారుచేసుకుంటూ ఉంటాడు; పార్వతీశంగారు ప్రక్కని నిల్చొని ఉంటారు. వయస్సు 55 సం॥లు, తెల్లటి పంచ, గోధుమ రంగు లాల్చీ, బట్టతల, పెద్దనుదురు; తమ్మునికీ ఇతనికీ పోలిక ముక్కులోనూ, పెదవులలోనూ ఉంది. ఇతనికీ మీసాలున్నాయి కాని అంతపెద్దవికావు ★★

పార్వతీశం: (ప్రక్క గది ద్వారంవైపుచూసి) ఇంజక్షన్ ఇప్పుడే ఇస్తారా డాక్టర్?

రామారావు: ఇంకొక పదినిముషాల్లో—

పార్వతీశం: అయిదునిముషాలు మీరు విశ్రాంతి తీసుకోవచ్చు-

రామా: నేను విశ్రాంతి తీసుకు నేందుకు రాలేదు.

పార్వ: (గొంతు తగ్గించి) మీ అభిప్రాయ మేమిటి డాక్టర్?

రామా: (పనిచేసుకుంటూ మౌనం)

పార్వ: (బెదురుగా) మనచేతులుదాటి పోయిందంటారా?

రామా: నా ప్రయత్నం నేను చేస్తాను అన్ని విధాలా—

పార్వ: ఆశ ఉందంటారా?

రామా: మీ రింకా ఆలస్యంచేసుంటే ఏమీ ఉండకపోను—

పార్వ: ఔను—మధ్యాహ్నంవరకూ తెలుసుకోలేకపోయేను. తెలుసుకున్నాకకూడా ... (డాక్టర్ మౌనంగా పనిచేసుకపోతూ ఉంటాడు) మీకొక సంగతి చెప్పాలి...

రామా: చెప్పండి...వింటున్నాను.

పార్వ: మీతండ్రిగారినిగురించి...

రామా: చెప్పండి...

పార్వ: మీతండ్రి గొప్పభక్తులు..

రామా: నాకు తెలుసు...

పార్వ: ఆసంగతి...?

రామా: విన్నాను.

పార్వ: నాభార్య పోవడానికి ఆయనే కారణం అని ఇవాళవరకు నా నమ్మకం.

రామా: (పనిచేసుకుంటూనే) ఇవాళ ఆనమ్మకం పోయిందా?

పార్వ: ఆయనే ఆనాడు పూజనూ చేసి వచ్చి ఉంటే నా భార్య బ్రతికి ఉండేది!

రామా: ఆయన రాకపోయినా అంత అనుభవమూ ఉన్న కామేశ్వరరావుగార్ని తీసుకవచ్చేరుగా?

పార్వ: మీ తండ్రిలా నాకు గురి ఉండేది...

రామా: ఆయన ట్రీట్ చేసినా అదే ఫలితం కలిగితే...

పార్వ: అంతగా బాధపడకపోయిఉండేవాణ్ణి

రామా: మీకు ఆయనమీద గురివుందని, ఆయన రాకపోయేడని, మీ భార్య పోవడానికి ఆయనమీద నిందవేస్తారన్నమాట...

పార్వ: కాని, డాక్టర్ అన్నవాడు సందర్భాన్నీ, తొందరని గమనించి వెంటనే కేస్‌కి ఎటెండవటం బాధ్యత కాదా?

రామా: ఎందరు డాక్టర్లలా ఎటెండవుతున్నారు?

పార్వ: ఏ డాక్టరన్నా వచ్చిఉండును...

రామా: మీరు పిలుస్తే...

పార్వ: నేను పిలుస్తేనా?

రామా: ఔను! మీరు పిలుస్తే. మీకా శక్తి ఉంది గనక — ఒక సాయంత్రం టెన్నిస్ ఆట పోయినా విచారించవల్సిన పనిఉండదు గనక.

పార్వ: ఇతరులు పిలిస్తే అలా వెళ్ళరంటారా?

రామా: అలా నేను చెప్పలేను...కాని, ఇవ్వడంలో శక్తి తక్కువగా ఉన్నవాళ్లు, అలాటి వాళ్ళు విరామసమయంలో పిలుస్తే, కొంతమంది కొంచం ముందువెనుకలు ఆలోచించటం వుంది సాధారణంగా...ఇప్పుడు మీరేం నా తండ్రి, మీ భార్య పోయేందుకు కారణం అన్నారో, అలానే ఇవ్వలేందుకు శక్తిలేనివాళ్ళంతా ఇలాటివాళ్ళే అయితే ఆ డాక్టర్ని అలానే అంటారు... నేననేది మా నాన్నగారు తక్కిన డాక్టర్లకన్నా తప్పుగా ప్రవర్తించిందేమీ లేదని. డాక్టరయాక తన వృత్తిధర్మాన్ని కొన్ని స్వంత కారణాలవల్ల నెరవేర్చలేకపోవటం తప్పే... కాదనను...... కాని ఆయన కేసు పట్టాక అశ్రద్ధ చూపటం నేనెప్పుడూ ఎరగను. పూజ విషయమంటారా? మనిషై పుట్టాక అలాంటి మొండిపట్టు ప్రతీవారికీ ఏదో ఒకటి ఉంటూనే వుంటుంది

పార్వ: మీరెంత చెప్పినా, నా మనస్సులో ఆ బాధ ఉండిపోయింది..

రామా: మీ [illegible] కూడా విషం —

పార్వ: (నవ్వి) ఆ స్వభావం ఉండేది. ఆయన కుమారులు మీరు — మీ మీద కూడా ఆ స్వభావం ఉండేది ..అలాటివారు మీరు కాకపోయినా...

రామా: ఇప్పుడుకూడా ఉందంటారా?

పార్వ: మీ తెలివితేటలలోనూ, కార్యదీక్షలోనూ నాకు పూర్తిగా నమ్మకం ఉంది. అందుకే మీరు తప్ప మరెవ్వరూ నాకిష్టం లేకపోయింది...మీ దగ్గరికి వెళ్ళడానికి మనసు కుదుర్చుకోలేక మధ్యాహ్నంనించీ కొట్టుకుంటున్నాను...

రామా: ఊఁ...

పార్వ: నాకు పెద్దొక్కడే కొడుకు......ఏక పుత్ర విషయం.

రామా: విన్నాను.

పార్వ: ఏ చేసుంటారు......(గద్గదస్వరంతో) నేనేవో మాటలు మీ తండ్రిగారిని గురించన్నాను. అది మరిచిపోండి...

రామా: దానికీ, దీనికీ సంబంధమేమిటి?... మానసిక కారణాలు వృత్తిలోకి తేవటం డాక్టరు పని కాదు...

పార్వ: (గొంతు తగ్గించి) మీలో నేను పూర్తి నమ్మకం ఉంచుతున్నాను...అన్ని విధాలా ప్రయత్నిస్తారని...మిమ్మల్ని నా శక్తికితగ్గట్టు సంతోష పెట్టకపోను...

రామా: సంతోష పెట్టడం సంగతి ఎత్తకండి... పేషెంటుని డబ్బు దృష్టితో మాడడం నాకు సాధ్యం కాదు పార్వతీశం గారూ......మీరు రోగాన్ని డబ్బుతో లొంగదియ్యలేరు కదా? నా ప్రయత్నం గురించి మీరేం ఆతురతపడకండి...

పార్వ: మీ కింకేమన్నా కావాలా?

రామా: ఏమీ అక్కర్లేదు—కాని ఎవరన్నా నాకు సహాయం ఉండాలి...

పార్వ: నేను ఈబాధ మాడలేను...

రామా: బిడ్డవిషయంలో తండ్రికి అలానే ఉంటుంది...మీరే ఉండక్కర్లేదు...

పార్వ: (బాధతో) నా ప్రాణం అన్నా ఇచ్చేస్తాను కావాలంటే...కాని ఈ ఇంజక్షనివ్వడం అదీ చూడలేను...

రామా: ఎవరున్నా చాలు మీరు విశ్రాంతి తీసుకోండి...

పార్వ: విశ్రాంతి!! అదికూడానా?

రామా: సరే మీరు వెళ్ళి ఎవర్నన్నా పంపండి...

పార్వ: పనివాళ్ళ లాభం లేదు...మా కోడల్ని పంపుతాను....

రామా: (ఆశ్చర్యపోయి) వద్దొద్దు! ఆవిడకి శ్రమ నివ్వకండి! పనిమనిషిని పంపండి చాలు!

పార్వ: మా కమల ఇటువంటిసాయంలో ఆరి తేరిపోయింది.

రామా: కమల!! (వెంటనే సర్దుకుంటాడు)

పార్వ: (అనుమానంగా) మీకు తెల్సునా? విశ్వనాథం గారి అమ్మాయి.

రామా: (పనిఆపి) విశ్వనాథం గారి అమ్మాయి!!

పార్వ: ఔను—కాలేజీలో చదివినఅమ్మాయి.. మీకు తెలిసేఉంటుంది...

రామా: (కొద్దిగా తేరుకుని) ఔను! నాకు తెలుసు. (తత్తరపాటుతో) నా క్లాస్ మేట్.

పార్వ: నిజంగా — (అంత విచారంలోనూ చిన్న నవ్వు తెచ్చుకొని) అయితే ఇంకేం — మీతో పరిచయమున్నది కూడానూ...(ఎవర్నీ ఉద్దేశించక) ఇన్నేళ్ళయి కమల గాక ఇంకెవరు సెగ్గుకొచ్చేరు.

రామా: ఆమె కింకా శ్రమనివ్వడం మంచిది కాదేమో! పనిమనిషిని పంపండి...

పార్వ: పనిమనిషిని పంపడమే! కోడలు ఒప్పుకుంటుందా! అలా లాభంలేదు డాక్టర్! కమలని పంపుతాను...మీ భోజనం ఎనిమిదింటికి...

రామా: క్షమించండి — నేను భోజనం చెయ్యను.

పార్వ: అదేం డాక్టర్! మనమంతా ఒక శాఖ వాళ్ళమే!

రామా: నాకా నియమా లేమీ లేవు...కాని కాఫీ వుంటే పంపండి...అంతకుమించి ఏమీ తీసుకోను...

పార్వ: సరే డాక్టర్...నాకూ ఏం తినాలని లేదు...

[పార్వతీశంగారు వెళ్తారు...రామారావు పని ఆపి ఒకసారి ద్వారంవైపు, మరొకసారి పేషెంటున్న గదివైపు మాస్తాడు...అతని ముఖకవళికలలో చాలా మార్పు వచ్చింది. చిన్నచప్పుడైతే అతని కళ్లు బెదురుగా చూస్తున్నాయి.

రెండు నిమిషాలు గడుస్తాయి. కమల కాఫీ ఫ్లాస్కుతోనూ, బిస్కట్ల టిన్‌తోనూ ప్రవేశిస్తుంది. వయస్సు-25 సం॥—లేతగులాబీరంగు చీర—తెల్ల వాయిలు జాకెట్టు వేసుకుంది...ముడి వేసిన జుత్తు—మనిషి అందకత్తె అనే చెప్పాలి. గోధుమరంగు శరీరం.

ముఖం వాడిపోయింది......కళ్ళు నీరసంగా వుండి, ఏదో విచారాన్ని, బాధని వాటిలో దాచుకున్నాయి—

రామారావు ఉలిక్కిపడి, ఆమె ముఖాన్ని కొన్ని సెకండ్లు చూసి పనిలో మునిగిపోతాడు—కమల ఇదేదీ గమనించనట్టు టేబిలుదగ్గరికి వెళ్ళి, ఫ్లాస్కు, టిన్ను, దానిమీద పెట్టి, పేషెంటున్న

[ప్రక్క గదిలోకి వెళ్తుంది. ఒక నిమిషం పోయాక తిరిగి డాక్టర్ దగ్గరి కొస్తుంది.]

కమల: ఏమిటి చెయ్యమంటారు?

రామా: (ఆమెముఖంలోకి చూస్తాడు. ఆమె కళ్లు దించుగుంటుంది) ఇంజక్ష తయారు చేస్తాను. కొంచం -అం . సెలైన్ ఫ్లాస్కు పట్టుకోవాలి...

కమల: సరే...

రామా: (వాచీ చూసుకుంటాడు) టయిమైంది రండి...

[గది కొన్ని నిమిషాలు కాళీ—ఇద్దరూ తిరిగి వస్తారు—కమల ఇంజక్షన్ పరికరాలు మోస్తూ]

రామా: (ఆగి) ఒక్కరోజులో ఇలా శల్యం అయిపోయేరా?

కమల: (ఆగి) కాదు.

రామా: ఉఁ...

కమల: క్షయ...

రామా: ఓహో!

కమల: తెలిసే అడిగేరా?

రామా: (తత్తరపాటుతో) ఎలా అనుకుంటు న్నారు?

కమల: ఆశ్చర్యపోలేదు కాబట్టి.

రామా: ఎందు కాశ్చర్యపోవాలి? రోగం పేరు విని?

కమల: అయితే నేను పొరపాటుపడ్డాను.

[కుడిప్రక్క గదిలోనించి గడియారం గంటల శబ్దం వినవస్తుంది, ఎనిమిది సూచిస్తూ]

రామా: (వాచీ చూసుకుంటాడు) ఆగడియారం గంటలు మైలుదూరం వినిపిస్తాయిలా ఉంది...ఇటు వేపింకోగది ఉందా?

కమల: ఉంది — కాని దానిద్వారం అటు వేపుంది—మళ్ళీ ఎన్ని గంటల కివ్వాలి?

(టేబిలువైపు నడుస్తుంది)

రామా: మూడేసిగంటల కొక్కొక్కసారి... అంటే పదకొండుకొకసారి, రెండు కొకసారి. (ఆమె వెంటవెళ్తూ) మరొక పావుగంటకి కోరమైన్ ఇంజక్షు నిస్తాను.

కమల: తలుపుదగ్గర వేడినీళ్లు, సబ్బుఉన్నాయి. చేతులు కడుక్కోండి.

రామా: (ఆగి) టేబిలుమీద టెట్టాలుంది... పట్టండి. అక్కర్లేదు...నేనే తెచ్చుకుంటాను...

కమల: ఫరవాలేదు — నేను తెస్తాలెండి...

రామా: అసూదికూడా ఇప్పుడే తీసేస్తే తరవాత ఇంకోసారి చేతులు కడుక్కో అక్కర్లేదు—

[టేబిలు దగ్గరికి వెళ్లాడు కమల స్టవ్ క్రింద నుంచి బేసన్‌తో నీళ్లు దానిమీద పెడుతుంది... డాక్టర్ తనపని చేసుకుంటాడు. కమల తలుపుదగ్గరికి వెళ్ళి చేతులు కడుక్కుంటుంది.

డాక్టర్ కూడా వెళ్లి చేతులు కడుక్కుంటాడు—

కమల తువ్వాలందిస్తుంది. చేతులు తుడుచుకొని అతను సిరంజి.కేసుతోకూడా బేసిన్‌లో పెడతాడు]

కమల: కాఫీ ఇచ్చేదా?

రామా: (ఆమెవేపు చూస్తూ) ఈ ఊళ్లో కాఫీ హోటలుందా?

కమల: హోటలుకాఫీ కాదులెండి... నేను చేసిందే...

రామా: రెండు నిమిషాల్లో చేసేశారా?

కమల: ముందుగానే చేసి ఉంచేను.

[బిస్కట్లటిన్ను విప్పుతుంది]

రామా: క్షమించండి. నేనేమీ తినను. కొంచం కాఫీ ఇవ్వండి చాలు...

కమల: మీరు భోంచెయ్యలేదుగా?

రామా: నాకేం తినాలని లేదు. కాఫీ ఇవ్వండి చాలు—

[వెళ్ళి సోఫాలో కూర్చుంటాడు. కమల ప్లేట్లో బిస్కట్లు, కప్పులో కాఫీపోసి సోఫాదగ్గరి కొకస్టూలు లాగి దానిమీద పెడుతుంది]

కమల: ఫరవాలేదు. అవి తీసుకోండి. ఇక్కడేమన్నా తినేందుకు జంకుతున్నారేమో?

రామా: జంకెందుకు? 'డిస్ ఇన్ ఫెక్టు' చేసేక అంతా?

కమల: ఏమోలెండి.

రామా: వద్దు. -వత్తిడి చెయ్యకండి...

కమల: నేనూ భోజనం చెయ్యలేదు—ఆ మాట కొస్తే నాకూ కొంచెం ఏమన్నా తినాలని ఉంది... మీరు తినకపోతే నాకూ తిన బుద్ధికాదు.

రామా: మీరు భోం చెయ్యలేదూ? ఇందండి... (ప్లేటు అందిస్తాడు) నేను తినకపోతే మీ కెందు కభ్యంతరం?

కమల: మీరు అతిథిలాంటి వారుకూడా...

రామా: ఆ పిచ్చేం పెట్టుకోకండి—నా కలాంటి మూఢ విశ్వాసాలేమీ లేవు.

కమల: (లేచి మరొక ప్లేట్లో బిస్కట్లు తెచ్చుకొని సోఫాకోసని కూర్చుంటుంది) రాత్రల్లా మేలు కోవాలి. అలసట ఔతుంది...మీ ఇష్టం.

రామా: సరే—అంత పత్తిడిచేస్తున్నారు కనక.

[ఇద్దరూ తింటూఉంటారు]

మీరు నన్ను పోల్చలేనట్టుంది...

కమల: (ఊరుకొని) కాఫీ మీకు వెంటనే ఎలా వచ్చింది?

రామా: నేను వస్తానని తెలుసునా?

కమల: తెలుసు—మామగారు చెప్పారు.

రామా: కాని మీరు నన్ను గుర్తించినట్టు అనిపించలేదు.

కమల: అంటే ఎలా ప్రవర్తిస్తానని ఉద్దేశపడ్డారు?

రామా: ఓహో అంటే ఓహో అనుకోవచ్చునుగా? అంతేమాత్రాన ఏమీ తప్పలేదు.

కమల: నేను ఇంతసేపయి మీ అతిథి మర్యాదకి ఆశ్చర్యపోయేను—ఒకవేళ మీకే నన్ను తెలుసుకోడం ఇష్టంలేదేమోనని...

రామా: పరిస్థితులు మారేయి కదూ? పైగా నీకే నన్ను జ్ఞాపకం ఉంచుకోడం ఇష్టంలేదేమోనని.

కమల: (దెబ్బతిన్నట్టయి) అంటే?

రామా: నేను తిరిగి మద్రాసునించి వచ్చేవరకు నువ్వింత అదృష్టవంతురాలవయ్యేవని తెలీదు ... అరగంట క్రిందటివరకూ ఆ శ్రీమంతుల ఇల్లు ఇదేనని తెలీదు.

కమల: (ఆవేశంపట్టలేక) రేపు ఉదయాంవరకూ తెలీదు నాలాంటి దురదృష్టవంతురా లుండబోదని...

రామా: కమలా!! ఏమిటా మాటలు!!

[కమల ప్లేటు క్రిందపెట్టి సోఫా చేతిమీద తల ఆన్చి, చేతులతో ముఖం కప్పుకుంటుంది]

రామా: (తన ప్లేటుకూడా స్టూలుమీద పెట్టి) ఎందుకలా బాధపడి ఏడుస్తావ్ కమలా) ఏ బెంగా పెట్టుకోకు. మీ ఆయనకేం ఫరవాలేదు. నాకు ధైర్యంగా ఉంది...నువ్వలా అధైర్యపడకు.

[కమల ముఖంఎత్తి కళ్లు చీరచెంగుతో తుడుచుకుని రామారావువేపు వింతగా చూస్తుంది]

ఔను కమలా! నేన్నీకు ధైర్యం ఇస్తున్నాను. సరిగ్గా వేళకు మందుపడాలి. రాత్రి పన్నెండునించి తిరుగు ముఖం పడుతుంది వ్యాధి.

కమల: (ఏదో బాధని మరుగుపరుస్తూ) నిజమా డాక్టర్!

రామా: నిజం కమలా ... మీ ఆయన్ని తిరిగి నీకప్పగించే పూచీ నాది...సరా?

కమల: (గుండెమీద చెయ్యి వేసుకొని) నా కెంత ధైర్యం ఇచ్చేరు! మీ మేలు మరిచిపోలేను జన్మజన్మాలకి

రామా: ఇందులో మేలుకేముంది కమలా! నా కర్తవ్యం!

కమల: ఔను కర్తవ్యం—డాక్టర్లుకదూ.

రామా: నేనలా అనడం నీకిష్టంలేకపోతే...

కమల: ఎలా అనుకోమంటారు ... డబ్బుండీ డాక్టర్ గారూ...డబ్బు పుచ్చుకోడం మానేస్తారా?

రామా: అలా ఎందుకంటావ్ కమలా! నువ్వలా అనటం నాకు కొత్తగా ఉంది... నేను డబ్బుకోసమే రాలేదు...

కమల: నాకోసం కూడానా?

రామా: (తీవ్రంగా) కమలా! ఏంమ్మాటలవి?

కమల: మీ రెందుకలా అనుకుంటారు. నాకు సాయం చెయ్యడానికా? అంటే ఒక యువతిని వైధవ్యంనించి తప్పించడానికా అని?

రామా: అబ్బ! నువ్వెంతగా మారిపోయేవ్ ఎలాటిమాటలు!

కమల: నేను శ్రీమంతురాలిని. మారిపోయేను కదూ! పరిస్థితిబట్టి మాటలుకూడా మారుతాయి.

రామా: (ఆశ్చర్యంగా) నాదేదో తప్పున్నట్టు మాటాడుతున్నావ్ కమలా—ఎందుకో నా కలా అనిపిస్తోంది.

కమల: తప్పా? (జ్ఞాపకం వచ్చినట్టయి తీవ్రంగా) ఔను. మీరు పావుగంటకి ఒక ఇంజక్షనేదో ఇస్తామన్నారు...ఇరవైనిముషాలు దాటి పోయింది...

రామా: (గాబరాగా వాచీచూసుకొని) ఇంకా నాలుగు నిముషాలుంది...

కమల: మీ వాచీ తప్పు! మీరు అశ్రద్ధచేద్దామని చూస్తున్నట్టుంది డాక్టర్!

రామా: (కోపంగా) కమలా! ఇలాటి మాటలు నేను పడను. నా డ్యూటీలో నే నెప్పుడూ అశ్రద్ధ చెయ్యలే దింతవరకూ...ఆ నిందమాత్రం అన్నింటి కన్నా నన్ను బాధపెడుతుంది...

కమల: అశ్రద్ధచేస్తే రేపు నా కెవరూ ఉండరు...దిక్కూ మొక్కూ ఉండరు...అది అనువుగా తీసుకుందామని చూస్తున్నారా? తీసుకొని, మీకు పోయిన కమలని తిరిగి తెచ్చుకుందామని చూస్తున్నట్టుంది...

రామా: కమలా!!! (వణుకుతూ లేచి నిల్చుంటాడు)

కమల: ఎంతసాహసం! ఇది అన్యాయం కాదా డాక్టర్! ఒక ఆడదాని జీవితం పాడుచెయ్యడం!

రామా: హాః! కమలా...చూడు...ఏంచెప్పడానికి నోరురాకుండా ఉంది...ఇంద ఈ వాచీ... (వాచీతీస్తాడు చేతినించి) వెళ్ళి టైమ్‌చూసిరా ఆ వాచీతో...వెళ్లు...ఇందాక గంటలు కొట్టినప్పుడు వాచీ చూసుకోలేదంటావా? ఎంత నిందవేసేవ్ కమలా! నా ఒళ్లు వణికిపోతోంది!

కమల: ఒళ్లు వణికితే ఇంజక్షనివ్వలేరు. మీ కర్తవ్యం?

రామా: (మనసు కుదుట పరుచుకుంటూ) ఇవ్వగలను. ఆ బాధేమీ లేదు. ఎంత మాటన్నావ్ కమలా! నా మనస్సెంత బాధపడుతోంది! నువ్వు పాత కమలవి కావు!

కమల: (చిన్న నవ్వు నవ్వి) ఎలా ఔతాను. మీకేం పిచ్చిపట్టిందా? పాత కమలనైతే బావుణ్ణను కుంటున్నార్లా ఉంది...

రామా: కమలా నువ్వు నన్నెందుకో బాధపెడదామని చూస్తున్నావ్. నాది తప్పు లేకపోయినా, నే నే తప్పూ నీపట్ల చెయ్యలేను...మరింక ఈ రాత్రి ఇలా నువ్వు మాట్లాడకు మీ ఆయనమీద నీకు ప్రేమ ఉంటే...

కమల: అదుగో మళ్లా బెదిరింపా? లేకపోతే ఇక్కడ్నించి పోతా నంటారా?

రామా: పోను. నువ్విలా మాటలతో నన్ను బాధపెడుతూ ఉంటే నా మనస్సు స్థిమితంగావుండదు. ఈ పనికి మనస్సు అడ్డురాకూడదు. దానికేభావం ఉండకూడదు. మరలా పనిచెయ్యాలి...(వాచీ చూసుకొని) టయిమయింది—ఇంజక్షనివ్వాలి...

కమల: ఏం చెయ్యమంటారు?

రామా: ఇప్పుడు నువ్వేం చెయ్యక్కర్లేదు. (బేసిన్‌లోనుంచి సిరంజికేస్ తీస్తాడు. స్టవ్ ఇంకా వెలుగుతూ ఉంటుంది సిరంజ్ తీసి దాన్లో మందు నింపడంలో మునిగిఉంటాడు)

కమల: స్టవ్ ఆర్పివేసేనా?

రామా: ఇప్పటి కార్పేయి మళ్ళా వెలిగించుకోవచ్చు.

[స్టవ్ ఆర్పేస్తుంది కమల. నిశ్శబ్దం—హోరున వర్షం కురిసి వెలిసినట్టుంటుంది.]

నువు రానక్కర్లేదు.

[రామారావు ప్రక్క గదిలో పేషెంటుదగ్గరికి వెళ్తాడు. కమల లైటుకి గాలి కొడుతూ ఉంటుంది—గాలికొట్టి కమల సోఫాలో కూర్చుంటుంది. రామారావు ఇంజక్షన్ ఇచ్చి టేబిల్ దగ్గరికొస్తాడు]

ఆ సీసాలోవి రెండు మాత్రలు మింగించిరా.

[కమల సీసాలో మాత్రలు తీసుకొని గదిలోకి వెళ్తుంది. రామారావువెళ్లి చేతులు కడుక్కొని వచ్చి సోఫాలో కూర్చుంటాడు. కమల తిరిగి వస్తుంది. వచ్చి సోఫా రెండవకొసని కూర్చుంటుంది]

కమల: కాఫీ అలా ఒదిలేసేవ్! తాగు!

[రామారావు వింతగా ఆమెకళ్లలోకి చూస్తాడు]

ఏం? మర్యాదగా చూస్తున్నాడా?

రామా: ఇంతకన్న ఎక్కువ మర్యాద నాకొద్దు.

కమల: కాఫీ చల్లారిపోతోంది—

రామా: నాకు తాగాలని లేదు....

కమల: నేనేదో చెఱగా ఇందాకఅనేశాను... అందుకు కోపం వచ్చిందా?

రామా: ఆశ్చర్యం వేసింది. అదీ ఒక్క నిమిషమే. కోపమా? అది నాకు రాదు...

కమల: డాక్టరయాక కొన్ని నియమాలతోనూ, నిబంధనలతోనూ జీవితాన్ని కట్టేసుకున్నట్టుంది...

రామా: నావృత్తికి సంబంధించినంతమట్టుకు— నిజమే—

కమల: అది తప్పిస్తే నువ్వు స్వతంత్రుడవేనా?

రామా: అలా అని అనుకుంటాను కాని కాదేమో. మనం అంతా అంతే. కొన్నికొన్ని నియమాలు విధించుకుంటాం మన జీవితంలో .... వాటి ప్రకారం నడుస్తూ ఉంటాం—

కమల: కొన్ని ఆశయాలుకూడా ఉంటాయి ప్రతిమనిషికీ—

రామా: ఆశయాలు—ఔను ఉంటాయి.

కమల: నియమాలు మనస్సుమీద ఆధారపడి ఉంటాయి. కాని ఆశయాలు సిద్ధించడం పూర్తిగా ఆవ్యక్తి ఇష్టంమీదా, మనోబలంమీదా ఆధారపడి ఉండదు....

రామా: నేను నిరాశపొందలేదు—నాకు చిన్నప్పట్నుంచీ డాక్టర్ అవాలని ఉండేది ... అదే నాఆశయం—డాక్టర్ని అయేనుకదా?

కమల: మరింకే ఆశయం నీకుండేది కాదని ఖాయమేనా? నువ్వు నిశ్చయంగా చెప్పగలవా?

రామా: చెప్పగలను.

కమల: నువ్వు వట్టి పిరికివాడివి!

రామా: (ఆశ్చర్యంగా) ఏం?!

కమల: నేననుకున్నది నిజమన్నమాట!

రామా: ఏమిటనుకున్నావ్ నువ్వు?

కమల: జరిగిపోయింది మరెందుకు? నీకు మరే ఆశయం లేదన్నందుకు నా కాశ్చర్యం వేస్తోంది. కాలేజి రోజులు జ్ఞాపకం ఉన్నాయా?

రామా: ఉన్నాయి. ఎందుకు లేవు?

కమల: అప్పటి రోజులు!

రామా: జ్ఞాపకం ఉన్నాయి.

కమల: నా కప్పుడు ఒక ఆశయం ఉండేది. ఒకే ఒక ఆశయం. అది నెరవేరందికాదు

రామా: నా కర్థమయింది కమలా. దాన్నే నువ్వు ఆశయం అంటే—

కమల: అది ఆశయం కాదంటావా?

రామా: కాదేమో! అది కోరిక.

కమల: కోరిక! ఆశయానికీ దానికీ ఏమిటి భేదం?

రామా: ఆశయం అంటే, అది సిద్ధించడంవల్ల తనకే కాకుండా కొంత ప్రజకైనా ఏదోవిధంగా లాభంగాని, సహాయంగాని ఉండాలేమో...కోరిక కేవలం స్వార్థం...

కమల: నువ్వు డాక్టర్ అవడం స్వార్థానికి కాదంటావా?

రామా: పూర్తిగా కాదేమో నాకిందులో కొంత తృప్తిఉంది, లేకపోలేదు సాధ్యమైనంతవరకు బీదవాళ్లకి సాయపడాలని నా ఉద్దేశం. నా వృత్తిధర్మాన్ని సవ్యంగా నెరవేరుస్తున్నాను. అది కొంతవరకు స్వార్థరహితమేమో.

కమల: నువ్వందుకు గర్వపడుతున్నట్టుంది

రామా: సవ్యంగా ఒక పనిచేస్తున్నందుకు తృప్తిపడడాన్నే నువ్వు గర్వమంటే సరే...అలానే అనుకో. నువ్వే నీకుండేది ఆశయం అంటే నాకూ మరొక ఆశయం ఉండేది. అది నాకూ నెరవేర లేదు...

కమల: నేను కోరుకున్నది కాలేదు కాని, నేనొక పనిచేసేను. దాని కేమంటావ్?

రామా: ఏమిటి చేసేవ్?

కమల: ఒక క్షయరోగిని పెళ్ళిచేసుకుని ఎనిమిదేళ్ళయి అతనికి పరిచర్యచేసుకొస్తున్నాను.

రామా: అందుకు నువ్వు గర్వపడుతున్నావా?

కమల: లేదు—

రామా: తప్పనాదంటావా?

కమల: తప్పు ఎవరిదైందీ ఇప్పుడు ఆలోచించి లాభమేమిటి?

రామా: డబ్బు చూసి ఒప్పుకున్నావ్ కాని క్షయరోగి అని తెలీదేమో.

కమల: తెలిశాక హతాశురాలనయిపోలేదు.

రామా: మోసం లాంటిదేకదూ అది?

కమల: అప్పుడు నా తెలివేమయింది. అంతటి శ్రీమంతులు నాలాంటి ముష్టిదాన్ని కోరుకున్నారంటే దానికి ఏదో ఒక కారణం ఉండడానికి ఏం అభ్యంతరం ఉంది?

రామా: ఏదో ఒక కారణం ఉంటుందని తెలిసి కూడా నువ్వొప్పుకున్నావ్?

కమల: ఆ పరిస్థితులు అలాంటివి.

రామా: నా మాటమీద నీకు నమ్మకం లేకపోయింది? నాలోనే నీకు నమ్మకం లేకపోయింది. దగ్గరున్నప్పుడే మనసులు...

కమల: నాకు నమ్మకం లేదంటావ్. ఎక్కడో మద్రాసులో చదువుతున్న నీకు ఇక్కడి స్థితి ఏం తెలుసుంది?

రామా: మొదట్లో కొన్ని ఉత్తరాలు రాసేవు. తరవాత ఏమన్నా తెలియనిచ్చేవా?

కమల: నువ్వు తెలుసుకోలేకపోయావ్.

రామా: నేను తెలుసుకోలేకపోయేనా!!

కమల: నీ ఇంటరు పూర్తయి, మనం అనుకున్నప్పుడు నేను నీకు మాచాయగా తెలియజేసేను మా పరిస్థితి.

రామా: ఔను. ప అంతబాగు లేదన్నావ్ - కాని బాగ లేదన్నావ్.

కమల: నువ్వు మెడిసిన్ చదువుదామని చాలా కుతూహలంతో ఉండేవాడివి.

రామా: నాకు మొదట్నించీ అలా ఉండేది.

కమల: నీకు నాకన్నా ముఖ్యం ఆ చదువేమోననిపించింది.

రామా: ఎవరన్నారు? చదువయ్యాక మనమిద్దరం పెళ్ళిచేసుకుందాం అనుకోలేదూ? వీలైతే కొన్నాళ్లు ప్రాక్టీస్ చేశాక, లేదా ఏమీ చెయ్యకుండా నే అనుకున్నాను.

కమల: ఈమధ్యని అవడానికి వీల్లేదా? ఆరేళ్ల వరకు ఉండాలా అని నేనడగలేమా?

రామా: ఔను. అడిగేవ్ —

కమల: ఆరేళ్ళపాటన్నావ్. నీకు చదువుమీద మమకారంకొద్దీ అలా అనిపించింది. మీ పరిస్థితి వేరు. మా పరిస్థితి వేరు. నీకు ఒక్క చదువే ధ్యాస...

రామా: నువ్వు కూడా నూ—

కమల: నేను జ్ఞాపకం ఉంచి ఉండొచ్చు — కాని నాకిక్కడ నీ గురించి ఒక్కటే కాదు ఆలోచించవలసింది. మా ఇంటిస్థితికూడా ... మాస్థితి మరీ పాడయింది — అదే నీకు రాసిన ఉత్తరాలలో సూటిగా కాకపోయినా, తెలియజేసేను. ఆర్థికంగా మాస్థితి ఏమీ బాగుండలేదు. ఈ సంబంధం గురించి మా నాన్నగారు ఒకటి రెండుసార్లు నా చెవిని వేసేరు ... కాని నే నూరుకోవడం చూసి ఆయనా ఊరుకున్నారు. నాకూ తెలుసు. ఇందువల్ల ఆయనస్థితి కొంత బాగుపడవచ్చుని ... నీకు ఒక ఉత్తరంలో రాసేను — నువ్వు సరిగా అర్థం చేసుకోలేదు —

రామా: అర్థం చేసుకోలేనట్టు నువ్వేదీ రాయలేదే?

కమల: ఇంకా ఐదు సంవత్సరాలా ఎలా ఉండడమో ......డా ఉంది మా పరిస్థితికూడా అట్టే బాగులేదు — నీనిశ్చయం మార్చుకోలేవనుకుంటాను అని రాసేను —

రామా: ఔను... కాని...

కమల: నువ్వింకోలాగా అర్థం చేసుకున్నావ్, ఆ ఉత్తరాన్ని — ఆలస్యానికి ఒప్పుకోలేకపోతున్నానేమో అనుకున్నావ్ — ఐదేళ్ళపాటు ఆయినా నిరీక్షించాలని రాసేవ్...

రామా: అప్పుడలా నే అనుకున్నాను —

కమల: అంతకన్న సూటిగా చెప్పడానికి నాకు మనసొప్పకపోయింది, మా పరిస్థితి —

రామా: నాకే నిజమైనస్థితి తెల్సి ఉంటే! తరువాతనుకున్నాను. అంతా అయిపోయేక నీకు నిజమైన స్థితి చెప్పడానికి అభిమానం వేసి ఉండాలని.

కమల: నా ప్రకృతి తెలిసి నువ్వు ఆ ఉత్తరంలోని అర్థం తెలుసుకోలేకపోయేవంటే అది నా తప్పు కాదు. అదికాక, చదువు పూర్తికాకుండా మీ తండ్రి ఒప్పుకోకపోయి ఉండుగు...నీ వరకు ఉండేందుకు మా పరిస్థితి బాగులేదు —

రామా: నావల్ల మీ తండ్రి సాయం పొందడం నీ కిష్టం లేకపోయింది?

కమల: ఎందు కిష్టంలేదు? కాని అది సూటిగా చెప్పడం ఇష్టంలేకపోయింది. నువ్వు తెలుసుకోలేకపోవడం నీది తప్పు. తెలిసినా మీ తండ్రిముందు ధైర్యంలేక ఊరుకున్నావేమో. నువ్వు పిరికివాడివి!

రామా: నిన్ను జాగవిడుచుకోవడమే నా ఇష్టమైతే మరి నేనెందుకు పెళ్ళిచేసుకోలేదంటావ్?

కమల: అప్పటి పిరికితనానికి పర్యవసానం పశ్చాత్తాపం. ఇలా ఆఖరివరకూ ఉండిపోవాలన్నా

ఉండిపోగలవ్ నువ్వు. నువ్వు ప్రేమించేది మరొకతె ఉంది.

రామా: (ఉలిక్కిపడి) నేను ప్రేమించేదా?

కమల: ఔను. నీ వ్వ ... ఏళ్ళోటున్నా అది తీర్చేస్తుంది.

రామా: తిరిగి వచ్చాక నే నెంత బాధపడ్డానో నువ్వూహించుకొనే ఉంటావ్.

కమల: ఎలా ఊహించుకుంటాను? నీ జవాబు చూసి నే నెంత బాధపడ్డానో నువ్వు ఊహించుకోగలిగేనా? నేను నీకు ద్రోహం చేసేనని నువ్వనుకొని ఉంటావ్. నువ్వు తప్పు చేసేవని నే ననుకున్నాను. నీమీద నువ్వు, నామీద నేను జాలిపడటం తప్ప ఒకరి సితి ఒకరు ఆలోచించి ఉండం.

రామా: నువ్వన్నది నిజమే. కాని ఏడాది వరకూ తట్టుకోలేకపోయేను. పిచ్చెత్తినట్టుగా ఉండేది... నాకు చదువునుంచి తిరిగివచ్చేక తెలిసింది.

కమల: ఏడాద పాక తట్టుకున్నారా పోనీ.

రామా: నువ్వు నన్ను తప్పుగా అర్థం చేసుకోకపోతే ఒక సంగతి చెప్తాను. నాకు కొంచమన్నా మనశ్శాంతి దొరికిన విధానం—

కమల: నిన్ను తప్పుగా అనుకోడానికి నీమీద నాకేం అధికారం ఉంది?

రామా: నువ్వలా అంటే...

కమల: సరే చెప్పు.

రామా: నాకొక చెల్లెలు దొరికింది—

కమల: చెల్లెలా?

రామా: ఔను. నా స్నేహితుడి భార్య.

కమల: ఊఁ (చిరునవ్వుతో) ఏమీ అనుమానా లుండకుండా మొదటే జాగ్రత్త తీసుకున్నావ్.

రామా: అతనూ డాక్టరే. మొదటిసారిగా వాళ్ల ఇంటికి వెళ్ళినప్పుడు ఉలిక్కిపడ్డాను ఆవిణ్ణి చూసి— అచ్చు నీలానే ఉంటా రావిడ.

కమల: ఆవిడలో రోజూ నన్ను చూసేవాడివి —అంతే:

రామా: (ఆశ్చర్యంగా) ఆ దృష్టితో కాదు. ఆవిడ చాలా దయగా మాట్లాడుతుంది. నలుగురు పిల్లలు ముచ్చటవేస్తూ—భర్త అంటే ప్రాణం ఆవిడకి—వాళ్ళ సంసారం చూస్తూ ఉంటే నా కెంతో సంతృప్తిగా ఉంటూ ఉంటుంది. ప్రతి ఆదివారం వాళ్ళ ఇంట్లో ఒక సాయంత్రమల్లా గడుపుతూ ఉంటాను ఆ పిల్లల్తో ఆడుకుంటూ, ఆవిడ మాటలు వింటూ—

కమల: (ముఖం తిప్పుకొని) నీకు మరి జీవితంలో లోటంటూ ఉండదు.

రామా: (వింతగా) ఏం కమలా? అలా అన్నావ్.

కమల: (సర్దుకొని) ఏమీ లేదు. అన్నాను.

రామా: చెప్పాలి!

కమల: (క్షణం ఊరుకుని) వాళ్ల సంసారం చూస్తూ, నీ ఊహలో, అనుకున్నట్టే అయిఉంటే సంసారం అలానే ఉండునని ఊహించుకుని తృప్తిపడుతున్నావ్. ఏ బాధా, బరువూ, బెడదా లేకుండా నీకొ తృప్తి దొరుకుతోంది—ఇంక నువ్వు లెక్క చేసేది నీవృత్తి—అది నిరాటంకంగా సాగిపోతోంది. అంతకన్న మనిషి కోరుకోదగ్గ దేముంది?

రామా: (ఆలోచిస్తూ) నువ్వన్నదీ ఒకవేళ నిజమే నేమో అంతకన్న చెయ్యగలిగే దేముంది—ఎలానో ఓలా మనస్సుని సమాధానపరచుకొని బాధ తగ్గించుకోవాలికదా—

[పైన పాదాలసడి—కమల లేచి నిల్చుంటుంది. పార్వతీశం గారు ప్రవేశిస్తా రాత్రంగా—రామారావు లేస్తాడు)

పార్వతీశం: (డాక్టర్ దగ్గరికివచ్చి) ఎలాఉంది?

రామా: ఇరవై నిమిషాలకింద ఇంజక్షన్ ఇచ్చేను— పన్నెండుగంటలకి తిరుగుముఖం పట్టొచ్చు—

పార్వతీశం: ధైర్యంగాఉండా?

రామా: ఇప్పటికి—

పార్వతీశం: (తనలో తను మెల్లగా) పరమేశ్వరా! కాపాడుతండ్రీ! (అతనికళ్లు చెమ్మగిలుతాయి)

రామా: మీరు ధైర్యంగా ఉండండి చాలు— పదకొండు కింకొకఇజక్షన్ ఇస్తాను—

పార్వతీశం: మీ మేలు మరిచిపోను—(కమలని చూసి) అమ్మా! నువ్వు ధైర్యంగా పనిచెయ్యాలి నేనూ భయపడి, నువ్వూ భయపడితే లాభం లేదు— అంతా మీ ఇద్దరిచేతిలోనూ పెట్టేను — నేను మరి ఉండలేనిక్కడ—

[కళ్లనీరు కారుస్తూ పోతాడు]

రామా: పాపం—ఒక్కడే ఒక్క కొడుకు—నిజంగా బాధే!

కమల: (సోఫాలో కూర్చొని) పనిచెయ్యాలి .. భయపడితే లాభం లేదు—

రామా: నిజమే అది—

కమల: నేను కాపురానికొచ్చినప్పుడు చెప్పిన మాటలవి, ఆ క్షయరోగిని నాకప్పచెల్తూ—

రామా: క్షయరోగి అని ఎందుకంటావ్ కమలా?

కమల: (రామారావు కళ్లలోకిచూసి) మరింకేమని పిలవమంటావ్.

రామా: (ఆశ్చర్యంగా ఆమెవైపు చూస్తాడు)

కమల: నేనతని డాక్టర్‌ని, నర్సుని, పనిమనిషిని—

రామా: కమలా!

కమల: ఔను రామం! నేనతని సంరక్షకురాలిని. అతను నారోగి—ఈ ఎనిమిదేళ్లయి.

రామా: నిజంగానా?

కమల: అంతకుమించి మా ఇద్దరిమధ్యా ఏ బంధుత్వం లేదు. అతని సంరక్షణ, అతని జాగ్రత్త, అదే నాపని—అతని ఉనికికి నేనొక ఆశ్రయాన్ని—ఒక ఊతని!

రామా: నిన్నాయన ప్రేమగా చూడరా?

కమల: ఎందుకు చూడరు? నేనొక్కగడియ లేకపోతే ఆయనకి గడిచేదెలా? ఆయన్ని చూసేవారెవరు? ఆయనొక అసహాయుడు. చాలా దయగా మాట్లాడతారు. ప్రాణంగా చూస్తారు. అంతకన్న ఏంచెయ్యగలరు? నేనాయనకొక స్నేహితురాల్ని, ఆయన ఆరోగ్యాన్ని జాగ్రత్తచేసే కోశాగారాన్ని, ఆయన అలవాటు అదుపులో పెట్టే కమేండర్‌ని, పడుకోబెట్టి జోకొట్టే తల్లిని...

రామా: కాని కమలా. ఈ ఎనిమిదేళ్లూ ఇలానే గడిచాయా!!!

[గడియారం తొమ్మిదిగంటలు కొడుతుంది ప్రక్కగదినుంచి. రామారావు చేతివాచీ చూసుకుంటాడు]

కమల: ఔను. కాని నేను విచారించలేదు.

రామా: (ఆశ్చర్యపోతాడు)

కమల: నేననుకున్నది కానప్పుడు—ఇంకే దయినేమిట్టుకు నేనెందుకు పట్టించుకోవాలి? ఈ ఎనిమిదేళ్లు అతనికి సరైన ఆహారం, టైమ్‌కి మందులు, అతని బట్టలు, అతని విశ్రాంతి వీటన్నింటినీ చూడడం అలవాటయిపోయింది. అవునన్నట్టు నీ హాస్పిటల్ పెద్దదికదూ?

రామా: పెద్దదే. ఒక మోస్తరుగా—సేనిటోరియమ్ కట్టద్దామని ఉంది అది ఇంతవేగం కాదు.

కమల: నీ హాస్పిటల్‌కి నర్సెక్కడ్లేరూ?

రామా: ఏం?

కమల: నాకా అవసరం పడ్డప్పుడు, నీకు కావల్సివచ్చినప్పుడు నేనున్నానని మరిచిపోకు.

రామా: ఏం మాటలు కమలా అవి. నీకేం? శ్రీమంతుల ఇంటి కోడలివి!

కమల: ఆ మాట లని ఇందాక నన్ను పిచ్చెత్తించేవ్.

రామా: ఉన్న మాట కమలా.

కమల: అయితే ఉన్న మాటలు చాలా ఉన్నాయి క్రిస్టియన్ 'నన్'లలా అన్ని సంతోషాలూ, ఐహిక వాంఛలూ వెనక్కి పెట్టి, ఒకరి సేవ చేస్తూ, అందులో తృప్తిపొందుదామని పొందలేక పోవడం ఉన్నమాట కాదంటావా?

రామా: (విస్తుపోయి) మీ తండ్రికోసమని, నన్నింకోలా అర్థంచేసుకొని ఒక పెద్ద త్యాగం చేశావా కమలా?

కమల: ఆసంగతి మరిందెప్పుడు.

[తెర]

## రంగం: 3

అదే స్థలం—సమయం, ఒంటిగంటకు ముందు, స్నానం తరవాత పార్వతీశం గారు వస్తారు. రామారావు, కమల లేచి నిలబడతారు.

పార్వతీశం: (మొదటిసారిలా నే డాక్టర్‌కి దగ్గరగా వచ్చి ఆత్రంగా) ఎలా ఉంది?

రామారావు: పదకొండుకి ఇంజక్షన్ మళ్ళా ఇచ్చేను రోగం తిరుగుముఖం పట్టింది. భయం లేదని చెప్పగలను—

శం: నిజంగా డాక్టర్!

రామా: నిజంగానే — ఇప్పటికి తిరుగుముఖం పట్టింది — నాకు బాగా ధైర్యంగా ఉంది. మూడు తరవాత మరి నిష్పూచీ.

పార్వతీశం: తెలివి వచ్చిందా?

రామా: వాంతులు అన్నీ కట్టిపోయేయి — ఇందాక తెలివొచ్చి ఒక నిమిషం మాట్లాడే డాయన ...నీరసం! నీరసంవల్ల నిద్రపోతున్నారు...

పార్వతీశం: వాడిమాటలు వినాలనిఉంది... వింటున్నాడు...వాడు! అమ్మా! వింటున్నాడు?

రామా: (కమలవేపు చూశాడు)

కమల: (ఏం చెప్పాలో తోచనట్టు ఆలోచించి) నన్ను దగ్గర కూర్చోమన్నారు — బెంగ పెట్టుకో వద్దన్నారు...

రామా: (ఆమె వేపు వింతగా చూస్తాడు)

పార్వతీశం: ఔను — నువ్వే వాడి ప్రాణాలు... వాణ్ణి నీకప్పగించేను — నువ్వు లేకపోతే ఒక్క క్షణం గడపడు వాడికి —

కమల: (సిగ్గుపడుతూ) మీరలా అనకండి!

పార్వతీశం: నే వెళ్తాను — తెలివొచ్చి మళ్ళా మాట్లాడితే నన్ను పిలవండి — నేను కనిపెట్టుకునే వుంటాను.

కమల: (ఏదో చెప్పబోతుంది)

పార్వతీశం: లాభం లేదమ్మా — నిద్రరాదు... రాదు...

[అతను వెళ్తాడు గడియారం ఒంటిగంట కొడుతుంది. రామారావు వాచీ చూసుకుంటాడు]

రామా: ఏం చెప్తావో అని భయపడ్డాను...

కమల: (సోఫాలో కూర్చుంటూ) నిజం చెప్పి ఉంటే పిచ్చివారిలా అయిపోరూ? పాపం!

రామా: నువ్వు ఆయనమీద జాలిపడుతున్నావ్ — నీమీద ఎవరు జాలిపడుతారు కమలా? కాని నా కొశ్చర్యం వేస్తుంది. అతనికోడల్లా నువ్వు మాట్లాడినట్టనిపించ లేదు — ఎవరో ఒక పైఆవిడ ఆమునలాయనస్థితికి జాలిపడుతున్నట్లుంది...

కమల: హాస్పిటల్ నర్సులు, డాక్టర్లు ఇలానే కదూ ఓదారుస్తారు. నిజాన్ని దాచి ఓదార్పుకి చిన్న చిన్న అబద్ధాలాడతారు? నేనూ ఇక్కడ నర్సులాటిదాన్నే.

రామా: అతని మనస్సు స్థిమితంగా ఉండడానికి నువ్వయితే అబద్ధం ఆడేవు కాని, నేనుమాత్రం నిజమే చెప్పేను.

[సోఫాలో కూర్చుంటాడు]

కమల: (దగ్గరగా వెళ్ళి) రామం! నువ్వన్న ఆశ ఉందంటావా?

రామా: తప్పకుండా కమలా! నేను మొదట నూటికి ఒకపాలు ఆశతో దెబ్బలాడేను, ఇప్పుడు ఏభైపాళ్ల ఆశతో దెబ్బలాడగలను రోగంతో!

కమల: (సోఫాలో కూర్చొని) నిజమా రామం? హాస్పిటల్ డాక్టర్లు ఇచ్చే ధైర్యం కాదూ?

రామా: ఉత్తమాటలు నేనాడను. నా పనిలో నేను నన్ను మోసం చేసుకోను, పైవాళ్లని మోసం చెయ్యను.

కమల: మూడుగంటలతరవాత బాధ లేదన్నావ్?

రామా: రెండుగంటల కొక ఇంజక్షన్ ఇవ్వాలి కదూ. అదయాక మూడుగంటలు దాటితే నూటికి నూరుపాళ్లు ఆశే...మనదే గెలుపు!

కమల: మనది కాదు. నీది!

రామా: నీకుకూడా కొంతభాగం ఉంది. అది కాక నీకిది సర్వస్వం!

కమల: (దగ్గరగా వెళ్లి మెల్లిగా) కాదు రామం!

రామా: (తృళ్లిపడి) కమలా!!

కమల: నే చెప్పేది నిజం. నాకది సర్వస్వం కాదు. గెలుపు కాదు!

రామా: నువ్వతని భార్యవి. నువ్వలా అనొచ్చునా? అతని ఆరోగ్యం కోరుకోవాలి కాని!

కమల: (విరాగిలా నవ్వి) ఓటమి, నిరాశ నాకే కాదు రామం. ఆయనక్కూడా! ఆయనకూడా ఓడిపోతారు!

రామా: ఆయనక్కూడానా?

కమల: ఔను. ఇందాక తెలివొచ్చినప్పుడు ఆయన ఆడినమాటలు, ఆయన చేష్టలు నువ్వు పట్టించుకోలేదుకదూ?

రామా: ఆ తీవ్రతలోనూ, నీరసంలోనూ అలానే అంటారు.

కమల: నీ డాక్టర్ కళ్లతోనే నువ్వు చూస్తావ్!

రామా: ఎలా కమలా?

కమల: నువ్వే అన్నావ్, నీరసంవల్ల, ఆరోగం పెట్టే బాధవల్ల అలా అనిపిస్తుందని. ఇవాళ ఈరోగం వల్ల ఆయన బాధపడుతున్నారు. కాని ఎనిమిదేళ్లయి, నాకు తెలిసినమట్టుకు ఆయన క్షయవల్ల బాధపడుతున్నారు. ఈ నిజం, ఆయనన్న ఈమాటలు, ఈనాటివి కావు. ఆ భావం ఈ ఇంట అడుగుపెట్టినదాదిగా ఆయన ముఖంలో చూస్తున్నాను.

రామా: ఎనిమిదేళ్ళనించీ!

కమల: ఇం[redacted]నిన్ను దగ్గరగా పిలిచి ఏమన్నారు?

రామా: ఔను. బ్రతకాలని లేదన్నారు— మళ్ళా నరకంలోకి తీసుక వెళ్ళొద్దన్నారు. కాని కమలా...ఆ మాటలు...

కమల: విను. ఈ ఎనిమిదేళ్ళయి అతనిలో ఉండేదిదే ఆలోచన— కాని ఆ తరుణం రాలేదు. నాకూ తెలుసు ఆయనలోని భావం. ఈ నరకం, ఈ రోగం చేసే చిత్రవధ ఎప్పుడు ఆఖరౌతుందా అని... పిలుపు ఎప్పుడొస్తుందా అని ఆయన నిరీక్షణ ఆయన రాత్రి పగలు పడే బాధ, ఆ బాధ నాకు తెలీదంటావా రామం...

రామా: కమలా! నువ్వే ఈ మాట లంటున్నావా?

కమల: ఆయన మంచిని కోరేదాన్ని — ఈ విషయంలో నన్నతని భార్యగా చూడు రామం! ఈ ఇంట్లో, ఆ గదిలో ఎనిమిదేళ్ళ జీవితం గడిపే డతను —నా సహాయంతో. ఈ ఎనిమిదేళ్లూ ఆయన ప్రతి నిమిషం కాచుకఉన్నారు ఆత్రంగా, పిలుపు వినేందుకు. శాంతికోసం, సంతోషంకోసం......స్వర్గం నుండి పిలుపుకోసం...

రామా: బ్రతుకంటే ఆయన కిష్టం లేదంటావా?

కమల: ఇది బ్రతుకు కాదతనికి. నరకం— నాతో చాలాసార్లన్నా రా మాట నాతో పంచుకున్నారా బాధ. ఆయనకు మనశ్శాంతి, శాశ్వత సుఖం కోరుకోవద్దంటావా? ఇది భార్య కోరుకోరాదంటారు పెద్ద లందరూ! మన శాస్త్రా లంటాయి నే—కాని నేనేం ఆయన చెడు కోరలేదే!

రామా: అయితే నేనిక్కడికి రావడమే తప్పంటావా?

కమల: తప్పనను—రోగం అన్నాక డాక్టర్ని రప్పించడాన్ని నేనెలా కాదనగలను?

రామా: డాక్టర్ ఎప్పుడొచ్చేడో రోగంతో చేతికి చెయ్యిచ్చి దెబ్బలాడతాడు—అతనికి రోగానికి సంబంధం—మనిషితోనూ, అతని మనస్సుతోనూ కాదు — అతనికి మరింకేం ఆలోచించవల్సినపని లేదు—

కమల: కేవలం మరలాటివాడు—

రామా: ఔనుకమలా!

కమల: నువ్వూ అంతేనా?

రామా: నేను ముఖ్యంగా అంతే.

కమల: ఒక్క సంగతి ఆలోచించు—నీకు నమస్కారంచేసే డతను. నీ మేలు మరిచి పోనన్నారు— తన్నలా వదిలిపెట్టమన్నారు—మళ్లా ఆ నరకంలోకి తీసుక వెళ్ళొద్దన్నారు...

రామా: అతనికలా నే ఉంటుంది కమలా!

కమల: నాకూ నమస్కారం చేసేరు—

రామా: ఔను—

కమల: నన్ను దగ్గరగా పిలిచేరు—నన్ను మరిచిపోలేనన్నారు — "ఆ నరకంలోకి వెళ్లడం నాకిష్టం లేదు — నిన్నుకూడా నాతో బంధించి ఉంచడం నాకిష్టంలేదు — అతన్ని కొంచం దయచూపెట్టమను—" అని నాతో అన్నారు.

రామా: (మౌనం)

కమల: నీకు జాలి ఉందనుకుంటాను రామం— నువ్వు కేవలం డాక్టర్వి, మరవి అయిపోకు రామం. (భుజంమీద చెయ్యివేసి) కొంత దయ చూపెట్టు— బ్రతుకంటే అందరికీ తియ్యగా ఉంటుందనుకున్నావా? బాధపడేవారికి శాంతి నివ్వటమే కదూ నీపని?

రామా: కాదు—రోగాన్ని పోగొట్టడం—

కమల: అయితే ఆయన క్షయ పోగొట్టగలవా? నాకా హాయి ఇవ్వగలవా? ఆయనకి బ్రతుకంటే తియ్యగా ఉంటుందని చూపెట్టగలవా?

రామా: నేనెలా చెప్పగలను? ఆరోగంతో అది ఉన్నన్నాళ్ళు దెబ్బలాడతాను—

కమల: మీ ఇద్దరి ఎడతెగని యుద్ధంలోనూ ఆయన నరకబాధ అనుభవించవల్సిందే. ఎంత దయలేనిపని! రోగం ముదరదు, తగ్గదు, అలా పీడిస్తుంది....

రామా: మరి, ఎనిమిదేళ్లోయి ఆయన అనుభవించలేదా?

కమల: అనుభవించేరు. కాని ఆయన, ఈ మందులకీ వాటికీ లెఖ్ఖచేస్తున్నారనుకున్నావా? వాటిలో ఆయన కేమాత్రం ఆశాలేదు. ఆయన సరిగ్గా మందు తాగరు. రాత్రులు చాలా భాగం మేలుకొనే ఉండేవారు, నేనేవో కబుర్లు చెప్తూఉంటే.

రామా: నువ్వుచూపిన శ్రద్ధ అదేనా?

కమల: నేను అదుపులో పెట్టడంవల్ల ఆ పాటన్నాను. అతను పడేబాధని నేను గుర్తించాక అంతగా నిర్బంధించలేక పోయేదాన్ని.

రామా: నన్నెవిధంగా దయచూపెట్ట మంటావ్?

కమల: (మరీ గొంతుతగ్గించి) కొంచం శ్రద్ధ.

రామా: (ఉలిక్కిపడిలేచి) శ్రద్ధ!!

కమల: కూర్చో! అలా బెదిరిపోకు.

రామా: శ్రద్ధ!!

కమల: (అతని చెయ్యిపట్టుక కూర్చోపెట్టి) ఔను. అదే అతనికి చూపెట్టగలదయ. ఈ ఒక్క సారికీ నువ్వు మనిషిగా ప్రవర్తించు రామం

రామా: శ్రద్ధ! అది నేను చెయ్యలేను కమలా ...నన్ను పిలవడం మానీవల్సింది. కాని పిల్చాక ఇటువంటి పని ప్రాణంపోయినా నావల్ల కాదు అది అతనికి ఇష్టమే కావచ్చు. కాని లాభం లేదు. ఆమాట ఎత్తకు.

కమల: ఇంకోవిధాన ఆలోచించేవా? అతని ప్రార్థన వదిలెయ్ నా ప్రార్థన విను. నాకు నువ్వు అన్యాయం చేసేవ్.

రామా: నేనా! అన్యాయం చేసేనా!

కమల: ఏ సుఖమూ లేకుండా, ఈ ఎనిమిదేళ్లయి అతని బాధని పంచుకున్నది నీవల్లనే.

రామా: కమలా! దీనికంతా నేను కారణం అంటావా?

కమల: కాదంటావా?

రామా: నువ్వు నాకు సరైన స్థితి అప్పుడు చెప్ప లేదు. మీ స్థితి అంత హీనంగా ఉందని తెలుస్తే, నిన్ను నేను వదులుకొనే వాడినా?

కమల: లేదు. నిన్ను నువ్వు మోసం చేసుకు న్నావ్. అంతకన్నా విపులంగా నన్నేం రాయ మంటావ్? అభిమానం ఉన్న ఏ ఆడదన్నా ఇంకేం రాయగలదు? తిండికి లేదు, పస్తులుంటున్నాం, అందుకు ఒక పెళ్ళైన్న సంబంధానికి నేనొప్పుకు న్నాను అని రాయమంటావా? నేను నీకు రాసింది అర్థమయింది కాని నువ్వు నమ్మకపోడానికి యత్నిం చేసేవ్ —అయిదేళ్లూ అయిదు నిమిషాల్లా గడిచిపోవా అనుకున్నావ్. అయిదు నిమిషాలపాటు సమయం ఏ స్థితిలో వున్నా మనుష్యులు గడిపేయలేరా అని అను కున్నావ్. నువ్వు తిరిగి వచ్చేవరకు, నువ్వన్నీ ఎలా వదిలి వెళ్లేవో అన్నీ అలానే ఉండాలి, ఉంటాయి అని నమ్మడానికి ప్రయత్నించేవ్. ఏం? కాదం టావా?

రామా: (బాధగా) కమలా నాదే తప్పంటావా?

కమల: అవును. నీదే తప్పు—

రామా: (ఆలోచిస్తూ) అయితే లాభం—

కమల: అయితే విను — నేనిన్ని సంవత్సరాలు అతనితోకూడా అనుభవించిన బాధ — అసంతృప్తి బంధం — మరొక్క నిమిషంకూడా అనుభవించ లేను—అతనూ అంతే — బ్రతుకంటే అతనికి నరక బాధ — నీకు అతనిమీద మమకారం లేకపోయినా, నా సంగతి ఆలోచించు — నేనంటే నీకు అభిమానం లేదా?

రామా: ఒక్క అభిమానమేనా కమలా? నువ్వెప్పుడూ నా మనస్సులో ఉంటావ్.

కమల: నేను సంతోషంగా ఉండాలని నీకుందా?

రామా: ఎందుకు లేదు?

కమల: అందుకోసం నువ్వేసాయ మన్నా చెయ్యగలవా?

రామా: నువ్వనబోయేది నాకు తెలుసు. ఈ పని మాత్రం నేను చెయ్యను. శ్రద్ధ చెయ్యలేను

కమల: మనఇద్దరి సంగతీ అతనికి తెలుసు రామం.

రామా: ఆఁ!

కమల: నిజంగానే. ఇప్పుడు కాదు. ముందు నుంచీ తెలుసు; కాని, నన్నాయన కోరిందిఒక్కటే— "నాకూ సుఖం కావాలి కమలా — నాసుఖం ఇక్కడ లేదు — ఆలోకంలో — నీకూ సుఖం కావాలి — నీసుఖం ఈలోకంలో — నిన్నెట్టే కాలం బందీలో ఉంచను—ఆరోజుకోసం చూస్తున్నాను — అంత కాలం నన్నొదలకు" అనేవారు.

రామా: అయితే అతనుండకపోవడం నీ కోరిక అనుకోవాలా?

కమల: అతని కోరిక—అతని తపస్సంతా అందుకే.

రామా: కాని కమలా ఇది సాధ్యం కాదు— ఇది నా చేతి కాదు.

కమల: ఈ వృత్తి నువ్వు మానెయ్యి—ఇల్లు, భార్య, పిల్లలు, సుఖం—దానిమీద నీకు కోరిక లేదా?

రామా: కావాలి—కాని అదెలా?

కమల: నీకది కలగానే ఉండిపోయింది. నే నుంటే నీకది సాధ్యం అవుతుంది.

రామా: కాని ఎలా సాధ్యం.

కమల: అతనిపట్ల దయ చూపెట్టు - సాధ్యం అవుతుంది - అతనికి సాయంచెయ్యి - అతను నన్ను బంధవిముక్తగా చేస్తారు - అతనికి అనంత సుఖానికి దారిచెయ్యి - అతను నీకు నన్ను సంతోషంగా అప్ప గిస్తారు - మన ఇద్దరిసుఖం కోరతారు—

రామా: ఇది కల...కల...అంతే!

కమల: కలకాదు - నిజం! నీమీద ఆధారపడి ఉంది. మన విషయంలో ఒకసారి పొరపాటు పడ్డావ్ —ఇప్పుడు కూడా పడతావా?

రామా: ఇదివరకు తెలీకుండా పొరపాటు పడ్డాను—ఇప్పుడు తెలిసి పొరపాటు చేస్తాను కమలా! చెయ్యాలి; అది నా వృత్తిధర్మం; (బాధగా) నన్నెందుకు పిల్చేరు. (చేతులు జుత్తులోనికి పోనిచ్చి జుత్తు పీక్కుంటూ) నన్ను పిల్చేక, నే శ్రద్ధ చెయ్యాను, చెయ్యలేను; అది నాకు సాధ్యంకాదు, అంతే సాధ్యంకాదు...

కమల: బండరాయి! ఉత్త పాషాణం — రాయివి నువ్వు!—

[కళ్లు కప్పుకొని గదిని వదుల్తుంది.]

రామా: కమలా! (లేచి ద్వారంవరకూ వెళ్ళి తిరిగి వస్తాడు—గది నాలుగుమూలలా వెర్రివాడిలా కొంతసేపు చూస్తూ నిల్చుంటాడు. తరువాత టేబిలు దగ్గరికి వెళ్ళి ఇంజక్షన్‌కి కావల్సిన సరంజామా తయారు చెయ్యడంలో మునిగిపోతాడు. కొన్ని నిమిషాలు అలా గడుస్తాయి; పనివల్ల కలిగే చప్పుడు తప్పించి అంతా నిశ్శబ్దం; కమల తిరిగి చప్పుడు లేకుండా వచ్చి అతనికి అంతరాయం కలిగించకుండా సోఫాల్లో కూర్చుంటుంది, ఒక మూల, ఆలోచిస్తూ; అతని పని పూర్తయాక సోఫా వేపు తిరిగి కమలని చూస్తాడు)

రామా: కమలా! (వెళ్లి ఆమె దగ్గరగా సోఫాలో కూర్చుంటాడు.)

కమల: ఆవేశం పట్టలేక వెళ్లిపోయేను— క్షమించు.

రామా: నువ్విలా బాధపడడం నాకు చాలా కష్టంగా ఉంది. నన్ను పిలిచిఉండకపోతే ఎంత బాగుండును.

కమల: సరే, నీ ప్రయత్నం నువ్వు చెయ్యి. అదృష్టాన్ని బట్టి తక్కినది నడుస్తుంది.

రామా: ఆఖరికి అదృష్టంమీదే బరువుపడేసేవా?

కమల: కనీసం అదన్నా దయ చూపెట్ట వచ్చేమో.

రామా: నువ్వు నాకు కావాలి కమలా; అతని ఇష్టం కూడా ఉందంటే నా మనస్సు, ఆశ్చర్యం తోనూ, సంతోషంతోనూ నిండింది. నా బ్రతుకులో నువ్వు లేకపోవడమే లోటు. కాని—ఆ సంతోషం తెచ్చుకొనే శక్తి నాలో లేదు—అస్థిపంజరంతో ముడి వేసేసుకున్నాను. మానవ యంత్రం, దాని రోగాలు —అదే నా సంబంధం. మనస్సుకీ నాకూ సంబంధం లేదు కమలా—(ఆగుకుని) నేనింక ఈ వృత్తి మానేస్తాను. ఇదే నా ఆఖరి కేసు మనస్సుతో ఈ దెబ్బ లాట నా శక్తినంతా లాగేసింది—

కమల: నీలాంటి డాక్టర్‌ని నేను చూడలేదు— ఆనాడు నువ్వే ఊళ్లో ఉండిఉంటే మా నాన్నగారు బ్రతికిఉండేవారు—

రామా: (ఉలిక్కిపడి) ఔను— విశ్వనాథం గారు; ఆయన హాస్పిటల్‌లో పోయేరు— నే నూళ్లో లేనని నీకెలా తెలుసు?

కమల: నేను కనుక్కున్నాను - నాగురించి నీకు తెలీదు కాని. నీ భోగట్టా అంతా నేను తెలుసు కుంటూనే ఉన్నాను—

రామా: నువ్వప్పుడెక్కడికి వొచ్చేవా?

కమల: ఒక్క గంట—మా నాన్నగారు పోయేక—అదంతా రాత్రిరాత్రి అయిపోయింది. నాకు తెలీనే తెలీదు—ఏ సంగతీ కబురు తెలిసేందుకు సమయం లేకుండా అయిపోయింది—

రామా: కాని ఏవో పుకార్లు-అశ్రద్ధ జరిగిందని.

కమల: (ఉలిక్కిపడి) నేనూ అంతా విన్నాను- రోగం తిరుగుముఖం పట్టేక డాక్టర్ ఇంకొక కేసు చూసేందుకు వెళ్లేరని. అక్కణ్ణుంచి తిరిగి వచ్చేసరికి ఆయన ఆఖరు గడియల్లో వున్నారని.

రామా: అది నేను నమ్మను కమలా—అ పుకార్లు—

కమల: ఏమో నాకు సరిగ్గా తెలీదు—కాని నువ్వే ఉండిఉంటే!

రామా: నేనుమాత్రం చేస్తున్నది నా ప్రయత్నమే కాని మరేమీ కాదుగా?

కమల: కాని నీ ఇప్పటి పట్టుదల చూస్తే అలా అనిపిస్తోంది.

రామా: ఈ కేసులో నాకు ప్రతిజ్ఞగా ఉన్న ఆశ, భయం రెండూ అడ్డొస్తూనే ఉన్నాయి, నన్ను లొంగదీసేందుకు.

కమల: ప్రతిజ్ఞ ఏమిటి నా?

రామా: వెంకటప్రసాదశర్మ తెలుసునా? సర్దార్

కమల: ఔను నా పినమామగారు

రామా: ఇవాళ అతను నాదగ్గరికొచ్చేరు.

కమల: నీదగ్గరికా? నీదగ్గరికెందుకు?

రామా: పదివేలివ్వడానికి తయారుగా—

కమల: పదివేలు! నాకేం అర్థం కావటంలేదు.

రామా: నేనిక్కడికి గావల్సివస్తుందని అతనికి తెలుసు—కొంచెం అశ్రద్ధచేస్తే పదివేలిస్తానన్నాడు—

కమల: (ఆశ్చర్యపోయి) అశ్రద్ధ—ఔను! నా కర్థమయింది—మరి చెప్పనక్కర్లేదు—

రామా: తొంభైపాళ్ళు అతనికి ధైర్యం ఉందన్నాను—ఉన్న పదిపాళ్ళూ నన్ను పూర్తి చెయ్యమన్నాను

కమల: నాకు తెలుసు ఆ ఉద్దేశం—అదంతా డబ్బుగురించి ప్రాకులాట—దానికీ నాకూ సంబంధం లేదు—అతని సంగతి నుగెత్తకు?

రామా: నేను కాదన్నానని నీకు చెప్పక్కర్లేదు.

కమల: తెలుస్తూనే ఉంది. కాని నీ దెలాటి మనస్సు!

రామా: నామనస్సుని పొగడకు; మామూలుగా డబ్బుమీద ఆశ నాకు లేకపోలేదు; అది ఇటువంటి విధాల ఆర్జించటం నా కిష్టంలేదు.

కమల: భయం అన్నావ్ దేనికి?

రామా: నేను భయపడలేదు; అతను భయపెడదామనుకున్నాడు; బెదిరించేడు.

కమల: నిజంగా?

రామా: నేను నెగ్గితే ఇంటికి తిరిగి వెళ్ళలేనన్నాడు; అవన్నీ ఉత్తిమాటలు.

కమల: ఎంతపనిచేసేవ్ రామం!

రామా: ఏం?

కమల: అతనిసంగతి నీకు తెలీదు అన్నంత పనీ చేస్తాడు. నాకు నిశ్చయంగా తెలుసు—(ఆమెముఖం భయంతో నిండుతుంది.)

రామా: అతని ధైర్యం నాకు తెలుసు. నువ్వేమీ అనుకోకపోతే ఒకమాట చెప్తాను—

కమల: ఏమిటి?

రామా: అతని దేపాటి ధైర్యమో! పోలీసు కేసు, శిక్ష, వీటి భయంలేనివాడు, తనలో తనకి అంత నమ్మకం ఉన్నవాడు, పదిమంది కాపలా ఉన్నా హాని తప్పదన్నవాడు, ఇన్నేళ్ళయి ధైర్యం ఉండే ఊరుకున్నాడా? ఇంత నిపుణుడు, ధైర్యవంతుడు ఆనాడే మీ ఆయనకి, తలుచుకుంటే హాని చెయ్యలేకపోయేవాడా? నావరకూ రావటం ఎందుకు? ఏ కష్టం, చట్టాల భయం, లేకుండా తన పని అయిపోతుందని—ఉత్త పిరికిపంద—ఒక చీమకి కూడా హాని చెయ్యడానికి భయపడే పిరికి జంతువు

కమల: (వింతగా అతని ముఖంలోకి చూస్తుంది).

రామా: నాకే భయమూ లేదు—అతని ధైర్యం నాకు తెలుసు

కమల: అయితే రెండోది నేను—ఆశ, భయం.

రామా: ఔను—నువ్వు—

కమల: అయితే నేనూ ఆ రౌడీ ఒకటే కదూ?

రామా: కాదు కమలా! నిన్ను చూడటంతో నాకు ఆశ కలిగింది—అన్నిసంగతులూ నువ్వు చెప్పాక అది బలపడింది—కాని దానిని కాదనాల్సొచ్చింది.

కమల: నేనేం బెదిరించేను?

రామా: ఇక్కడ బెదిరింపు ప్రశ్న లేదు; కాని నేను భయపడుతున్నాను—నువ్వు పొందే అశాంతి, బాధ చూస్తే, దాన్నిగురించి ఆలోచిస్తే బాధ, భయం రెండూనూ నాకు—కాని నేనది అనుభవించాల్సిందే—అందుకే నేనింక ఈ వృత్తినించి విరమించుకుంటాను ఇది అయిపోయేక—

కమల: అంటే, ఇక్కడ విజయంసాధించేక—

రామా: ఈ గెలుపు నా మనస్సుది కాదు; నా మనస్సు ఓడిపోయింది—ఈ గెలుపు నాలోని డాక్టర్ది. ఈ రెండింటికీ మధ్యన ఘర్షణ ఇంతగా నేనెప్పుడూ అనుభవించలేదు — మరింక నాకు శక్తి లేదు—అందుకే...

[ప్రక్క గదిలోనుంచి పేషెంటు మూల్గు—రామారావు ఉలిక్కిపడి వాచీ చూసుకుంటాడు. దెబ్బ తిన్నట్టయి లేచి]

రెండున్నర! మైగాడ్!!! కమలా!!

కమల: (ఆశ్చర్యంగా) ఏమిటయింది రామం!

రామా: నా వాచీ రెండున్నర అయింది! రెండుకి ఇంజక్షన్ ఇవ్వాలి! ఏమిటిది! ఎలాఅయింది!

కమల: ఇంకా రెండు కొట్టలేదు ప్రక్క గదిలో గడియారం.

రామా: అది గంటలు కొడుతుందని కాచుకొని ఉన్నాను నావాచీ తప్పులేదు రెండూ సరిపోయేవి ప్రతి గంటా, నిమిషం సరిగ్గా!!

కమల: ఉండు రామం చూసివస్తాను.

[గది వదిలి వెళ్ళబోతుంది]

రామా: గడియారం ఆగిపోయింది...అదే అయి ఉండాలి! కీ సరిగ్గా ఇప్పుడే అయిపోవాలా?...... ఇంకా ఎందుకు గంటలు కొట్టలేదా అని ఆశ్చర్యం వేసింది...(తొందరగా) అయినా ఇప్పుడేం బాధ లేదు నువ్వు వెళ్ళబోకు.

[టేబిల్ దగ్గరికి వెళ్ళి ఇంజక్షన్ సరంజామా పట్టుకుంటాడు]

కమల: అరగంట ఆలశ్యం అయింది!

రామా: (గాబరాగా) ఔను - అయింది! అయినా బాధ లేదు - ఏమీ బాధ లేదు అరగంట ఏమంత ఆలస్యం కాదు. నేనంతా చూసుకుంటాను— అన్నివిధాల ప్రయత్నిస్తాను—ఈపాటి ఆలశ్యం... (గదిలోకి వెళ్తూ) లెక్కలోది కాదు.

((ప్రక్కగదిలోనుంచి) రా కమలా... వేగం—

(కమల కొన్ని సెకండ్లు కొయ్యలా నిల్చుం టుంది—ఆమె ముఖం వివర్ణమౌతుంది)

రా కమలా!!

(కమలకూడా ప్రక్కగదిలోకి వెళ్తుంది)

[తెర]

## రంగం: 4

ఒక చిన్నగది. ఒకమూల చిన్న టేబిలు, కుర్చీ; టేబిలుమీద ఒక దీపం; గది గోడకి పెద్ద గడియారం; అది ఆగి పోయింది—రెండుకి ఐదునిమిషాలు తక్కు వగా టైము సూచిస్తోంది. కుర్చీలో రామా రావు కూర్చున్నాడు, తల చేతులలో పట్టు కుని—పార్వతీశం ప్రవేశం—అతని ముఖం వాడి, కళ్లు ఎర్రగా ఉన్నాయి.

పార్వతీశం: (డాకర్ దగ్గరికి వచ్చి, భుజంమీద చెయ్యి వేసి చిన్న గొంతుతో) డాక్టర్!

(రామారావు ఉలిక్కిపడి లేవబోతాడు) లేవ కండి! కూర్చోండి.

(రామారావు కూర్చుంటాడు—ఇద్దరూ కొన్ని నిమిషాలు మౌనం)

మీరు చెయ్యవల్సిందంతా చేసేరు. (దుఃఖంతో ఊరుకుంటాడు)

రామా: నాకు పూర్తి ధైర్యం ఉండేది—మీ రొచ్చినప్పుడు తిరుగుముఖం పట్టింది—కాని మళ్ళా తిరగ వేసింది—రెండుగంటలకి ఇంజక్షన్ ఇవ్వడం కొంచెం ఆలస్యమయింది. గడియారం ఆగిపోయింది.

పార్వ: ఔను—విన్నాను .కమల చెప్పింది. కాని ఆపాటి ఆలశ్యానికి

రామా: ఆ ఆలశ్యం అంతగా లెఖ్ఖలోకి తీసుకో వల్సింది కాదు. ఈ రోగంతో చెప్పలేం—అందుకే మూడు గంటల తరవాత పూర్తిగా ధైర్యం ఉండో చ్చన్నాను

పార్వ: ఇంతకీ వాడికి బ్రతకాల్సిన యోగ్యత లేదు.

రామా: ఆయన అసలే నీరసం మనిషని విన్నాను

పార్వ: కారణం కూడా వినేఉంటారు.

రామా: విన్నాను. ఆ జబ్బుండడం నా ప్రయ త్నాన్ని కొంత అసాధ్యంచేసింది.

పార్వ: ఒక సంగతి చెప్పడాని కొచ్చేను డాక్టర్! మీమీద నా కొక దురభిప్రాయం ఉండేది; మీ తండ్రిమీద నాకుండే ద్వేషంవల్ల నేమో. కాని ఇప్పుడు పూర్వం అలాటి అభిప్రాయం నా కున్నం దుకు సిగ్గుపడుతున్నాను.

రామా: (ఆలోచిస్తూ ఉంటాడు)

పార్వ: నాకివాళ ఒక నిజం తెల్సింది. నా భార్య పోవడానికి ఎవరూ బాధ్యులు కారు—నా కొడుకుని మీరింత ప్రయత్నంచేసినా బ్రతికించగలి గేరా? ఆ పిలుపొచ్చినప్పుడు మనం ఆపలేం. మనలో ఏమీ లేదు.

రామా: అలానే మీరు ఆత్మశాంతి పొందాలి. కాని, మీరు ఆనాడు మీ భార్య పోయేందుకు నింద మా తండ్రిమీదే వేసేరు. అప్పుడు మా కెవరన్నా, మీ రిప్పుడన్న ఈ నిజం చెప్పివుంటే మీరు నమ్మి ఉండరు. కాని ఇవాళ, మీకు గురివున్న నేను ఎంత ప్రయత్నించినా మీ కొడుకు బ్రతకలేకపోయేడు; ఇవాళ మీరు ఆ వేదాంతంలో నమ్మకం కుదుర్చు కుంటున్నారు మనస్సు, మాన్పులకి ఎంత సులభంగా లొంగిపోతుంది. దేనిలోనన్నా ఎంత వేగం మరో ఆలోచన లేకుండా నమ్మకం కుదుర్చుకుంటుంది!

పార్వ: ఆత్మశాంతి ఏదోవిధంగా పొందాలి; అప్పుడు ఆ చిన్న అనుమానంలో పొందేను. ఇప్పుడు ఏ అనుమానం లేదు చచ్చిపోయేక ఎక్కడికి వెళ్తామో తెలుసుకోలేం. కాని చావుకి ఏదో ఒక కారణంఅంటకడతాం; అప్పుడు మనశ్శాంతి; రోగం కారణమే; కాని, అది మన ఏ శక్తిలోపంవల్ల పోలేదో కనుక్కుంటేనే కాని శాంతి ఉండదు; అందుకే అప్పుడు మీ తండ్రి మీద నింద వేసేను; ఇప్పుడు భగవంతుడిమీద నింద వేస్తున్నాను; దాని ఫలితం ఈ వేదాంతం; ఆత్మశాంతికి ఏదో ఒక మార్గం—

రామా: (మౌనం)

పార్వ: ఇప్పుడు నాకు అన్నింటిమీదా అదోక విరక్తిభావం కలుగుతోంది—

రామా: విచారంలో మీకలా అనిపిస్తుంది—

పార్వ: (నిట్టూర్చి) నేను స్వార్థపరుణ్ణి—

రామా: మనం అంతా అంతే—

పార్వ: నే నందులో హద్దులు దాటేను— నా కలా అనిపిస్తున్న దీ నిమిషం. నా కొడుకు నాతో అనేవాడు—నాన్నా! ఆరోజు...ఆ మంచి రోజు ఎప్పుడు వస్తుందో—ఆ లోకానికి పోయే ఘడియ ఎప్పుడొస్తుందో, అని— నేను వాడిని మందలించేవాణ్ణి—వాడి జీవితానికి ఏ హానీ రాకుండా, సూటిగా చెప్పాలంటే, వాడి జీవితం పొడిగించడానికి అన్ని జాగ్రతలూ తీసుకున్నాను— కాని, వాడు ఎంత బాధపడేవాడో...ఆమాట లనడానికి...ఎంత నరకయాతన అనుభవించేవాడో ఈ బ్రతుకులో... అది నే నాలోచించలేకపోయేను. ఆఖరి నిమిషం వరకు వాడి బ్రతుకుని నిలుపుదామనే ప్రయత్నించేను—ఇదంతా వాడిమీద ప్రేమవల్లేనా? నిజమైన వాత్సల్యంవల్లేనా అనిపిస్తుంది.

రామా: కాక మరేమిటి పార్వతీశంగారూ? తండ్రికి కొడుకుమీద మరేం ఉంటుంది? అందులో ఒక్క కొడుకు—

పార్వ: నా కివాళ, నా మనసు లోతులలోంచి నిజాన్ని తెలుసుకోవాలని ఉంది—నన్ను నేను విమర్శించుకోవాలని ఉంది అదంతా ప్రేమవల్ల కాదు; స్వార్థంవల్లనేమో డాక్టర్! అసలు మొఖాసాదారు నేను కాను, వాడు—

రామా: అది తెలుసు.

పార్వ: కాని ఇంకొకటి మీరు తెలుసుకోవాలి. నాకొక తమ్ముడున్నాడు. నాకొడుకు పిల్లలు లేకుండా, మేం బ్రతికుండగాపోతే ఆ ఆస్తి మా ఇద్దరి మధ్యా పంపకం జరుగుతుంది మాతండ్రి విలు ప్రకారం; అది నాకిష్టంలేదు; అంతా నా కింద ఉండాలని, అంతా నాకే నని ఆశ...తృష్ణ. అవి ఉండేవి—

రామా: పార్వతీశంగారూ...మీ మనస్సు బాగు లేదు.

పార్వ: వాడు బ్రతికున్నంతకాలం ఆస్తి నాదే ...నేను పోయేవరకన్నా వాడు బ్రతికి ఉండాలని...నన్ను నేను తెలుసుకుంటున్నాను డాక్టర్! మీతో అన్నా మనశ్శాంతి ఉంటుందేమో! వాడికి కొంతైనా సంతోషం దొరుకుతుందేమోనని ఒక అమాయకురాలిగొంతుక కోసేను—వాడికి పెళ్ళి చేసేను — ఇందుకు నన్నెవరన్నా క్షమిస్తారా డాక్టర్?

రామా: (మౌనం)

పార్వ: నాకొడుకుమీద నాకు ప్రేమఉంది—లేదనను—ఈ సర్వం వాడిదే అన్న జ్ఞానం ఉంది. లేకపోలేదు—కాని, నా ఆశ, నా స్వార్థంకోసమని, నయంకానిరోగాన్ని నయంచేద్దామని, వాడి జీవితాన్ని పనికిరానిమందులతో పెంచడం, దాని కన్ని విధాలా ప్రయత్నించేసి వాడిబాధని మరికొన్ని సంవత్సరాలు పొడిగించడం! నన్ను నేను క్షమించుకోలేను.

రామా: మీ కర్తవ్యం మీరు నెరవేర్చేరు- రోగికి చికిత్సచేయించటం తప్పా అని మీ రెందు కనుకుంటారు?

పార్వ: జాలిగా నా కళ్ళలోకిచూస్తూ — ఈ నరకం అనుభవించలేను నాన్నా! అని వాడన్న
కోపగించుకున్నాను—మందు పుచ్చుకోడం అశ్రద్ధచేస్తే వాడిని పైకి మందలిస్తూ, మనస్సులో వాడిని తిట్టేను—వాడిబాధకి ఎంత సానుభూతి, ప్రేమ లేకుండా ప్రవర్తించేను. నన్నెవ్వరూ క్షమించకండి—నన్నెవ్వరూ క్షమించకండి డాక్టర్!

రామా: పార్వతీశంగారూ! మీ మనస్సు సరిగా లేదు.

పార్వ: నా మతి కూడా బాగులేదని అంటారు. అనండి. వాడి మాటలు జ్ఞాపకం ఉన్నాయి. ఒక్క నిమిషంలో బాధని శాశ్వతంగా పోగొట్టే మందు, ఒక గుక్కెడు విషం ఎందు కివ్వరు? అని—వాడన్నది నిజమే. వాడి రోగం నయం కాదు. వాడు బ్రతికి వాడికేం సుఖం—వాడి కోరిక తీర్చిఉంటే వాడెంత సంతోషించును? మన చట్టం ఒప్పుకోదు—

కాని నాకెందుకు ధైర్యం లేదు; నాకు స్వార్థం; విషమే ఇవ్వక్కర్లేదు—వాడు మందులు పుచ్చుకోడంలో ఎందుకంత శ్రద్ధ పుచ్చుకోవాలి? పులిలా ఎదురుగా నిల్చొని కళ్ళెర్ర చేసి వాడికి ఇష్టమైన సిగరెట్లు ఎందుకు మాన్పించాలి? మాన్పించడంవల్ల ఏమైనా లాభం ఉందా? వాడి బాధని పెంచడం తప్పు? వాడేకున్న ఆ కాస్త సుఖం పోగొట్టడం తప్పు? పెళ్ళి చేసేను—అంతకన్నా డబ్బిచ్చి ఒక నర్సుని పెట్టి ఉంటే? నర్సుకన్న ఆ పిల్లవాడికేమిటి? ఆ హద్దులు దాటొద్దని ఆమెను బ్రతిమాలుకొన్నాను. వాడిని బెదిరించేను—కాపలా కాసేను—వాడికి ఈ జీవితంలో ఏ సుఖమూ లేకుండా చేసేను.

రామా: మీకు విశ్రాంతి అవసరం...పదండి, మీ గదికి.

పార్వ: నాకేవిశ్రాంతీ వద్దు! ఇదంతా ఎందుకు చేసేను? వాడిని అదుపులో పెట్టి వాడి బాధని పెంచేను. నేను పోయేవరకన్న వాడుండాలని—నన్ను వాడు క్షమించడు; మీకందరికి ఇందులో తప్పు కనిపించదు—కాని వాడుమాత్రం నన్ను క్షమించడు? ఇప్పుడు వాడు సుఖంగా ఉన్నాడు కాని పాత సంగతులు మరిచిపోలేను—(ఎలుగెత్తి) ఒరే గోపీ!! (గదివదుల్తూ) క్షమించరాబాబూ!! మీ నాన్నని క్షమించరా తండ్రీ!!

[అతని గొంతు మరి వినిపించదు. ద్వారంవైపు ఆశ్చర్యంగా చూస్తూ ఉండిపోతాడు రామారావు—తరువాత ముఖం తిప్పి, తల చేతుల్లో పెట్టుకొని ఆలోచిస్తూ ఉంటాడు.

కమల అలికిడి లేకుండా ప్రవేశిస్తుంది. రామారావుని సమీపించి అతని భుజంమీద చెయ్యి వేస్తుంది.]

రామా: (ఉలిక్కిపడి తిరిగి చూసి) నువ్వా!

[లేచి నిల్చుంటాడు]

కమల: ఫరవాలేదు—కూర్చో.

రామా: నాకు బాధ లేదు. నువ్వు కూర్చో.

[కమల కుర్చీలో కూర్చుంటుంది—రామారావు టేబిలుకి చేరబడి నిల్చుంటాడు]

అన్నివిధాలా ప్రయత్నం చేసేను...నాలోపం ఏమీ లేకుండా—

కమల. (ఆలోచిస్తూ) ఔను! నీ లోపం ఏమీ లేదు.

రామా: ఆ అరగంట కలత్యం...

కమల: (ఉలిక్కిపడి తిరిగి సర్దుకొని) అదే కారణం అంటావా?

రామా: అయిఉండొచ్చు—అరగంటవల్ల అంత బాధ లేదు ఆ స్థితిలో.

కమల: నువ్వు చాలా బాధపడుతున్నట్టుంది.

రామా: లేదు—నేనేం బాధపడలేదు కాని నువ్వు ఆ ముసలాయన్ని కొంచెం చూడు కమలా...అతను పిచ్చెత్తినట్టయిపోయేడు...

కమల: నేను వెళ్ళి ఏమీ చెయ్యలేను. నేను కనిపిస్తే మరింత బాధ—ఇప్పుడు నేను కనిపించగానే తప్పుచేసిన మనిషిలా బెదిరి పరుగెత్తిపోయి గదిలో తలుపు వేసుకున్నారు.

రామా: నీకేదో అన్యాయం చేసినట్లు బాధపడుతున్నాడాయన—

కమల: నా కొక్కర్తికేనా?

రామా: నువ్వూ అలాగే అంటావా కమలా? ఆ ముసలాయనమీద కొంచెం సానుభూతితో మాట్లాడు!

కమల: అదే ఇప్పుడు చెయ్యాలి!

[మౌనం]

ఇప్పుడాయన సుఖంగా, నిష్పూచీగా—ఎంతో హాయిగా, ఏ బాధా లేకుండా ఉన్నారు!! కాని... (ఊరుకుంటుంది).

రాము: ఏమిటి కమలా ?

కమల: నాకిప్పుడేమీ పనిలేదు. ఎనిమిదేళ్ళ ఆపనికి అలవాటుపడిన ఈ చేతులు, విరిగిపోయేయి. నేనింక ఏం చెయ్యాలి!

[మౌనం]

నిజంగా చెప్పు రాముం - నీ హాస్పిటల్ కి నర్సక్కర్లేదా?

రామా: (మౌనం).

కమల: నాపని ఇక్కడ అయిపోయింది...ఈ ఇంట్లో నాకింక చోటులేదు - నాకు పనిలోనుంచి డిస్ మిస్ !

రామా: నువ్వూ ముసలాయన్లాగే మాట్లాడుతున్నావ్...మనస్సు కొంచెం కుదుటపరచుకో—

కమల: నాకూ పిచ్చెత్తిందనుకోకు రాముం ! అతనికి ఈ నరకంనుంచి విముక్తి దొరుకుతే నాకూ స్వేచ్ఛ దొరుకుతుందని ఆయనన్నారు అతనికి ముక్తి దొరికింది కాని, నాకా స్వేచ్ఛ దొరకగానే... ఏమిటిక అని ఆలోచనలో పడాల్సొచ్చింది. నా

కింక ఈ శ్రీమంతుల ఇంట్లో పని అయిపోయింది. ఆ ముసలాయన నన్ను చూసి దాక్కుంటున్నాడు నన్ను చూసి పారిపోతున్నాడు—నన్ను చూసి అసహ్యించుకుంటూ డింక—

రామూ: ఇప్పుడలా నే ఉంటుందాయనికి—కొన్ని రోజులు పోయేక కుదుటపడతాడు...

కమల: డాక్టర్ లా మాట్లాడకు రామం—సూటిగా మాట్లాడు—నీ మనస్సుకి నమ్మకం ఉందా?

రామూ: ఏమో నాకు తెలీదు కమలా... నాలో నాకే ఎందుకో నమ్మకం పోతోంది ..

కమల: నెగ్గలేకపోయేవనా?

రామూ: కాదు—ఎందుకో... సరిగ్గా చెప్పలేను...

కమల: నీకు నర్సక్కర్లేదా రామం?

రామూ: నా హాస్పిటల్ కా?

కమల: నీకు—

రామూ: నాకా......!!

కమల: ఔను—నాకీ ఇంట్లో చోటు లేదు—నేను ఉండలేనుకూడా—ఎక్కడో ఓచోట ఏదో ఓలా బతకాలి...

రామూ: అవేం మాటలు కమలా...

కమల: ఔను రామం. నేను నిజం అంటున్నాను—నీకు నర్సక్కర్లేదా?

రామూ: నాకెందుకు? నాకేం...

కమల: నీకు తుయ లేదంటావ్ — నిజమే. నీ శరీరం ఏ రోగంతోనూ బాధపడలేదు—కాని, నీ మనస్సు రామం? నీ మనస్సు ఏళ్లతరబడి ఏ బాధా లేకుండా ఉందంటావా?

రామూ: (అనుమానంగా ఆమెని చూస్తూ) మనస్సుకేదో బాధ ఉంటూనే ఉంటుంది—అది లేకుండా ఎలా సాధ్యంవోతుంది కమలా?

కమల: నీ మనస్సు విషయంలో జాగ్రత్త తీసుకోనేందుకు ఎవ్వరూ అక్కర్లేరూ?

రామూ: అంటే?

కమల: నీ మనస్సుని అదుపులో పెట్టడానికి, దానికి మందులివ్వడానికి, దానికి శాంతినివ్వడానికి—దానిని జోకొట్టడానికి.

రామూ: కాని అలాటి నర్సు... ఉంటుందా...

కమల: నే నేనూ?

రామూ: నువ్వా!!

కమల: ఔను—నే నాపని సరిగ్గా చెయ్యగలనని నీకు నమ్మకం లేదా?

రామూ: ఎందుకు లేదు—కాని కమలా...

కమల: నేను జీతం ఎక్కువ అడగను. ఇక్కడ ఏ దిచ్చేవారో అదే—తిండి... బట్ట...... కొంచెం స్వేచ్ఛ... అంతే... ఏమంటావ్ రామం?

రామూ: కాని కమలా... ఎవరన్నా ఏమన్నా అనుకోడానికి...

కమల: మామగారు సంతోషిస్తారు. నేను కనిపించకపోవడమే ఆయనికి కావల్సింది—మా ఆయన నాకెలాగా స్వేచ్ఛనిచ్చేరు. ఈపాటికి ఆ లోకంలో ఆ సంతోషంలో నన్ను మరిచేఉంటారు. ఇంకెవరు ఏమనుకున్నా నాకేం రామం? నువ్వేమన్నా బాధపడుతున్నావా?

రామూ: (నవ్వడానికి ప్రయత్నిస్తూ) లేదు లేదు... అలానే కమలా... నువ్వు నాకు నర్సుగా ఉండు—

కమల: (సంతోషంతో) నిజంగానా! ఇంక నే నే బెంగా పెట్టుకోనక్కర్లేదు.

రామూ: ఔను కమలా...

కమల: (అనుమానంగా) నువ్వెందుకింకా అలా ఉన్నావ్? ఎందుకంతలా ఆలోచిస్తున్నావ్?

రామూ: లేదు కమలా...

కమల: దాచకు. నువ్వు నెగ్గలేకపోయేవని విచారం పెట్టుకున్నావ్.

రామూ: కాదు—ఒక సంగతి ఆలోచిస్తున్నాను. ఆ గడియారంగురించి—

కమల: (ఆందోళన మరుగుపరుస్తూ) గడియారం గురించేమిటి? గడియారం ఆగిపోయిందనా?

రామూ: కాదు—ఇంకొక విషయం. ఇప్పటివరకు అదే ఆలోచిస్తున్నాను ఇందాకట్నించి—

కమల: ఆ అరగంట ఆలశ్యంవల్ల...

రామూ: ఆ అరగంట ఆలశ్యంవల్ల ఇది జరగలేదు—నిజమే—కాని నాకు ఇందాక... నాకు లోపల—మనసులోపల, దాని లోతుల్లో తెలుసును గడియారం గంటలు కొట్టలేదని... రెండు దాటిపోయిందని... అయినా నే నూరుకున్నాను - నా చేతివాచీ చూసేందుకు ధైర్యంలేక—ఆ గంటలు కొట్టినప్పుడే చూసుకుందామని...

కమల: అది నిజంకాదు—నువ్వలా అనుకోకు రామం—

రామా: నేను నీతో మాటల్లోనే ఉన్నాను కాని, నా అంతరాత్మ తెలుస్తూనే ఉందేమో—గడియారం గంటలుకొట్టలేదు. ఆలశ్యం అయితే అది ఆ గడియారానిదే తప్పు—ఈ అవకాశం ఎందుకు జారవిడుచుకోవాలి...అనిపించిందేమో!

కమల: (ఆశ్చర్యంగా చూస్తుంది)

రామా: కమలా! గడియారం నువ్వే ఆపేవ్ కదూ?

కమల: (తృళ్ళిపడి) నేనా!

రామా: చెప్పుకమలా! నిన్ను నేను ఏమీ అనను—నీమీద నాకున్న అభిమానం తగ్గదు. నిజం చెప్పుకమలా!

కమల: (ఆలోచించి) ఔను రామం—నేనే...

రామా: ఔను—నేనదే అనుకున్నాను—నా లోపలి మనస్సుకి ఆ అరగంటా ఆ నిజం తెలుస్తునే ఉంది—కమల అందరికోసం ఈ పనిచేసి ఉంటుందేమో—ఆలశ్యం ఔతోంది—కానీ—తెలుసు—కాలం జారిపోనీ బాహ్యంగా నీకు తెలీకుండా—అలా అనిపించింది!

కమల: నువ్వలా అనుకోకు రామం—ఈ అరగంట ఆలస్యం దానికి కారణం కాదు!

రామా: కాదు. నిజమే—కాని నేనెందుకు తెలిసి తెలిసి ఊరుకున్నాను? రెండుగంటలు అయి ఉండాలే అనుకుంటూ, అనుమానం వేసినా నా వాచీ ఎందుకు చూసుకోలేదు? స్వార్థకాంక్ష ఎందుకొచ్చింది?...స్వలాభం! కమలా...స్వార్థం.

కమల: (లేచి దగ్గరగా వెళ్తూ) ఏమిటా మాటలు రామం!!

రామా: అశ్రద్ధ!!

కమల: (ఉలిక్కిపడి) అశ్రద్ధ!!

రామా: ఔను. అశ్రద్ధ! ఆ అశ్రద్ధ దానికి కారణం కాకపోయినా, అది ఎందుకు జరగాలి? నీకోసం ఆపని చేసేనేమో...దానికి నాలోని డాక్టర్ ఒప్పుకున్నాడేమో...

కమల: (కోపం తెచ్చుకొని) పోనీ! అలానే అనుకో—ఇందువల్ల ఎవరికీ నష్టంలేదు—అతను కోరిందీఅదే. నిన్నతను బ్రతిమాలుకున్నదే అది-నీకేం నష్టం ఉంది? (వళ్ళి భుజంమీద చెయ్యివేస్తుంది.)

రామా: నేనింక డాక్టర్ని కాదు. నాలో నాకు విశ్వాసం పోయింది. నాపని సరిగా చెయ్యలేక పోయేను—ఇంక నేను ఏమందూ ముట్టుకోను—నే పోతాను కమలా...

కమల: ఎక్కడికి?

రామా: ఇంటికి.

కమల: ఈ చీకట్లోనా?

రామా: ఔను. నాకేం భయంలేదు. ఇక్కడ ఉండలేను—నా మనస్సు ముక్కలౌతుంది మరొక నిమిషం ఉంటే; ఈ వాతావరణంలో ఉండలేను. ఇంటికి పోవాలి. మనస్సు కూడ తీసుకోవాలి...అస్థిపంజరం! అస్థిపంజరం!

కమల: నీకు పిచ్చెత్తిందా రామం!

రామా: అస్థిపంజరం ముందు కూర్చుని మనస్సు కూడ తీసుకోవాలి. ఆత్మవిశ్వాసం కుదుర్చుకోవాలి.. ఇక్కడ ఉండలేను...(పోబోతాడు).

కమల: నీ సంచీ - వస్తువులు...

రామా: వాటిఅవసరం తీరిపోయింది...నాకవి అక్కర్లేదు—నేనీ వృత్తి మరి చెయ్యను! చెయ్యలేను!...కాని అస్థిపంజరం...అది ఉండాలి...ఆత్మవిశ్వాసానికి...అది ఉంటేనే కాని ఇది ఉండదు—

కమల: నువ్వీ రాత్రప్పుడు వెళ్ళకు—నామాట విను—

రామా: నేనిక్కడ ఒక్క నిమిషం అన్నా ఉండలేను—వదులు నన్ను! నామనస్సు పాడయింది. దానికి రోగం వచ్చింది—

(ద్వారంవైపు వెళ్తూ ఒక్కసారాగి) నాకు నర్సుగా ఉంటావ్ కదూ?

కమల: ఉంటాను రామం—కాని నువ్వలా పిచ్చివాడిలా అవకు—

రామా: నీ వీలుచూసుకొనిరా—కాని ఈరోగిని మరిచిపోకు! (తనకుతానే) ఆత్మవిశ్వాసం! అస్థిపంజరం...నాలోని రాక్షసుడు - రాక్షసుడికెంత బలం!!

(నిష్క్రమణ)

కమల: (స్తబ్ధురాలయి నిల్చుంటుంది కొంతసేపు అతను వెళ్లినవైపే చూస్తూ - తరువాత కుర్చీలో కూలబడి టేబిలుమీద తల ఆన్చి, ముఖం కప్పుకొని వెక్కి వెక్కి ఏడుస్తుంది - ఏడుపు మధ్య) భగవంతుడా!...రక్షించు!!!

# మన చలనచిత్ర పరిశ్రమ

## శ్రీ కాట్రగడ్డ నరసయ్య

**1920** వ సంవత్సరములో తెలుగు చలన చిత్ర పరిశ్రమకు ఒక పునాది ఏర్పడినదని చెప్పవచ్చు.

1918 కు ముందు మళయాళి దేశస్థుల జోస్ బయస్కోపు కార్బయిడ్ లాంపుతో సైలెంటు సినిమాలు చూపేవారు. 1919 లో కాకినాడ కాలేజీ ప్రిన్సిపాలు శ్రీ రఘుపతి వెంకటరత్నం గారి తమ్ముడు శ్రీ వెంకయ్యగారు ఇంజను డైనమోతో ప్రథమ టూరింగుహాలు నడిపి, తరువాత 1920 లో మద్రాసులో గెయిటీహాలు నిర్మించారు.

ఇతర ప్రాంతాలవారు వచ్చి మనదేశంలో క్రొత్తపద్ధతిలో వ్యాపారం చేసి లాభాలు గడించటం, తమలో ఒకరైన శ్రీ వెంకయ్యగారు గెయిటీహాలు నిర్మించటం గమనించిన మన పరిశ్రమ పితామహులు చలనచిత్ర పరిశ్రమలోని వ్యాపార లక్షణాన్నీ, వ్యాపార స్వభావాన్నీ గుర్తించారు. ఈ పరిశ్రమలో పెట్టుబడి పెట్టటం లాభదాయకమని గ్రహించారు. 1921 లో ఆంధ్రలో విజయవాడలో తొలి ప్రదర్శనశాలను శ్రీ పోతిన శ్రీనివాసరావుగారు నిర్మించారు.

1921-23 సంవత్సరాలలో చాలావరకు పరిశ్రమలోనికి పెట్టుబడులు రాసాగాయి. గోడౌనులను ప్రదర్శనశాలలుగా మార్చటం జరిగింది. బందరులోను, ఏలూరులోను, రాజమండ్రి కాకినాడలలోను ప్రదర్శనశాలలు నిర్మించబడ్డాయి. క్రమేపీ వీటి సంఖ్య ఆంధ్రదేశంలో పెరిగింది. అంతవరకు సైలెంటు చిత్రాలనే ప్రదర్శించేవారు.

ఆ సమయంలో సి. పుల్లయ్యగారి మార్కండేయ, ప్రకాశ్ తీసిన భీష్మలాంటి సైలెంటు చిత్రాలు వచ్చాయి.

టాకీల యుగం ప్రారంభం కావటంలో పరిశ్రమ క్రొత్తసమస్యలను ఎదుర్కొంది. నూతనత్వం చూపటమే లక్షణం, స్వభావంగాగల పరిశ్రమలో తమ స్వభాషలో చిత్రాలు తీస్తే చాలా లాభాలు వస్తాయని గ్రహించారు.

1931 లో హెచ్. యమ్ రెడ్డిగారు భక్త ప్రహ్లాద ప్రథమ తెలుగు చిత్రం కావటంతో భక్తప్రహ్లాద ఎంతో విజయవంతంగా నడచింది. ఎంతో మంది క్రొత్తవారిని పరిశ్రమలోనికి ఆకర్షించింది.

### మధ్యరకం పరిశ్రమ

ఈ విధంగా ఎంతోమంది క్రొత్తవారు ఆకర్షింపబడటం, ప్రదర్శనశాలల నిర్మాణం జరగటంతో పరిశ్రమ ఒక మధ్యమ తరగతి (మీడియం స్కేలు) పరిశ్రమగా అభివృద్ధి కాసాగింది. 1931 నుంచి 1936 వరకూ 29 పౌరాణికాలు నిర్మించబడ్డాయి. హిందీ భాషలో వచ్చిన సాంఘికాల మూలంగా, నూతనత్వంకోసం జరిగిన ప్రయత్నాల ప్రభావంగా, 1936 లో ప్రథమ సాంఘికచిత్రం ప్రేమవిజయం నిర్మించబడ్డది. అయితే పౌరాణికాలకున్న విలువ సాంఘికాలకు అప్పట్లో లేదు.

### స్టుడియోలు

1936 వరకు స్టుడియోలు మద్రాసులోనే వుండేవి. పరిశ్రమ అభివృద్ధిని, సంవత్సరానికి 8 చిత్రాలు తయారవటం గమనించిన తెలుగు వ్యాపారస్తులుకొందరు రాజమండ్రిలో దుర్గాసినీటోన్ 1936 లో నిర్మించారు. ఆ దుర్గా సినీటోన్‌లో సంపూర్ణ రామాయణం, సత్యనారాయణ వ్రతం మాత్రం నిర్మించారు. 1937 లో విశాఖపట్నంలో ఆంధ్ర సినీటోన్ నిర్మించబడి భక్త జయదేవ్ అన్న చిత్రం తయారుచేయబడింది. తెలుగు గడ్డపై నిర్మించబడిన రెండు స్టుడియోలు ఆ తరువాత మూసివేయబడ్డాయి.

తెలుగు చలనచిత్ర పరిశ్రమ తరువాత మద్రాసులోనే కేంద్రీకృతం కాసాగింది. కలకత్తా,

బొంబాయి స్టుడియోలలో కూడా తెలుగు చిత్రాల నిర్మాణం తగ్గిపోయింది.

1938 వరకు పౌరాణికాల నిర్మాణం ఎక్కువగా జరిగింది. 1938 లో విడుదల చేయబడిన సాంఘిక చిత్రం గృహలక్ష్మి విజయవంతం కావటంతో సాంఘికాలపై నిర్మాతలు మోజుపడసాగారు. ఆ రోజులలో పరిశ్రమలోని ప్రముఖులు పి. వి. దాసు గారు, పారుపల్లి శేషయ్యగారు, గూడవల్లి రామబ్రహ్మంగారు

గూడవల్లి రామబ్రహ్మంగారు సాంఘిక సమస్యలను తీసుకొని చిత్రాలు తీయటంతో పరిశ్రమలో ఒక నూతనదృష్టి ఏర్పడింది పౌరాణికాలే కాకుండా సాంఘికాలుకూడా ప్రజలను ఆకర్షించుతాయని గ్రహించారు. పారుపల్లి శేషయ్యగారు, పి వి దాసు గారు పెట్టుబడులను పరిశ్రమలోనికి తేవటానికి ఎంతో కృషి చేశారు. పౌరాణికాలు, సాంఘికాలు, జానపద చిత్రాలు తీయటం పెరిగింది తదుపరి కుటుంబ గాథలు చిత్రాల కథావస్తువు కావటం ప్రారంభమైంది.

1936 నుంచి 1942 వరకూ సంవత్సరానికి 10 చిత్రాలకు తక్కువ కాకుండా నిర్మాతలు విడుదలచేశారు.

చలనచిత్ర పరిశ్రమ ఎంతో విశాలమైన పరిశ్రమగా పెంపొందసాగింది. యుద్ధకాలంలో నిర్మాణం కొంత మందగించినా పరిశ్రమలోనికి పెట్టుబడులు డిస్ట్రిబ్యూషను వ్యాపారరూపంలోను, ప్రదర్శనశాలల రూపంలోను చాలా త్వరితంగా రాసాగాయి

1943 నుండి 1949 వరకు సంవత్సరానికి సుమారు 7 చిత్రాలు విడుదల అయ్యాయి. దీనికి ముఖ్యకారణం ద్వితీయ ప్రపంచ సంగ్రామంగా గుర్తించవచ్చును. యుద్ధానికి పూర్వం 40, 50 వేల రూపాలయితో చిత్రం తయారయ్యేది. యుద్ధానంతరం 2, 3 లక్షలకు దాటిపోయింది ముడి ఫిలిం ఖరీదు, నిర్మాణం ఖర్చులు ఎక్కువకావటం దీనికి కారణం.

## ప్రధాన పరిశ్రమ

ఈ దశలో తెలుగు చలనచిత్ర పరిశ్రమ మధ్య తరగతి పరిశ్రమ దశనుంచి ప్రధాన పరిశ్రమగా పెంపొందింది 1950-53 సంవత్సరంలోని పెట్టుబడులను పరిశీలించితే సుమారు $7\frac{1}{2}$ కోట్లు తెలుగు చలనచిత్ర పరిశ్రమలో కేంద్రీకృతమయినట్లు తేలుతుంది. కోటిరూపాయలు నిర్మాణంలోను, కోటిరూపాయిలు 6 స్టుడియోలమీదను, కోటిరూపాయిలు డిస్ట్రిబ్యూషన వ్యాపారంలోను. $4\frac{1}{2}$ కోట్లు 227 పర్మనెంటు ప్రదర్శనశాలల మీదను సుమారు 201 (101 + 100) టూరింగుల మీదను. మొత్తం $7\frac{1}{2}$ కోట్లు పరిశ్రమలోకి వచ్చింది.

ఆంధ్రదేశంలోని పంచదార పరిశ్రమ, సిమెంటు పరిశ్రమ బియ్యం, వేరుశెనగనూనె ఫ్యాక్టరీలు, బ్యాంకులమీద కూడ ఇంత పెద మొత్తం పెట్టుబడులు లేవు కనుకనే ఆంధ్రదేశంలో సినిమా పరిశ్రమ ప్రధాన పరిశ్రమగా తయారయింది. ఇంత విశాలమైన పరిశ్రమ స్వభావం, ప్రత్యేక లక్షణాలు, అభివృద్ధిలోని వివిధ ధోరణులు పరిశీలించవలసిన అవసరం ఎంతైనా వున్నది పరిశ్రమలోని యీనాటి అరాచకాన్ని అర్థం చేసుకోవటానికి కూడా అది అవసరం.

## పరిశ్రమ స్వభావం

పైన వివరించినట్టుల 1931 నుండి 1935 వరకు పూర్తిగా పౌరాణికాలు వచ్చాయి చిత్రాలు ఎక్కడో ఒకటి తప్ప అపజయం పొందేవి కావు.

ఈనాడు కన్నడభాషలో 7 చిత్రాలు వస్తే. ఏడూ ఎంతో విజయవంతముగా నడుస్తున్న పద్ధతిలో మన పరిశ్రమ తొలిరోజులలో జరిగింది. పరిశ్రమ వైపు ధనికులు ఆంధ్ర ప్రాంతాలనుండి ఆకర్షించబడ్డారు. పరిశ్రమలోకి నిర్మాతలు, డిస్ట్రిబ్యూటర్లు ప్రదర్శకులుగా చాలామంది వచ్చారు.

## నిర్మాత : డిస్ట్రిబ్యూటరు

నిర్మాత, డిస్ట్రిబ్యూటరు పరిశ్రమలో చాలా దగ్గర సంబంధాలుగల వ్యక్తులు. ఒకరిపైన ఒకరు ఆధారపడి వుండేవారు. ఆంధ్ర డిస్ట్రిబ్యూటర్లు పరిశ్రమలోనికి రాకముందు డిస్ట్రిబ్యూషను వ్యాపారం గుజరాతీ సంస్థల చేతులలోను, బెంగుళూరు సంస్థల చేతులలోను వుండేది.

పరిశ్రమలోని లాభాలను గుర్తించి, డిస్ట్రిబ్యూషనులోనికి క్రొత్తవారు రాసాగారు. నిర్మాతలు తమను ప్రోత్సహించే తెలుగు వ్యాపారస్థుల కోసం వెదుకసాగేరు. పూర్ణాసంస్థ అధినేత మంగరాజుగారి ప్రవేశం అదేకాలంలో జరిగింది. పారుపల్లి శేషయ్యగారు స్థాపించిన సరస్వతీ టాకీసు లిమి

టెడ్ వారు నూటికి నూరు రూపాయలు డివిడెండ్లను ఇవ్వటం, బంపరు పి. సి. దాసుగారు వేల్ పిక్చర్సులో 60% డివిడెండ్లు యివ్వటం కొత్తవారిని పరిశ్రమలోనికి ఆకర్షించింది.

ఆంధ్రదేశంలో అప్పుడే వస్తున్న ఇతర పరిశ్రమలు ఆర్థిక సంక్షోభంతో పతనమయిపోవటం, లిమిటెడ్ కంపెనీల దివాళాకోరు పద్ధతులు గమనించిన భూస్వాములు మిగతా పరిశ్రమలకన్న చలనచిత్ర పరిశ్రమవైపు ఎక్కువగా ఆకర్షింపబడ్డారు. అంతేకాకుండా వ్యవసాయదారుల వడ్డీలను తగ్గించుతూ చట్టం రావటం కూడా యీ పరిశ్రమలోనికి పెట్టుబడులు రావటానికి దోహదమిచ్చింది.

## పరిశ్రమకు గల ఆకర్షణ

చలనచిత్ర పరిశ్రమకు ఇతర పరిశ్రమలకు లేని ఒక ఆకర్షణ వుంది. ఈ పరిశ్రమలో వ్యాపారం, జీవితం, వినోదం పెనవేసుకొని ఉంటాయి.

భూస్వామిక సమాజంలోని భోగం మేళాలకు అలవాటుపడ్డవారికి కూడా సినిమా పరిశ్రమపట్ల ఔత్సుక్యం కలిగింది. ఈ కాలంలోనే కొంతమంది జమీందారులుకూడా పరిశ్రమలో ప్రవేశించారు. అనేకమంది భూస్వాములు, ధనిక రైతులు పరిశ్రమలోనికి పెట్టుబడులను విరివిగా పెంచసాగారు.

## చలామణీ పెట్టుబడులు

భారతదేశంలోని ఇతర పరిశ్రమలవలెనే చిత్ర పరిశ్రమలోనికి వచ్చిన ధనాన్నంతటినీ పెట్టుబడుల క్రింద మార్చటం చెలామణీ పెట్టుబడుల (*liquid capital*) గా ఉంచకపోవటం జరిగింది పరిశ్రమ. పెరుగుతున్నంత వేగంగా పెట్టుబడులు రాలేకపోయాయి. అందువలన పరిశ్రమ యితర పరిశ్రమలాగా కేంద్రీకృతమైన పరిశ్రమగా (*Concentrated Industry*) (లిమిటెడ్ కంపెనీలుగాను జాయింటు స్టాకు కంపెనీలుగాను) పెరగలేదు. అనేకమంది వ్యక్తులు కొద్ది పెట్టుబడితో రావటం జరిగింది. దానివల్ల యిటు నిర్మాతగాని, అటు డిస్ట్రిబ్యూటరుగాని స్వంతంగా చిత్రాన్ని తీయలేకపోయారు. ఒకరిపై ఒకరు ఆధారపడుతూ ఉండటంవల్ల అంతకుముందు విజయవంతంగా ఇతరులు అనుసరించిన పద్ధతితప్ప క్రొత్తపుంతలను తొక్కటానికి భయపడసాగారు. అందువల్ల, ఏ పాతపద్ధతి పూర్తిగా అపజయం పొంది లాభం లేదనుకొన్నప్పుడే, క్రొత్తపద్ధతిని అవలంబించటానికి ఆలోచించటం పరిశ్రమస్వభావంగా మారిపోయింది. ఇతర పరిశ్రమలకు చలనచిత్ర పరిశ్రమకు ఉన్న ప్రాథమిక వ్యత్యాసాన్ని కూడా గమనించలేకపోయారు. ఏ క్రొత్తదనం (*Novelty*) చేత తాము ఆకర్షింపబడ్డారో అలాంటి క్రొత్తదనాన్ని ప్రేక్షకులు కూడా కోరతారని, వారి అభిమానాలు పొందాలంటే సంవిధానం విషయంలో పరిశోధన అవసరమని గుర్తించికూడా అవలంబించలేదు. సిద్ధాంతాల ప్రకారం (8 డాన్సులు 10 పాటలు, 5 విషాదఘట్టాలు, కొన్ని హాస్య సన్నివేశాలు లాగా) చిత్రాలు తీయటం ఎక్కువ అయింది.

## పరిశ్రమలోనికి వచ్చిన క్రొత్తవారి పరిస్థితులు

### నిర్మాతలు

క్రొత్తవారికి చాలా ఖర్చులు అయ్యేవి. అనుభవం లేకుండా గ్రామ ప్రాంతాలనుంచి పెట్టుబడులు తీసుకొనివచ్చేవారు. ఈ చిన్న చిన్న నిర్మాతలు తెచ్చిన తక్కువ పెట్టుబడులతో నిర్మాణం మొదలెట్టేవారు. తరువాత డిస్ట్రిబ్యూటర్లపై ఆధారపడేవారు. చాలామంది ఒక చిత్రంతీసి నష్టపడి పరిశ్రమలోనుంచి బయటికి పోయేవారు. పరిశ్రమలోని పెట్టుబడులను చిత్రాలవారీగా పరిశీలించితే వస్తోన్న నష్టం ఎవరూ సహించలేరు. ప్రణాళిక లేని పరిశ్రమ యింతకాలం నిలబడటానికి కారణం క్రొత్తవారు ఆకర్షింపబడి వ్యక్తిగతంగా నష్టపడినా కొంత పెట్టుబడిని పరిశ్రమ పెంపుదలకు వదలిపోవటం ఒక కారణంగా గుర్తించవచ్చును. నిర్మాణ ప్రణాళిక (*Planning*) లేకపోవటంవల్ల స్టుడియోలలో కాల్‌షీట్ల రూపంలో ఎక్కువ ధనం యివ్వటంతో స్టూడియోలలో పెట్టుబడులు పెరగటం జరిగింది. కాలక్రమేణా టెక్నీషియను, నటీనటులు చిత్రాలు తియ్యటానికి దోహదమిచ్చింది.

### డిస్ట్రిబ్యూటర్లు

డిస్ట్రిబ్యూటర్లుగా పరిశ్రమలో ప్రవేశించి విజయవంతంగా వ్యాపారం చేయటం చాలా కష్టంగా ఉండేది. కిరాయిపద్ధతిలో (*Hire Rental System*) క్రొత్త డిస్ట్రిబ్యూటరు చిత్రాలను సరిగా పంపిణీ చేయలేరని నిర్మాతలు భావించారు. అందువల్ల తమకు నిర్మాణంలో ఎక్కువ సొమ్ము అడ్వాన్సుగా యిచ్చి తక్కువ కమీషను తీసుకునే వారికే చిత్రాలను

యిచ్చేవారు. అందువల్ల పరిశ్రమలోనికి క్రొత్తవారు ప్రవేశించాలంటే చాలా కష్టంగా ఉండేది. క్రొత్తవారు చాలా స్పెక్యులేషను చెయ్యాల్సివచ్చేది కనుక వారు ధైర్యంతో నూతనత్వాన్ని కోరే క్రొత్త నిర్మాతలను ప్రోత్సహించేవారు. అయితే పరిశ్రమలో నిలవదొక్కుకోగానే పాత పద్ధతులలోనే పోయేవారు. క్రొత్తగా ప్రవేశించిన కొందరు డిస్ట్రిబ్యూటర్లు ఏ స్పెక్యులేషను స్థాయిపై పైకి వచ్చారో అదే పద్ధతిలో తరువాత కూడా వ్యాపారం చేసి పూర్తిగా నాశనమైన సంఘటనలు కూడా లేకపోలేదు. వారు వ్యాపారానుభవం గడించకుండా లోగడపొందిన విజయంతో లెక్క లేకుండా ప్రవర్తించి పతనమయిన ఘటనలున్నాయి.

## ప్రదర్శకులు

ప్రదర్శకులుగా వ్యాపారానుభవం లేని క్రొత్తవారు రాసాగారు. ప్రతి కేంద్రములోను పరిస్థితులను, ఆవశ్యకతను గుర్తించకుండా ఎక్కువ హాలులు నిర్మించి తీవ్రమైన పోటీని పెంచివేశారు.

ఉదాహరణగా విజయవాడలోని 11 హాలుల సంఖ్య. ప్రదర్శనవిధానాలలో క్రొత్తపద్ధతులు అవలంబించకుండాను, ప్రేక్షకుల సౌకర్యాలు గమనించకుండానూ మంచిచిత్రముంటే ప్రేక్షకులు రాకుండా ఎక్కడకు పోతారన్న ధీమాతోనూ చిత్రాలకొరకే డిస్ట్రిబ్యూటర్లవైపు ఎగబడసాగేరు. అందువల్లనే ప్రదర్శకులకు ఇన్‌కంటాక్సు డిపార్టుమెంటువారునిర్ణయించిన స్థాయినిమించి ప్రయాణపు ఖర్చులు పెరిగిపోయాయి.

## ప్రేక్షకులు

ప్రేక్షకులలో చాలామంది ప్రదర్శనశాలలో సౌఖ్యాన్ని గమనించకుండా చిత్రం చూడటానికి పోతారు. వీరు ఆయా చిత్రాలకోసమే గత్యంతరం లేక అలాటి ప్రదర్శనశాలలకు వెడతారని మనమంతా గుర్తించవచ్చును. కొంతమంది ప్రేక్షకులు ప్రదర్శనశాల తమ నివాసములకు దగ్గరగా ఉన్నప్పుడు అది ఎలా వున్నప్పటికీ అచ్చటికే పోతారు. ఇటువంటి వారిని ఒకరకపు ప్రేక్షకులుగా గుర్తించవచ్చును. కాని కొంతమంది ప్రేక్షకులు అన్ని సౌకర్యములు కలిగి, విశ్రాంతిని కలుగజేసే ప్రదర్శనశాలకు ఏ చిత్రం వున్నప్పటికీ, లెక్క చేయకుండా పోతారు. ఇలాంటి ప్రేక్షకులు సమాజం అభివృద్ధి అవుతున్న కొద్దీ ఎక్కువ అవుతారు. ఈ ప్రేక్షకులకు అవసరమైన ఏర్పాటులు చేయటం వార్తా చిత్రాలు, సైను రీల్సు పెంపొందించటం, ఉత్తమ చిత్రాలను తెప్పించటం ద్వారాను క్రమేణా ప్రదర్శనశాలకు యిలాంటి ప్రేక్షులను ఎక్కువగా ఆకర్షించవచ్చు. అభివృద్ధి చెందుతున్న మన సమాజంలో యిలాంటి ప్రేక్షకుల సంఖ్య పెరుగుతుంది. వారిని ఆకర్షించటమే ప్రదర్శకులు ఆదర్శంగా పెట్టుకొన్నప్పుడే ప్రదర్శనశాల బాగా అభివృద్ధిచెందుతుంది. కాని తీవ్రమైన పోటీ పెంచినంత మాత్రంచేత కాదు. అలా చేయటం వ్యాపారాన్ని నాశనం చేయటం గాని, పెంపొందించటం కాదు.

## నటీనటులు

పరిశ్రమలోని పాతపద్ధతుల అనుసరణ కారణంగా నటీనటులను ఒకేరకపు పాత్రను ధరించేలాగు వత్తిడి చేయసాగారు. కళాకారుని అభివృద్ధిచేసి వాడుకోవటం మాని, ఒకే పాతపద్ధతిలో (*Steriotyped*) నటించేలాగు చేయసాగేరు. అది చివరకు ప్రేక్షకులు అసహ్యించుకొని ఆ నటుడుకాని నటిగాని ఉన్న చిత్రమంటే విహ్యపడేటంతవరకు చేయటం జరిగింది కనుక పరిశ్రమను సమగ్రంగా పరిశీలించితే ఉత్తమస్థాయి పరిణామంకోసం కాకుండా ఒకే పద్ధతి ఒకే సంవిధానం పూర్తిగా అపజయం పొందేవరకు ఆ పద్ధతినే అవలంబించటం పరిశ్రమ స్వభావంగా మారినట్టు మనకు తెల్లమౌతుంది.

పరిమిత పెట్టుబడులు కావటంతో పేరున్న నటీనటులు, టెక్నీషియన్లు, డైరక్టర్లు మొదలైనవారికోసం ఎగబడటం జరిగింది. 1950 లో యీ స్థితి అంతిమస్థాయికి పోయింది. క్రొత్త నటీనటులను తీసుకురావటంలో టెక్నీషియన్లను అభివృద్ధిపరచుకోవటంలో హాలీవుడ్ అనుసరించుచున్న విస్తృత పద్ధతిని మననిర్మాతలు గుర్తించలేదు. ఈనాడు పరిశ్రమలో అందరికంటె ఎక్కువ పెట్టుబడులు, స్టుడియోలు కల సంస్థలు కూడా ఆ కార్యక్రమాన్ని కొనసాగించుటలేదు.

1950 లో పరిశ్రమ ఎంతో ఉచ్ఛస్థితికి పోయింది. నిర్మాతలు, డిస్ట్రిబ్యూటర్ల సంఖ్య పెరిగింది. క్రొత్త నటీనటులు కూడా వచ్చారు. కాని పరిశ్రమ స్థాయినిబట్టి నిర్మాతలు, స్టుడియోల సంఖ్యనుబట్టి నటీనటులు పెరుగలేదు. తారల పద్ధతి అమలులోనికి వచ్చింది.

1950-53 లో 88 మంది నిర్మాతలు, 57 గురు డిస్ట్రిబ్యూటర్లు ఉండేవారు. 327 ప్రదర్శన కేంద్ర

ములలో 458 ప్రదర్శనశాలలు వుండేవి ఆంధ్రదేశంలో సుమారు 110 తాలూకాలలో తాలూకాకు ఒక ప్రదర్శనశాల అయినా వుండేది. అంత ఉచ్ఛదశను అందుకొన్న పరిశ్రమకు తరువాత సంవత్సరాలలో పరిస్థితులు మారిపోయాయి. అంతకుముందు చిత్రాలు ఎక్కడో ఒకటి తప్ప పూర్తిగా అపజయం పొందేవి కావు. అనంతరదశలో ఈ పరిస్థితి తలక్రిందులై ఏ ఒక్క చిత్రమో తప్ప మిగతావన్నీ అపజయం పొందసాగాయి.

## ప్రచారం

1950 కి ముందు వార్తాపత్రికలలో ప్రచారం అధికంగా ఉండేది. చిత్రానికి 40 వేల రూపాయిల వరకూ ఖర్చు పెట్టేవారు. తరువాత 10 వేల రూపాయిలకు వార్తాపత్రికలో ప్రచారం తగ్గించివేశారు. గోడలమీద పోస్టర్ల సంఖ్య పెరిగింది. యుద్ధంవల్ల తగ్గిన పోస్టర్ల సంఖ్య మళ్ళీ విపరీతంగా పెరిగింది దీనికి కొంతవరకు నిర్మాతలు, డిస్ట్రిబ్యూటర్లు గొలుసుకట్టు పద్ధతిలో అనుబంధ పరిశ్రమలను —లిథో ప్రెస్సులు, ప్రింటింగు ప్రెస్సులు మొదలైనవాటిని, అభివృద్ధి చేసుకోవటం, కారణం. సామితియులైన పెట్టుబడులతో పరిశ్రమలో ప్రవేశించిన నిర్మాతలు ప్రచారాన్ని పూర్తిగా ప్రదర్శకుడిపైన పడవేయటం మరొక ముఖ్య కారణం. ఈ స్థానిక ప్రచారపు పద్ధతులైన పోస్టర్లు, కరపత్రాల ప్రచారం కారణంగానూ, వార్తాపత్రికల ప్రచారం ప్రణాళిక ననుసరించి లేకపోవటంవల్లనూ ప్రచారం లేకపోయినా పేరున్న నటీనటులు చిత్రంలో నటించితే మొదటి వారంలో చాలా మంచి ఆదాయం వస్తుందని పరిశ్రమలోని అన్ని శాఖలలోనివారూ నమ్మసాగారు. దానివలన పేరున్న నటీనటులు వుంటే డిస్ట్రిబ్యూటరు వస్తాడు, ప్రదర్శకుడు చిత్రాన్ని తీసుకొంటాడు అన్న అభిప్రాయం ప్రబలింది. ఇది క్రమేపీ నటీనటులను ప్రచారంకోసం వాడుకొనే విధానాన్ని అమలులోనికి తెచ్చింది.

ఈ పరిస్థితులలో పరిశ్రమలోని వివిధశాఖలలో మార్పులు చాలా వచ్చాయి. ఆర్థిక సంక్షోభం థియేటర్ల సంఖ్య తగ్గిపోవటం, ఆంధ్ర చలనచిత్రములకు మార్కెటు తగ్గిపోవటంతో పరిశ్రమలోని అన్ని శాఖలూ చాలా మార్పులకు లోనయ్యాయి.

## నిర్మాతలు

నిర్మాతలలో పైన వివరించినటుల కొద్ది పెట్టుబడులతో నిర్మాణం సాగించుతున్నారు. క్రింది లెక్కలు పరిశీలించితే నిర్మాతల సంఖ్యలోని మార్పులు గమనించవచ్చు.

| | జనవరినుండి అక్టోబరు ఆఖరు వరకు 1953–1954 |
|---|---|
| సాంఘిక చిత్రాలు | 16 - 15 |
| జానపద చిత్రాలు | 8 - 7 |
| ఆర్థికంగా విజయం పొందిన చిత్రాలు | 6 - 3 |
| క్రొత్తగా పరిశ్రమలోకి వచ్చి పూర్తిగా నష్టపడిన తెలుగు నిర్మాతలు | 5 - 3 |
| ఆంధ్రేతర నిర్మాతలు | 13 - 8 |

డిస్ట్రిబ్యూటరు దొరికితే చిత్రాలు తియ్యాలనుకుంటున్న నిర్మాతలు చాలామంది తయారయ్యారు. వీరిని స్టుడియో నిర్మాతలు, అనుభవం వున్న నిర్మాతలు, వ్యక్తి నిర్మాతలు, టెక్నీషియన్ నిర్మాతలుగా విభజించవచ్చును.

## స్టుడియో నిర్మాతలు

స్టుడియో నిర్మాతలు తీసుకుంటున్న కథా సంవిధానాలు పరిశీలించితే 1954లో పౌరాణికాల వైపు మొగ్గు కనబడుతున్నది. విజయావారు శశిరేఖా పరిణయం, భరణీవారు విప్రనారాయణ, శ్రీకృష్ణ తులాభారం, గోహిణీవారు అమృతహస్తంలాంటి జానపదాలు, ఎ. వి. యం. వారు సావిత్రి లాంటి చిత్రాలు నిర్మించుతున్నారు. మొత్తం నిర్మాణంలో వున్న 40 చిత్రాలలోను 10 వరకు పౌరాణికాలు వున్నాయి. ఒకసారి నిర్మించబడి డబ్బు చేసుకొన్న పౌరాణిక చిత్రాలను టెక్నికల్‌గా పెంపొందించి బ్రహ్మాండమైన సెట్టింగుల హంగామాతో, కెమెరా ట్రిక్కులతో మళ్ళీ తీస్తున్నారు. ప్రేక్షకులను ఆశ్చర్య సంభ్రమాలలో ముంచెత్తే పోరాట చిత్రాలను గాని, పెద్ద నటీనట సముదాయంతో ఊహాచిత్రాలను గాని, నిర్మించుతున్నారు. వీరు హాస్యం, వినోదం, చిత్ర నిర్మాణానికి సూత్రాలుగా భావిస్తున్నారు. అంతే కాని షావుకారు, దేవదాసు, పల్లెటూరు, పెదరైతు, సంసారంలాంటి ఉత్తమచిత్రాలు నిర్మించి ప్రేక్షకులలో మానవత్వాన్ని పెంపొందించే ప్రయత్నం చేయటం లేదు. వాస్తవిక చిత్రాలను తీయటంగాని, చౌకలో చిత్రాలను తీయటంగాని లేదు. తమ స్టూడియోలలో అదనపు ఉత్పత్తిగా (*Bye Product*) 2 రీళ్ళ హాస్య, విద్యా, డాక్యుమెంటరీ ఫీచర్లు తీసి ఎమెచూర్సుని ప్రోత్సహించి కొత్తమార్గాలను పరిశోధించటం లేదు. 17 వేల అడుగుల చిత్రాలు తీయాలని, తమ పేరువింటే ప్రేక్షకులు రావాలని భావి

స్తున్నారు. ప్రేక్షకుల అభిరుచిని అర్థంచేసుకోవటానికి ప్రయత్నించటంలేదు. హాలీవుడ్‌లాగా ప్రతి స్టుడియో ప్రతివారం ఒక సైమరీలును, చిత్రాన్ని యివ్వటానికి ఉత్పత్తిస్థాయిని, వేగాన్ని పెంచటానికి ప్రయత్నాలు జరగటంలేదు. పరిశ్రమలో యీనాడు వచ్చిన మేధాదారిద్ర్యం అనండి, లేక వెనక్కి నడిచే మన స్తత్వం అనండి, దాన్ని తొలగించుకోగల సాధనసంపత్తి వున్నా స్టుడియో నిర్మాతలు పూనుకోవటంలేదు. దీనికి కొంత కారణం కేంద్రీకృతమైన మూలపరిశ్రమ లక్షణాలు ఈ పరిశ్రమకు లేకపోవడమే కావచ్చు. సరస్వతీ టాకీసు లిమిటెడ్, సారథీ ఫిలిమ్సు లిమిటెడ్, పూర్ణా పిక్చర్సు లిమిటెడ్, విజయా ప్రొడక్షన్సు లిమిటెడ్ వాహినీ పిక్చర్సు లిమిటెడ్ లాంటి కంపెనీలు తప్ప వేరే విజయవంతముగా నడిచిన లిమిటెడ్ కంపెనీలు చాలా కొద్ది.

## అనుభవం వున్న నిర్మాతలు

వీరు నిర్మాణకాలం పొడిగించినా కొంతవరకు భావపూరితములైన చిత్రాలను తీస్తున్నారు. వాహినీ వారి పెద్దమనుష్యులు, ప్రకాశ్ వారి దీక్ష, రాజరాజేశ్వరివారి పేదరైతు, వినోదావారి దేవదాసు మొదలైనవి యిందుకు ఉదాహరణలు అలాగే బంగారు పాప, అన్నదాత, సంతానం, కన్యాశుల్కం చిత్రాలలో పైన వివరించిన లక్షణాలు వుంటాయని ఆశించవచ్చు. వీరు చిత్రాలకు సామాన్యంగా ఉత్తమ సాహిత్య కథలను ఆధారంగా తీసుకొంటున్నారు. వీరి చిత్రాలలో మంచి సంగీతాన్ని పెడుతున్నారు పెద్దమనుష్యులలో తెలుగు పల్లెపాటల ట్యూనులు ప్రజలలో ఎంతో విరివిగా వ్యాపించాయి.

## వ్యక్తి నిర్మాతలు

వీరి విషయం చాలా జాగ్రత్తగా పరిశీలించాలి. వీరి పెట్టుబడులు చాలా పరిమితాలు. వీరు తమ శ్రమనుకూడా పెట్టుబడుల క్రిందకు మార్చుకొంటారు. పరిశ్రమ స్వభావాన్ని బట్టి, వీరి ఆర్థిక పరిస్థితులనుబట్టి క్రిందివిధంగా విభజింపవచ్చును.

బి. యస్. రంగా, రెహమాన్, బోళ్ల సుబ్బారావులాంటి టెక్నీషియన్ నిర్మాతలు, వినోదా, సాహిణీలాంటి కోపరేటివు నిర్మాతలు, శ్రీమతి అంజలి, కాంచన, రామారావులాంటి నిర్మాతలుగా మారిన నటీనటులు, ఉత్తమ ఆదర్శాలతో పరిశ్రమలోనికి వచ్చినవారు.

వీరు పరిశ్రమలో కొత్త సంప్రదాయాలను పెంపొందించారు. నిర్మాణంలో వేగం పెంచివేశారు. పరిశ్రమలోని దుస్థితిని అర్థంచేసుకున్నారు. పబ్లిసిటీకోసం, డిస్ట్రిబ్యూటరుకోసం, ఒకరో, యిద్దరో పేరుపొందిన నటీనటులను తీసుకుని చిత్రనిర్మాణాన్ని తక్కువ సెట్లతోను, తక్కువ కాల్ షీట్లతోను పూర్తి చేసున్నారు. వాస్తవికతకు దూరంగా పోతే నిర్మాణపు ఖర్చులు పెరుగుతాయని గ్రహించారు. స్క్రిప్టు పైన ఎక్కువకాలం వినియోగించలేక, కొంత సెక్యూరిటీ కావాలి గనుక (*Minimum Guarantee*) విజయవంతముగా నడిచిన ఇతర భాషాచిత్రాలను, సెంటిమెంటు చిత్రాలను ఆధారంగా చేసుకుని చిత్రాలు నిర్మించుతున్నారు. ఉత్తమసాహిత్య కథలను ఆధారంగా చేసుకొంటున్నారు. డిస్ట్రిబ్యూటర్లు కూడా తక్కువ పెట్టుబడులు కావటంతో, ఆర్థిక సహాయం చేస్తున్నారు. వీరు పేరున్న టెక్నీషియన్ల కోసం కాలం వృధాపరచటం లాభంలేదని గుర్తించారు. ఈ దృక్పథం పరిశ్రమ పెంపుదలకు ఎంతో సహాయకారిగా తయారయింది.

అయితే నియమితములైన పెట్టుబడులు కావటంతో నిర్మాణవేగం పెంచటంవలన కొన్ని చెడు లక్షణాలు కూడా పరిశ్రమలో ప్రవేశించాయి ప్రతి టెక్నీషియను ఎక్కువ కాల్ షీటు పనిచేయటం, ఖర్చులనుగురించి తాపత్రయపడటంతో చిత్రంస్థాయి కొంత నష్టపడుతోంది. ఇతర భాషాచిత్రాల అనుకరణకే తాపత్రయపడటంవల్ల తెలుగు జాతీయతను, తెలుగుజాతి ప్రత్యేకతలను, చిత్రాలలో జొప్పించటం వారికి చాలా కష్టం అవుతున్నది. పెద్దమనుష్యులలోవలె తెలుగుజాతి సొంపును పోషించిన పల్లెపదాలు, మల్లేశ్వరిలాగా మన కళాభిరుచిని ప్రదర్శించే చిత్రాలు తీయాలంటే స్క్రిప్టు దశలో ఎంతో తీవ్రమైన కృషి, పరిశోధన, పరిశీలన, అవసరం.

ఈ సందర్భములో మన పరిశ్రమలోని ప్రముఖుల సంఖ్య హాలీవుడ్ సంఖ్యలతో పోల్చిచూద్దాం.

| | | తెలుగు | హాలీవుడ్. |
|---|---|---|---|
| నిర్మాతలు | ... | 36 | 26 + 20 |
| దర్శకులు | ... | 42 | 221 సీనియర్లు |
| | | | 223 జూనియర్లు |
| రచయితలు | | 28 | 1000 |
| కళాదర్శకులు | | 12 | 159 |
| సంగీత దర్శకులు | | 17 | |
| నటీనటులు | | 150 | 40000 |
| ఎక్స్ట్రాలు | | 1000 | |

*హాలీవుడ్‌లో సంగీత దర్శకుల సంఖ్య ప్రత్యేకంగా లేదు గాని, ఫిలిం సంగీతం యిచ్చేవారి సంఘంలో సభ్యులు 1,80,000 మంది. కంపోజర్సు సంఘంలో 159 మంది వున్నారు. దీనినిబట్టి సంగీత దర్శకుల సంఖ్య ఎంత ఎక్కువగా వుంటేది అంచనా వేయవచ్చును.

పై సంఖ్యలు పరిశీలించితే మన పరిశ్రమలోని ప్రముఖుల సంఖ్యలోని విపరీతాలు అర్థమవుతాయి. స్క్రిప్టు రచయితలకంటె డైరెక్టర్ల సంఖ్య ఎక్కువగా వుంది. స్క్రిప్టుదశలో తీవ్రమైన పరిశీలన, పరిశోధన వున్నప్పుడే షూటింగు పూర్తి స్వభావం. పని విభజన, కార్యక్రమ ప్రణాళిక పూర్తిగా కాగితంపై తయారవుతాయి. సెట్టుపైకి వచ్చి రిహార్సల్సు వేయటం, డైలాగులు మార్చటం, లైటింగు, కెమెరా యాంగిల్సు ఏర్పాటుచేయటంలాంటివి జరుగకూడదు. ఈలాంటి మార్పులు చేయటంవల్ల నిర్మాణపు ఖర్చులు పెరుగుతాయి అన్నిటికంటె ముఖ్యమైనది యీ మార్పులలో కథాగమనం నాశనమౌతుంది.

సీక్వెన్సులు, మారిపోవటంతో రచయిత "పార్ములా" ప్రకారము వ్రాసినప్పుడు కూడా కథాగమనాన్ని అదుపులో వుంచుకోవటం దుర్ఘటం. సరియైన ప్లానింగు స్క్రిప్టుదశలో జరగకపోవటం తక్కువ ఖర్చు అయ్యేదశలో జాగ్రత్తలేకపోవటం, ఎక్కువ వ్యయమయ్యే షూటింగుదశలో హడావుడిగా జరగటం మన పరిశ్రమస్వభావమయింది. స్క్రిప్టునుబట్టి డైరెక్టరు షూటింగు జరపటం కాకుండా షూటింగుదశలో వున్న కొద్దికాలంలో హడావుడిగా డైలాగులు మార్చటం, సీక్వెన్సులే మార్చటం, తనకు యిష్టం వచ్చినవాటిని కలుపుకోవటం ఆఖరు నిమిషంలో డిస్ట్రిబ్యూటరు కోరేడాన్సులు, హాస్యం అతికించటం, కొందరు దర్శకులకు స్వభావంగా మారింది. చిత్రంలో కథాగమనం సరిగా వుంచటంకూడా ఒక గొప్పవిషయంగా ప్రేక్షకులు, విమర్శకులు అనుకొనే అధోగతికి, చిత్ర పరిశ్రమను తీసుకుపోయారు. చిత్రానికి ప్రధానంగా వుండవలసిన మామూలు ప్రాథమిక లక్షణాన్ని ఎంతో ఆశ్చర్యపడే విషయంగా మార్చివేశారు.

* హాలీవుడ్ సంఖ్యలు *International Motion Picture Almanac 1945 - 46* నుండి తీసుకోబడ్డాయి. తెలుగు సినిమా సంఖ్యలు తెలుగు ఫిలిం డైరీనుండి తీసుకోబడ్డాయి.

ఈ కారణాలవల్ల ఒకేమాదిరి జానపదగాథలు కుటుంబ గాథలు, అనేకం వచ్చాయి. పరిశ్రమ అధోగతికి దారితీశాయి. కాల్‌షీట్ కార్యక్రమంలో పూర్తిగా పనిని విభజింపకపోవంటతో కాల్‌షీటులో 2 లేక 3 షాట్లకంటే ఎక్కువ తీయటం గొప్పగా తయారయింది. ఈ మధ్య జపాను పర్యటన గావించి వచ్చిన పటేల్ మాట్లాడుతూ జపానులో రోజుకి 70 షాట్లవరకు తీస్తారని, 15 రోజులలో చిత్రం షూటింగు పూర్తి అవుతుందని షూటింగు స్క్రిప్టు ప్రింటుచేసి నటీనటులకు, టెక్నిషియన్లకు యిస్తారని వివరించారు.

సెట్టుపైకి వచ్చిన తరువాత మార్పులు చేయరని దీనినిబట్టి గ్రహించవచ్చును. నేడు చిత్రనిర్మాణానికి సర్వాధికారిగా తయారైన దర్శకుడు రచయితను వాడుకోకుండా అణచివేయటం జరుగుతోంది. షూటింగు స్క్రిప్టు అంటే డైలాగులన్న భావం పెరిగింది. అదే పరిస్థితులలో వ్యాపారదృష్టి లేకుండా, అనుభవం లేకుండా పరిశ్రమచేత ఆకర్షింపబడిన ధనికయువ నిర్మాతలు పరిశ్రమ ఒడిదుడుకులకు కారణభూతులయ్యారు. అర్థంలేని అనుకరణవలన పరిశ్రమ చాలా దెబ్బతింది. ఈ పరిస్థితిని వ్యక్తి నిర్మాతలు చాలావరకు మార్చారు. విజయవంతంగా నడచిన ఇతర భాషాచిత్రాల్ని అనుకరించటంచేత తక్కువ సెట్లు, కాల్‌షీట్లతోను అయ్యే ప్రఖ్యాత సాంఘిక గాథలను (స్టుడియో నిర్మాతలులాగా పౌరాణిక గాథలు కాకుండా) ఎన్నుకొని స్క్రిప్టు దశలోనే సర్వం నిర్ణితం చేసుకుంటున్నారు. వీరి చిత్రానికి ఆధారముగా తీసుకోబడ్డవారే కొంత శ్రమించినందువలన వీరికి కొంత ఖర్చు తప్పింది

మ పరిస్థితిని అర్థంచేసుకొన్నా వ్యక్తి ఎమెచూర్సుని ప్రోత్సహించలేక పోతున్నారు. నిర్మాణంలో వేగం పెంచాలంటే అనుభవంవున్న నటీనటులు పనిని తొందరగా ముగించుతారు. ఎమెచూర్సు ఎక్కువకాలం తీసుకోవటం వలన కాల్‌షీట్ల ఖర్చు పెరుగుతుంది. ఈనాటి ఆర్థిక పరిస్థితి దీనికి ప్రతిబంధకముగా ఉంది. కుతూహలం వున్నా నియమితములైన పెట్టుబడుల కారణంగా ఎమెచూర్సుని ప్రోత్సహించటంలేదు.

## సంక్షోభసమయంలో పరిశ్రమలో 'మొనాపలీ' నిర్మాణం

చలనచిత్రపరిశ్రమలో 'మొనాపలీ' స్వభావం మిగతా పరిశ్రమలలాగా లేదు. పెట్టుబడులు, ప్రయి

వేటు లిమిటెడ్ కంపెనీలు, జాయింటుస్టాకు కంపెనీలలో షేర్ల రూపంలో కాకుండా వ్యక్తిగతంగా నియమిత పెట్టుబడులు కలిగిన వ్యక్తులు సరాసరిగా పరిశ్రమలో ప్రవేశించుతున్నారు ఈలాంటివారిని ఆకర్షించటానికి స్టుడియోలు, టెక్నిషియన్లు, నటీనటులు కృషిచేస్తున్నారు. కనుక నే పనివున్న స్టుడియోలలో పని అధికమవటం, రెండు స్టుడియోలు చేతులు మారబోవటం, తొరల రెండు స్టుడియోలలో యితరులు చిత్రాలు తీయకపోవటం జరుగుతున్నది. పెద్దస్టుడియోలకు అంటిపెట్టుకున్నవారు తొందరగా చిత్రాలు తీయటం జరుగుతోంది. స్టుడియోవారు వ్యక్తినిర్మాతలతో చేతులు కలిపి చిత్రాలు నిర్మించటం ఆంధ్రుల స్టుడియోలు చేయటంలేదు స్టుడియోలపై అధికారంలేని వ్యక్తినిర్మాతలకు కాల్ షీట్లు ఆయాస్టుడియోలలో సరిగా యివ్వకపోవటంతో కొన్ని సందర్భాలలో నిర్మాణం ఆలస్యమయినసంఘటనలుకూడా ఉన్నాయి. ఈ కారణాల వల్ల తెలుగు వ్యక్తినిర్మాతలు తమిళ స్టుడియోలలో చిత్రాలు నిర్మించటం గమనార్హం.

## డిస్ట్రిబ్యూషను

1950 లో 57 సంస్థలుంటే 1953/54 సంవత్సరానికి 7 సంస్థలు తప్ప మిగతావన్నీ జీర్ణావస్థకు వచ్చాయి. చిత్రాలను వివిధకేంద్రాలలో విడుదల చేయటానికియీ 7 సంస్థలు తప్ప మిగతా సంస్థలకు చాలాకిపత ఏర్పడ్డది. క్రొత్తగా పరిశ్రమలోనికి డిస్ట్రిబ్యూటరుగా గాని, ప్రదర్శకుడుగా గాని రావటం చాలా కష్టంగా తయారయింది.

## ప్రదర్శన

పేరున్న డిస్ట్రిబ్యూటరుకు సంబంధించిన వారికే చిత్రాలు దొరకటం మిగతా ముఖ్య కేంద్రాలలోని ప్రదర్శకులకు రోజు ఖర్చులుకూడా రాకపోవటం గమనించవచ్చు. అయితే ప్రదర్శకుల గొలుసుకట్టు (*Chain theatres*) పెరగలేదు. 1950 కి పూర్వం వచ్చిన సరస్వతి సర్క్యూట్ వారికి 4 కేంద్రాలలోను, రాజా వెంకట్రామయ్య సర్క్యూట్ కు 4 కేంద్రాలలోను, నిడమర్తి సర్క్యూట్ కు 3 కేంద్రాలలోను, బి. క్లాసు కేంద్రాలలో సోమరాజు సర్క్యూట్ కు 6 కేంద్రాలలోను, తప్ప వేరే థియేటర్లకు గొలుసుకట్లు, ఇతర రాష్ట్రాలలాగా మన రాష్ట్రంలో పెరగలేదు. కాని వ్యాపారానుభవం లేని ధనికులు ముఖ్యంగా యువకులు ప్రదర్శకులుగా చాలామంది వచ్చారు. తీవ్రమైన పోటీ తీసుకువచ్చారు. ఎక్కువ హాలులువున్న కేంద్రాలలోనే హాలులు నిర్మించటం, ఒక టూరింగు హాలు సరిపోయే కేంద్రములో వేరొక టూరింగు ఏర్పాటు చేయటం ద్వారా పరిశ్రమలో తికమకలకు దారితీశారు ఉదాహరణగా విజయవాడలో 11 హాలుల నిర్మాణం. ప్రదర్శన పద్ధతుల అభివృద్ధి మానివేసి పోటీ పెంచివేశారు. 1950 నుండి 53 కల్లా వీరి పోటీ పరిశ్రమపై ఎంతో దెబ్బతీసింది 1950 లో 327 టూరింగులు, 131 పర్మనెంటు హాలులు వుంటే 1953 లో 227 ఎక్కువ పెట్టుబడులు అవసరమైన పర్మనెంటు హాలులు పెరిగాయి. తక్కువ పెట్టుబడులు అవసరమైన టూరింగుల సంఖ్య 101 కి పడిపోయింది. పర్మనెంటు హాలుకు 1 50.000 రూపాయిలు అవసరమైతే టూరింగుకు రూ 30,000 సరిపోతుంది టూరింగులు చాలవరకు చిన్నచిన్న కేంద్రాలలో ఉండేవి. అదనంగా వచ్చిన పర్మనెంటు హాలులు ముఖ్య కేంద్రాలలో మాత్రమే వచ్చాయి కాని చిన్న కేంద్రాలలో రాలేదు. అందువల్ల చిన్న కేంద్రాల సంఖ్య బాగా దిగజారిపోయింది 1950 లో సుమారు 400 కేంద్రాలు వుండేవి. 1953 లో 170 కేంద్రాలకు మించిలేవని గుర్తించితే పరిశ్రమకు వచ్చిన క్రొత్తసమస్యలు, హద్దులు అర్థమవుతాయి 1950 సంవత్సరములో ఎ, బి, సి, ముఖ్యకేంద్రాలు అయిన తరువాత 50 వేల రూపాయిలవరకు ప్రతి చిత్రం మీదా వచ్చేది. అటువంటి పరిశ్రమలో నేడు 10,000 రూపాయిలుకూడా రావటంలేదు. ప్రదర్శన కేంద్రాలు నిర్దిష్టమవటంతో చిత్రాలను ముఖ్యకేంద్రములకోసం తీయటానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. చిత్రాలలో పట్టణ వాతావరణము పెరగసాగింది ఒకప్రక్క ఆర్థికపరిస్థితి పిడికిలిలో వున్న పరిశ్రమలో వేరొక ప్రక్క 'మొనాపలి' పెరుగుతోంది.

అయినా పరిశ్రమ యీనాటి పరిస్థితిలో మొనాపలి ఎంత పెరిగినా వ్యక్తినిర్మాతలు పూర్తిగా పోరు. దీనికి ముఖ్యంగా చెప్పకోదగ్గ కారణం వారి నిర్మాణ సూత్రాలు. వ్యక్తినిర్మాతలు చౌకలో కొద్ది ఖర్చులతో చిత్రాలు తీయటం, వారు టెక్నీషియనులు, నటీనటులు కోపరేటివు పద్ధతిలో తీసేవారు కావటం వలన వారు తమ శ్రమను పెట్టుబడులుగా వాడటం వలన వారు పరిశ్రమలోంచి పోరు. కనుక స్టుడియో నిర్మాతల పోరాటచిత్రాలు, ఊహాచిత్రాలుమాత్రమే కాకుండా వ్యక్తిగత నిర్మాతల వాస్తవిక చిత్రాలు, సెంటిమెంటు చిత్రాలు మన పరిశ్రమలోకి వస్తాయి.

## చలన చిత్రపరిశ్రమకు గల ఆర్థికాది వివరాలు

ఇతర పరిశ్రమలలోనూ వ్యాపారాలలోనూ పెట్టుబడికంటె 3, 4 రెట్లు వ్యాపారం జరుగుతుంది. కాని యీ పరిశ్రమలో అది వీలుకావటం లేదు. మిగతా పరిశ్రమలకు బ్యాంకు ఏర్పాటులు, తాకట్టు ఏర్పాటులు వుంటాయి. కాని ఫిలిం పరిశ్రమలో అది వీలుకావటం లేదు. కేంద్రీకృతమైన పరిశ్రమగా పెంపొందకపోవటంవల్ల యీ యిబ్బందులు మరీ ఎక్కువయ్యాయి. స్టూడియోలపైన 1/10 కూడా బ్యాంకు సౌకర్యాలు దొరకవు. ప్రదర్శనశాలపైన 1/8 కూడా బ్యాంకు సౌకర్యాలు దొరకవు. 2 లక్షల రూపాయిలతో హాలు నిర్మించితే చివరదశలో అవసరమయ్యే రూ 25,000 కూడా బ్యాంకులు తాకట్టుమీద డబ్బు యివ్వవు. చిత్రం అంతా నిర్మించబడి ప్రింటులను తాకట్టుపెట్టినా బ్యాంకులు ఏమీ డబ్బు యివ్వవు. లక్షలకొద్ది డ్రాఫ్టులను వివిధకేంద్రాలలో రిప్రజెంటేటివులు ప్రదర్శకులదగ్గరవచ్చే డబ్బును జమ కట్టుతున్నా, పెద్ద టరన్‌వోవరు చూపుతున్నా, డిస్ట్రిబ్యూటర్లకు వోవర్ డ్రాఫ్ట్ బ్యాంకులు యివ్వవు. దీనికి ముఖ్య కారణం యీ పరిశ్రమలో నమ్మకం (*Minimum Guarantee*) లేకపోవటం. చిత్రం విజయవంతమయ్యేది లేనిది తెలియక పోవటం. స్పెక్యులేషన్, గుర్రపు పందాల స్వభావం, లక్షణాలు కలిగి కేంద్రీకృతం కాని పరిశ్రమ అని గ్రహించితే ఆశ్చర్యం కలిగించే ఈ పరిస్థితులు అర్థమవుతాయి. ఈ పరిశ్రమలోని చాలామంది వ్యక్తులు ఇతర పరిశ్రమలు, వ్యాపారాలలోలాగ మాట నిలబెట్టుకోరు. అందువల్ల నూటికి రూ 3. నెలకు వడ్డీకి తేవటం చిత్రాలపై రాయల్టీలను యివ్వటం అలవాటయిపోయింది. ప్రొడ్యూసర్లు ఎక్కువ వడ్డీకు ప్రయివేటు వడ్డీ వ్యాపారస్తులదగ్గర అప్పులు తేవటం సహజమయిపోయింది. ఇతర పరిశ్రమలవారు యీ పరిశ్రమపై వాడే హాస్యపూరితములైన మాటలు ఎన్నో వున్నాయి.

## చిత్రాల విడుదలలోని అరాచకం

పైన వివరించిన ఆర్థికములైన చిక్కులు కారణంగానే చిత్రాలను విడుదలచేయటంలో అరాచకం పెరిగింది. ఒకేరోజున 2 చిత్రాలను విడుదలచేయటం చిత్రం దెబ్బ తింటుందని తెలిసికూడా విడుదలచేయటం ఈ ఆర్థికపరిస్థితుల గొడవలు కారణంగానే.

## పనివారి స్థితి

ఫ్యాక్టరీల చట్టంగాని, షాపు అసిస్టెంట్ల చట్టంగాని ఏదీ కూడా అమలు జరగటంలేదు. పనివారలకు సెక్యూరిటీ లేదు. గ్రాట్యుయిటీ, ప్రావిడెంటు ఫండు ఏర్పాటు లేదు. పరిశ్రమలో పనివారల పనులు, ఉద్యోగాలు ఎప్పుడు వుంటాయో ఎప్పుడు పూడతాయో ఎవరికీ తెలీదు. ఇది కూడా పరిశ్రమ ఆర్థిక లక్షణాన్ని తెలియజేస్తుంది.

ఆర్థికపరిస్థితులతో పెనవైచుకొని వివిధపోరణులతో పెరుగుతున్న చలనచిత్ర పరిశ్రమ ముందు ముందు చక్కటి మేధావుల్ని సృష్టించుతుంది. స్వతంత్ర గాథలు, వాస్తవిక చిత్రాలు, సెంటిమెంటు చిత్రాలు, చాలావస్తాయి హిందీ ట్యూనుల కాపీలు కాకుండా తెలుగుపదాల సొంపుతో మేళవించుకొంటూ ట్యూనులు వస్తాయనటానికి ఇటీవలి చిత్రాలను కొన్నిటిని ఎత్తి చూపవచ్చును. అదనపు ఉత్పత్తి (*Bye Product*) గా 2 రీళ్లు చిత్రాలు రావాలసిన స్థాయిలోనికి పరిశ్రమవస్తోంది. కనుక అనేకమంది క్రొత్త టెక్నీషియన్లు, నటీనటులు వస్తారు. ఆంధ్ర చిత్రాలకు ఇతరరాష్ట్రాల మార్కెటుతగ్గినా దేశీయమైనమార్కెటు పెరగటానికి అవకాశముంది, కనుక పరిశ్రమ పెరగటానికి ఎంతో అవకాశముంది. నిర్మాణపు ఖర్చులు మద్రాసులో పెరగటంచేతను ఇతర భాషారాష్ట్రాలైన మహారాష్ట్ర బెంగాలులలోలాగా చౌకలో చిత్రాలు రావలసిన ఆవశ్యకత వున్నందువల్లనూ ఆంధ్రదేశంలో స్టుడియోల నిర్మాణానికి అవకాశం వుంది. తగ్గిపోయిన ప్రదర్శనశాలలను పెంపొందించాల్సిన అవసరం ఎంతోవుంది. తక్కువ పెట్టుబడులతో తయారయ్యే 16. మి. మి. ప్రొజక్టర్ల థియేటర్లు ప్రతిగ్రామంలో రావటానికి మార్గాలు పరిశోధించాలి. అప్పుడు ప్రింటు ఖరీదు 2000 రూపాయిల నుండి 350 రూపాయిలకు తగ్గటంతో పెట్టుబడులు తగ్గి పరిశ్రమకు అదనపు ఆదాయం (*Surplus*) రావటానికి ఆస్కారం ఏర్పడుతుంది. నిర్మాతలు కూడా ఒక షెడ్యూలు ప్రకారం నియమితకాలంలో చిత్రాలను నిర్మించటానికి ప్రయత్నించినపుడు విడుదలలోని అరాచకం మొదలైనవి పోతాయి. పరిశ్రమ స్వభావాన్ని లక్షణాలను అర్థం చేసుకున్నప్పుడు సినిమా పరిశ్రమ ఆంధ్రదేశంలో చక్కగా అభివృద్ధి చెందటానికి ఎంతో అవకాశం ఉంది.










# లైఫ్ బాయ్ సబ్బు

ప్రతిదిన మలినములోని క్రిములనుండి మిమ్ములను కాపాడును




ఇండియాలో తయారుచేయబడినది

L. 248-X52 TL

కథానిక

# అతను ఇక రాడు

## శ్రీ కొనకళ్ల వెంకటరత్నం

చంద్రరావు శివాలయానికి వెళ్ళి, పరమేశ్వరదర్శనం చేసుకొని, చిల్లరదేవుళ్ళకు మొక్కి, నవగ్రహ ప్రదక్షిణ చేస్తూంటే ఎదురయింది శశిరేఖ. చేతిలో వెండిపూలసజ్జా, చెవిలో తులసీదళమూ, తడిసిన మల్లె మొగ్గలావున్నదామె. సెలవులకు ఇంటికొచ్చింది గావును అనుకున్నాడు చంద్రరావు. అతనికీ ఆమెకీ సంబంధం నిశ్చయమై పదిహేనురోజులయింది. పలకరిద్దామా అనుకున్నాడు. కాని అంతలో సిగ్గుల రామచిలక అయిపోయిందామె. ధ్వజస్తంభం పక్కనించీ తలవంచుకొని వెళ్ళిపోతూ తనవంక చూడకుండానే "ఒక్కమాట! ఇట్లా వస్తావా?" అని సాగిపోతూంది శశిరేఖ. చివుక్కుమన్నదతనికి. బి. యే. చదువుతోన్న తనకి నిశ్చయమైన వొక ప్రౌఢ అంత యేకాంతంగా తారసిల్లితే ఏదో వొకవంకని పలకరించాలిసిన చాకచక్యం తనకి లేకపోగా ఎదురు సిగ్గులతెర చీల్చుకొని ఆమే తనని పలకరించేసరికి తల కొట్టేసినట్టయిందతనికి. సరే—ఇహ తప్పుతుంది గనకనా — గంగిగోవులా కూడాపడ్డాడు. వెనకొతల గుడిమంటపం మెట్లమీద కూచున్నారిద్దరూనూ. అంతా నిశ్శబ్దంగా వున్నది. ఊరిచివర పంటకాలవ పక్కనే వుంది శివాలయం. సెజ్జలోవున్న శంఖుపుష్పాలూ పూకబంతిపువ్వులూ విడదీస్తో సుతారంగా మాటలకు దిగిందామె.

"నిశ్చయమయిందని నీకయినా తెలిసిందా బావా?"

"అదేమిటి? నీకు తెలియదాయేం?". —నెరజాణలా వుందే! ఇదో యుక్తిగావును!

మేనమామపోషణలో వుంది. తల్లీ తండ్రీ లేరు. చదువుకున్న పిల్లగదా! 'పెళ్ళి నిశ్చయించాము అని చెప్పనక్కర్లే?— లాంఛనప్రాయంగానైనా? 'ఒక్కోసారి పెద్దవాళ్ళకు మతులుండవు' అనుకున్నాడు.

"అయితే యిప్పుడేమంటావూ?"

"నాకిష్టం లేదు."

పిడుగు పడినట్టయిందతనికి. తనంటే ఇష్టం లేదట! యీ దొరసానికి! స్కూల్ ఫైనల్ చదువుతోందిగా గుంటూరులో. అప్పుడే యే లండను దొరనో పెళ్లిచేసుకోవాలనుకొంటోంది గావును. పౌరుషం బుస్సున పొంగుకొచ్చింది. తమాయించుకొన్నాడు.

"అయితే అట్లా చెప్పేసెయ్. ఇప్పుడు మునిగిపోయిందేముందీ?"

చక్కా పోతున్నాడు. తన నిరుత్సాహమూ, ఉక్రోషమూ ఎక్కడ ఘసికడుతుందోనని గుండె పీకుతోంది. ఆవిడ అందకత్తె అనీ చదువుకున్నదనీ— అట్లాంటి శశిరేఖ తనకి భార్య కాబోతోందనీ తను మురుస్తున్నమాట నిజం.

"నేనా చెప్పుకోవాలిసిందీ?" అంటోంది, ఉత్కంఠంగా.

ఆగాడు—

"నువ్వు కాకపోతే నేనా కలిపించుకోవాలిసింది—ఈ స్థితిలో — ఒక చెంపన తాంబూలాలు పుచ్చుకుని ముహూర్తం నిర్ణయమైపోయి శుభలేఖలచ్చయిపోయి—అటు మీ వాళ్లూ ఇటు మా వాళ్లూ పెళ్ళిపనులలో సతమతమవుతూంటే తగుదునమ్మా అని యిప్పుడు "నాకిష్టం లేదు" అని చెప్పవచ్చావా నువ్వు?"

"మొగాడవుకదా అని నాలిక ఎట్లా అట్లా తిప్పకు. ఈ తికమక లన్నిటికీ నువ్వే కారణం."

చివ్వున లేచింది. ఇదో తారాజువ్వ ప్రకృతిలా వుంది.

"నేనా?" తెల్లబోయాడతను.

"అవును—శశి బంగారుబొమ్మ—శశినే చేసుకుంటాను—శశి నా ప్రాణం అని నాలిక బజాన వేసుకొని తిరగటంలేదూ నువ్వు?"

అతను నేరస్థుడల్లే నిలబడ్డాడు. ఆమె అభియోగం, అక్షరాలా నిజం. ఆమె కిష్టంలేదని తన కేమి తెలుసూ—ఇష్టం లేనంతమాత్రాన తనని అలుసు చెయ్యాలి గావును—వూరికే తోముతోంది. చేసిన గాయాన్ని సీమ పచ్చిమిరపకాయతో కెలుకుతోంది పైగా. కాని జవాబు లోకువగా యివ్వకూడదు, అనుకున్నాడు.

"అవును నా కిష్టముంది కొబట్టి యిష్టమని చెప్పకున్నాను. నీ కిష్టం లేకపోతే లేదని చెప్పలేక పోయినావా?" అని విదిలించాడు.

"నన్నెవ్వరూ అడగలేదు"—మౌనం.

"అడగాలిట—బొట్టూ కాటికా పెట్టి పిలిచి అడగాలి గావును."

"నువ్వంటే యిష్టమయింది కొబటి కనబడ్డ వాడికలా పనిగట్టుకుని వళ్లి దారిన పొయ్యేవాడినల్లా జబ్బబట్టుకొని ఆపుచేసి మరీ వూటలూగుతో..."

అదిగో మళ్ళీ విజృంభిస్తోంది. దీన్ని పెళ్ళిచేసుకుని ఆ పొగరుకొస్తా దించెయ్యాలనిపిస్తోంది. కాని తన పొగరే దించుతుందేమో! గోల!

"నీ బుర్ర అంతవరకే పోయింది మరి. నాకు వచ్చిందని నేను వూటలూరుతో చెప్పకొంటే 'నాకు వచ్చలేదని నువ్వు మొహం చెండుకుంటూ చెప్పకోలేకపోయావా?'—కచ్చగా అన్నాడు.

"నిశ్చయం చేస్తారని అనుకోలేదుగా నేను. అంచేత నా కిష్టంలేదు అని చెప్పాలిసిన అగత్యమూ నాకు పట్టలేదు."

"అనుకుంటే వాల్ పోస్టరమీద రాయించి అంటించేదానవు. పాపం! అవునా?"

"తప్పకుండానూ"

అన్న పొగరు! చురుకూ చురుకూ చూస్తోంది పైగా! ఏమిచేస్తుందో మరి!

"నాకు తెలిసిందిగాదు మరి. ఏమిచెయ్యమంటావు చెప్పు?" అన్నది అంతలో కోపం దిగ మింగి.

"తెలియకపోతే తెలుసుకోవాలిసింది."

"మరిప్పుడు జరగాలిసిందేమిటట అని" లాలనగా ప్రశ్నిస్తోంది.

"తెలుసుకోలేదు గనక అనుభవించంతే" మళ్ళీ లేచాడు. రోగం కుదిరింది.

"కూచో మరి"—

కూచున్నాడు, నమ్రతగా—ఏదో దౌర్బల్యం ఏడిపిస్తోంది లోపల. వెళ్ళాలని లేదు. ఇష్టం లేకపోతే లేదని చెప్పెయ్యరాదూ తనవాళ్ళతో—దీనికి తన సలహా సంప్రతింపులు కావాల్నయేం?

"మీకుమాత్ర మక్కర్లేదండీ సార్ నా కిష్టమున్నదో లేదో...?"

మళ్ళీ వెటకారాలకి దిగింది!

"నా కక్కర్లేదు", పుల్ల విరిచినట్లు మొహాన్ని కొట్టాడు. నిజానికి ఆమె యిష్టపడే ఉంటుందనీ అంచేతనే పెళ్ళికి బప్పందం జరిగిందనీ అనుకున్నాడతను. లేకపోతే స్కూలుఫైనల్ చదువుతున్న పిల్లని, వయసొచ్చిన పిల్లని, ఆమె యిష్టానిష్టాలు కనుక్కోకుండా పెళ్ళి నిశ్చయం చెసి పారేస్తారని తనెల్లా అనుకుంటాడు?

"నీకక్కర్లేదూ?—బింకాలకు పోకు—నిన్ను చూచీ నీ అందం చూచీ మోహించాననుకున్నావ్ గావును—అవునా?"

కస్సున లేచాడు—

"మాటలు తిన్నగా రానీ—ఆడదానవు కొబట్టి సరిపోయింది లేకపోతే ఎంత దూరమైనా వళ్ళేది. నీ అంతస్తూ హద్దూ, చూచుకుని బుద్ధిగా మెలగడం నేర్చుకో—తెలిసిందా?"

"వాదం పెంచక నువ్వే ఏదో చెప్పి పెళ్లి ఆపు చెయ్యి—తెలిసిందా? నీ హితం కోరే చెపుతున్నా."

"నేను చెప్పను—చెప్పను.. ...ముమ్మాటికీ చెప్పను—నా కవసరం లేదు."

"ఇప్పుడేదో విధాన ఆటంకం కలిపించకపోతే పెళ్లి జరిగిపోతుందో యేమిటో" అన్నది సగం స్వగతంగా.

"జరగనూ జరుగుతుంది" అన్నాడు తొణుకూ బెణుకూ లేకండా—తనూ ఏడిపించగలనని ఆమెకి బాగా తెలియాలి—

ఇక వెళ్ళిపోతోంది—పూలసజ్జ అందుకొని, వెడుతూ వెడుతూ వో చిన్న బెదిరింపు!

"తరవాత విచారించినా లాభం లేదుసుమా. నువ్వంటే యిష్టంలేని ఒక కన్యని, యిష్టం లేదని— మళ్ళీ చాటునా మాటునా కాదు—నీ మొహంమీద కుండ బద్దలు కొట్టినట్టు చెప్పుకొన్న ఒక కన్యని పెళ్ళిచేసుకుంటే రాగల ప్రమాదం రవంత వూహించుకోవడం మంచిది"

అతని కోపం భగ్గుమంది. ఎంత మాటన్నదీ? సున్నితంగా దెబ్బకొట్టి తనూ లేచిపోవాలి.

"ఇదిగో అమ్మాయీ చెప్తా విను. ఇష్టంలేనిది నీకు. ఇష్టంలేదని చెప్పాల్సింది నువ్వు. సకాలంలో ఆమాట చెప్పకపోగా యిష్టమొచ్చినట్టు నాలిక పారే[illegible]; [illegible]; అయినా మించిపోయింది లేదు ఇప్పుడైనా యిష్టంలేదని మీవాళ్ళతో చెప్పు; చెప్పి పెళ్ళి తప్పించు నీకూ నాకూ శుభం నీ కిష్ట మున్నా లేకపోయి [illegible]గో [illegible]గు నిన్ను కవుగిలికి బలవంతాన తీసుకుంటానని నా కేమీ లేదు అట్లా చెప్పవూ, చెప్పక బింకాలు పోతావూ, నేనుమాత్రం చేసేదేమీ లేదు పెళ్ళి జరిగిపోతుంది. జరిగితీరుతుంది. ఆ తరవాత నిన్ను ఓ దాసిలాగానో, ఒక వుంపుడుకత్తెగానో చూస్తాను నిన్ను భార్యగా చూడను—చూడలేను. ఏ స్కూలుమాస్టరుగానో ఏ ఆసుపత్రి నర్సుగానో చెలాయిద్దామని చూస్తున్నావు గావును. నీ బతుక్కి ఏ చిత్రాంగి వీధిలోనో, ఏ సఫేదుగల్లీలోనో దుకాణం తెరవాలిసిన దుర్గతి పట్టిస్తాను. చూసుకో—రాగల ప్రమాదాన్ని వూహించుకోవాలి గదూ?"

చివాల్న లేచి సింహద్వారందాకా విసవిస నడిచాడు.

"ఒక్క మాట"

గిరుక్కున తిరిగి చూచాడు. వెక్కి వెక్కి యేడుస్తోంది పాపం! అట్లా దారికి రావాలి. కొంత స్థిమిత పడ్డాడు. లేకపోతే, పౌరుషాలు రెచ్చగొట్టి పని చేయించుకోవాలని చూస్తుందీ?

జాలి కలిగింది.

ఆ ధిక్కారంవెనక ఎంత బాధ, ఎంత ఆవేదన ఉన్నదో పాపం! తను కరిగిపోతున్నాడేమిటీ మంచు బిళ్ళలా? మగాడి కీలకం గ్రహించిందా? గ్రహించి యథోచితంగా ప్లేటు మారుస్తోందా? ఏమో దిక్కుమాలినగోల—ఏమయినా, అతనిలో దెబ్బతిన్న మగతనం కోలుకుంది.

దగ్గరగా వెళ్ళి నిల్చున్నాడు. జేబురుమాలతో కన్నీళ్లు తుడుద్దామా, అనుకున్నాడు. అగ్గిమీద గుగ్గిలం అవుతుందేమో—లేనిపోని కుమ్మరాం—అసలే ఈ అప్సరసకి తనంటే అయిష్టంట—

అరే—ఇంకా ఏడుస్తోందేమిటి? బావుంది తనేమి చేశాడని? నేరస్థుడల్లే బాధపడ్డాడు. అతని కేమీ పాలుపోలేదు.

వంగి, "అమ్మాయీ, ఎందుకట్లా ఏడుస్తావూ?" అన్నాడు వోదార్పుగా. కన్నీళ్ళు గబగబా తుడుచుకుంది.

"నామాట ఎవరూ లెక్కచెయ్యరు బావా! నేను చెప్పినా, ఆగదీ పెళ్ళి" అన్నది గాద్గదికంగా."

"ఎంచేత అని—అదీ నాకు పట్టుకుంట?" అని అడిగాడు కొంత సమాధానంగా.

"నేనొక అనాథనని నీకు తెలియదా? మా అమ్మ చనిపోతూ నన్ను అయిదేళ్ళపసికందుని, మా మామయ్య చేతిలోవుంచి హరీ అన్నది. ఆ బరువు తన భుజాలమీదనుంచి వొదిలించుకుంటున్నాడివాళ. నామాటకు విలువ ఏమి ఉంటుంది చెప్పు నువ్వన్నట్టే యిదివరకే ఏడవలేకపోయినావా యీ ఏడుపు అని రెండు మొట్టికాయలు మొట్టి పెళ్ళిపీటలమీద కూచోపెడతారు. కట్నాలూ కానుకలూ లేకుండా అతి చవుకగా నువ్వు దొరికావుగదా అని నన్ను వొదిలించుకోవాలని చూస్తున్నారు."

అదుగో—ఆ ఆఖరిమాటలు తనకెంత అవమానకరంగావున్నయ్యో తెలిసికోదు. అదీ వచ్చినచిక్కు. ఆ మెకళ్ళింకా మంచుతోనిండిన మల్లెపువ్వుల్లా వున్నాయి. ఆ కంఠస్వరంలో దీనత్వమూ, ఒక నిస్సహాయతా, ఒక్క మాటలో చెప్పాలంటే, ఆకర్షణ గల అబలాత్వమేదో తళుక్కుమని స్ఫురించిందతనికి.

ఆలోచించాడు.

"సరేలే, నేనే కలిపించుకుంటానులే, వెళ్లు" అని తల వంచుకున్నాడు. పూలసజ్జ చేతిలో పట్టుకుని వెళ్ళిపోతోందామె. మళ్ళీ చివుక్కుమన్నదతని హృదయం. ఆ నిష్క్రమణలో, విచారం తప్ప, తనయెడల చూపాల్సిన కృతజ్ఞతగాని, వొక అపాయంనుంచి తప్పించుకొన్న ఆహ్లాదవైఖరి గాని, అవుపడదేం? వెళ్ళిపోతోంది శశిరేఖ—బ్రతుకే శూన్యమైపోయిన ట్లనిపించిందతనికి—

రాత్రి 'షా' నాటకం చదివిన తరవాత లాంతరు తగ్గించి, రగ్గులో తలదూర్చి ఆలోచిస్తూ పడుకున్నాడు చంద్రరావు. కారాలు కొట్టీ, పప్పులు వేయించీ, అప్పుడా లద్దీ, ఇంటో అలిసి అంతా నిద్దరపోతున్నారు. తనకీ తల్లితండ్రులు చిన్నప్పుడే కరువయ్యారు. ఎటొచ్చీ, తన చదువూ పెళ్ళీ, పెత్తండ్రి రామయ్యే కొంత పట్టించుకుంటున్నాడు. పోతూ, పోతూ తనతండ్రి పడిపోతూవున్న పూరిపాక వొకటి ఈయన కప్పగించాడని వినికిడి. అది అమ్మగా వచ్చిన నాలుగు రాళ్లూ, తనకోసం వెచ్చిస్తున్నట్టు కనిపిస్తుంది. అది అంతనీ, ఇంతనీ తేల్చుకు నేందుకు తనకు దమ్ములు లేవు; ఎవరూ చెప్పరు. తన చదువుకి చిల్లిగవ్వ ఖర్చు కావటం లేదు. స్కాలరుషిప్పులతో నే గడిపేస్తున్నాడు. ఇక బి. యస్. సి. సమాప్తి కావాలి. తను కాకినాడలో వారాలు చేసుకొని తింటున్నట్టు ఎవరికీ తెలియదు. తన పోషణా, తన విద్యాదికాలూ, సొంత ఖర్చుమీద భరిస్తున్నట్టూ, తన పెళ్లీ, తన ఆలనా పాలనా అంతా తనభుజస్కంధాలమీద నే పడివున్నట్టూ పెత్తండ్రి వీలయినచోటల్లా గప్పాలు కొట్టుకుంటూ పోతున్నాడు. అవునని తనూ తలవూపేస్తున్నాడు. లేకపోతే 'నిజం ఫలానా' అని విడమర్చి చెప్పకుంటే, తనకే అప్రతిష్ఠ. తనకీ వో యిల్లంటూ వున్నదనీ, స్నేహితులమధ్య రుజువుచేసుకుందుకు, ఏదో నాలుగురోజులు కాలక్షేపం చేదామని, సెలవులలో వచ్చాడు పెంటపాడు. తన పెత్తల్లికయినా తనమీద మమకారం అంతంత మాత్రమే. ఈ పరిస్థితిలో తను అంతంత కష్టపడి కుదిర్చిన సంబంధం, పెళ్ళిముహూర్తంనిశ్చయమయిపోయింతరవాత, పెళ్ళి ప్రయత్నాలు ఆఖరిఘట్టంలో పడుతున్న సమయంలో, ఇన్నాళ్ళూ 'అప్సరసలాంటి పిల్ల, చిదిపి దీపం పెట్టవచ్చును' అని తను చెప్పుకొంటూ వస్తున్న పిల్ల, ఈనాడు 'నాకు నచ్చలేదు' అని ఎట్లా చెప్పడం. తన పెత్తండ్రి అసలే చండశాసనుడు. విరుచుకుని మీదపడతాడు. ఆయనంటే తనకి విపరీతమయిన భయం. ఆయనవల్ల తనకి వొరింగిందున్నా లేకపోయినా 'నా' అన్న అండకింద పనికొస్తున్నాడు.

ఒకవేళ తను సాహసించి 'శశిరేఖ నాకు నచ్చలేదు' అని చెప్పడానికి పూనుకున్నా, చుట్టుపక్కల వాళ్ళు, తన నోరే మూయిస్తారు. ఎవడూ నమ్మడు—సీరియస్‌గా తీసుకోరు కూడా. ఆ అమ్మాయంటే పడిచస్తున్నాడాయిరి. ఆ అమ్మాయి ఫొటోలన్నీ తన క్లాసు పుస్తకాలలో సయితం, లోపలి అట్టలో భద్రంగా అంటించుకుని, దానికింద 'నా శశి' అని వ్రాసుకొని పేజీ కొమార్లైనా, ఆ ఫోటోవంక చూచుకొని గాని, తరువాత పేజీకి వెళ్ళకుండా మిడుకుతున్నాడాయిరి. తను ఎంత పిచ్చివాలకంగా వ్యవహరించాడో తలుచుకుంటే, శశిరేఖకి తను అలుసయిన కారణం లీలగా గోచరించిందతనికి. ఇప్పుడు కూడా తనొక పిచ్చిధోరణిలో వున్నట్టే లెఖ్ఖ. ఇష్టంలేనిది ఆవిడకా! అట్లా స్పష్టంగాచెప్పి, పెళ్లి ఆపుచెయ్యవలసిన అవసరం ఆవిడకుండెగా, తనని నానామాటలూ అని, ఆఖరికి నంగనాచిలా బుడిబుడి దుఃఖాలుపోయి, కడివెడు కన్నీళ్లుకార్చి, ఇదేమిటో సర్దుబాటు చెయ్యమని తన నెత్తిన రుద్ది చక్కాబోయింది! సరేలే, అని ఆ ఘనకార్యం చేస్తానని వాగ్దానమిచ్చి, వీరాధివీరుళ్ళా వొచ్చేశాడూ తను? ఏమి సొగసుగా వుందీ? ఆపిల్ల ప్రవర్తననిగురించి ఏవో అనుమానాలు తన చెవికి సోకినట్టు, పెత్తండ్రికి చల్లగా వూదితేనో—ఈ చట్కారి సంబంధం మనకెందుకురా బాబూ అని తెగతెంపులు చేసుకుంటాడు తప్పకుండా. సంప్రదాయమంటే ఆయన చెవి కోసుకుంటాడు కూడాను. [illegible]వంగా ఆలోచించాడు. తన పెత్తల్లి కొంత గయ్యాళి రకం. వదినకి సరేసరి నోట్లో నువ్వుగింజ దాగదు. వీళ్లు యీ రహస్యం యాగీచెయ్యకుండా వుంటారా? అందులోనూ, ఇందాకా వచ్చింతరవాత పెళ్ళి ఆగిపోయి, పుకారు పుట్టిందంటే, నడి వేసంగిలో పూరిళ్ళమధ్య తాటాకుపాక అంటుకున్నట్టే ... ఇహను ఆపిల్ల భవిష్యత్తు చెప్పాలీ? భగ్గూ వెలుగూ. మెడకాయమీద తలకాయ వున్నవాడు తలవొగ్గడు. తనెంతో పవిత్రంగా ఎంచుకుంటూ వచ్చిన శశిరేఖ పేరు గోడలమీద కొంటెకోణంగుల రాతలలో, ఆకతాయి అల్లరిపేలాపనల్లో, ఇరుగుపొరుగువారి హేళనలో తగలబడిపోతుంటే తను సహించలేడు. మళ్ళీ ఏదో అజ్ఞానంలో పడిపోతున్నాడు. లేకపోతే ఈ శశిరేఖంటే తన కెందుకూ యింత అభిమానం? ఆవిడ ఏమయితే తనకెందుకూ? తన కష్టసుఖాలేమైనా పట్టించుకున్నదా, ఆవిడ. తరచి తరచి చూచుకోగా, ఈ శశిరేఖ తనది కాకపోయినా తనలో ఏదో అలజడికి కారణమవుతున్నట్టు గుర్తించాడతను. లేకపోతే తను అనుకోని ప్రేమాంకురమేదయినా నిప్పురవ్వలా పనిచేస్తోందా లోపల? అతని గుండె ఝల్లుమంది. అంతే అయివుంటుంది. లేకపోతే ఈ గుంజాటన దేనికీ? తటపటాయింపు దేనికీ? తర్జనభర్జన దేనికీ? ఆపిల్ల తాలూకు

భూత, భవిష్యద్వర్తమానాలకు తను గార్డియనా? ఇంకా నయం ఎందుకిష్టంలేదు అని తను శశిరేఖ నడగలేదు. అడిగితే, ఫెళ్లున తననీ తన అందాన్నీ వర్ణించి చెప్పగలదు. కుమిలి చావాలిసొచ్చేది. అంత తెలివితక్కువ ప్రశ్న వేయనందుకు తనను తానే అభినందించుకున్నాడు. తనేమైనా స్వతంత్రుడా "మొన్న నచ్చింది, మరి యివాళ నచ్చలేదు అని కళాకళలుగా మాట్లాడి సెగ్గించుకు నేందుకు..."ఆపిల్ల నా మొహాన్నే చెప్పింది నేనంటే యిష్టం లేదని" అని పెత్తండ్రితో బయటపడదామా అనుకున్నాడు. అటు శశిరేఖ మేనమామకి ముక్కుమీద కోపం. సంప్రదాయానికి దెబ్బతగిలిందంటే ఎంతమాత్రమూ సహించడు. ఇష్టంలేకపోతే యింట్లో గుంభనగా చెప్పకోవాలా, విచ్చలవిడిగా "నువ్వు నా కక్కర లేదని" ముఖాముఖీ వరుడితోనే ఘర్షణకి దిగాలా, అని ఆమెని దండిస్తాడేమో? ఆ హింస తప్పకు నేందుకే తనని ఆశ్రయించిందేమో శశిరేఖ. అంగాకా వస్తే 'నా కిష్టమేను' అని ఆమెచేత బలాత్కారంగా వొప్పించనూ గలడు. వొప్పుకున్నట్టు చెప్పించనూ గల డాయన.

మరి ఇహ నీ పెళ్లి ఎట్లా తప్పించగలడో బోధపట్టంలేదు.

శశిరేఖా, తనూ పెంటపాడులోనే పుట్టి, పెంటపాడులోనే పెరిగారు. ఎటొచ్చీ నాలుగేళ్ళ నుంచీ తను కాకినాడలో కాలేజీచదువులోనూ, ఆమె గుంటూరు మిషన్ హైస్కూల్లో పింతల్లి గారింట్లోనూ వుంటూవచ్చారు. స్నేహం మాచుకుందుకు అవకాశాలు సన్నగిల్లినా, తనకిమాత్రం శశిరేఖంటే ఆకర్షణ తగ్గలేదు. చిన్నప్పుడు, 'బావ' 'బావ' అని పిలిచేది. తను శశీ అని పిలిచేవాడు. ఆ తీయని కల ఈనాడు ఇట్లా తారుమారయింది.

ఈ పెళ్ళిగాని తప్పిపోతే, మరి పెళ్ళిమాట తలపెట్టగూడదు అనుకున్నాడు. తనకి పిల్ల నివ్వడానికి, కాళ్ళు విరుచుకుంటున్నవాళ్లెవరూ లేరని తెలుసును. మొట్టమొదటసారి తన అందంమీదా తన స్తోమతుమీదా తన వునికిమీదా ఒక విహ్యాభావం కలిగిందతనికి. శశిరేఖ తనకి సుముఖంగానే వుంటుందని యాదాలాపంగా అనేసుకుని చక్కా వూరుకున్నాడు, తెలివితక్కువగా—ఆమెనని యేమి లాభం? ఆమె రూపసి, చురుకైనపిల్ల. తన పరిస్థితిని అన్నివేపులనుంచీ, చీల్చి చూచుకొని వుంటుంది.

బహుశా: తనకి యిల్లూ వాకిలా, బలగమూ, డబ్బా దస్కమూ, అందమూ చందమూ, దర్జానా? ఏ మాకర్షణ తనదగ్గర వుందని తనని మోహిస్తుంది శశి? ఇన్నాళ్ళూ ఏదో తన గొప్ప తను వూహించుకుని ధీమాగా బ్రతికాడు. ఒక్క శశిరేఖ తృణీకరించగానే తన అవతార మేమిటో తన విలువ ఏమిటో, నిలువుటద్దంముంగు నిలుచున్నట్టు తెలిసొచ్చిం దతనికి. ఆ పరాభవంతో ఒక్కసారిగా కుంగిపోయాడు.

రాత్రి చాలా భాగం గడిచిపోయినట్టుంది. వీధిలో లైటు గుప్పున ఆరిపోయాయి. ఉపాయం చటున స్ఫురించిం దతనికి. ఒక నిశ్చయానికి వొచ్చేశాడు.

* * * *

పెరట్లో కంచాలు కడిగి, పిల్లల మూతులు తుడిచి భోజనాలయినచోట నీళ్లు చల్లి, మామయ్యకు పొగాకుగొట్టం మందిస్తోంది శశిరేఖ. పోస్టుమేన్ ఏదో వుత్తరమిచ్చి వెళ్లాడు. రామచంద్రయ్య ఆ వుత్తరం చదువుకొని, ఎందుకనో దిగాలుపడి మడతకుర్చీలో కూలబడ్డాడు. శశిరేఖ గమనించింది. అదేమిటో మామయ్య చెప్పేదాకా ఆగాల్సిందేకాని, ఈలోగా ఆరాలడిగితే చివాట్లు తగుల్తాయి. అంచేత అమ్మణ్ణి వొలకబోసిన పౌడరు డబ్బా సర్దుతో అక్కడే ఏదో వొకవంకని తచ్చాడుతూ వుంది. కాని మామయ్య ఏమీ చెప్పదలుచుకోలేదు. రాత్రి ఇంట్లో గుసగుసలు ప్రారంభమయినాయి. ఆ యింటికీ, పొరుగునవున్న మెంతివారింటికీ వుమ్మడి తలుపొకటుంది. ఇద్దరికీ వైరాలు ముదిరితే ఆ తలుపులికి తాళాలు పడతాయి. పొత్తుగా వుంటే గొళ్లేలు పడివుంటాయి. ఇప్పుడా తలుపులు బార్లా తెరుచుకుని వుంటున్నాయి. ఆ వుత్తరం వొచ్చిందగ్గిరనుంచీ, ఆ యింటివారూ, ఈ యింటివారూ చెవులు తెగకొరుక్కుంటున్నారు. అత్తయ్య సరే, ఆ తలుపుదగ్గర కాపురమే పెట్టేసింది. ఇంట్లో అంతా కారాలూ మిరియాలూ నూరుతున్నారు—కారణం గ్రహించలేకుండా వొచ్చింది.

రాత్రి వో నిద్దరోయింతరవాత మెలుకువ వచ్చింది శశిరేఖకి. పంచపాళీలోనుంచి మాటలు వినవస్తున్నాయి. చెవులు దోరబెట్టుకుని వింది. చంద్రరావుకి క్షయవ్యాధి వున్నదని ఆకాశరామన్న వుత్తరము వచ్చిందట మేనమామ రామచంద్రయ్యకి. ఆమె గ్రహించింది. చంద్రరావు కలిపించి వ్రాసి వుంటాడు బహుశా. ఆ వీధిన కండికట్టువారికీ, ఈ వీధిన దాపర్తివారికీ దొమ్మీ జరిగినంత పనయింది మర్నాడు. పెళ్లికి తెగతెంపులయినాయి.

శశిరేఖకి ఖంగారెక్కువయింది. చివరి కెట్లా పరిణమిస్తుందో యేమిటో. మామయ్య ఇంట్లో అడుగు పెట్టగానే ఆమె గుండె వేగంగా కొట్టుకొంటోంది. ఆపైన గదిలో గడియవేసుకుని బిక్కుబిక్కుమంటూ కూచుంటుంది. పెళ్లి చెడిన కారణంగా తను కాకపోయినా తన జాతకచక్రం గురిఅవుతోంది, అందరి ఆగ్రహాలకీ. అట్లా తలదాచుకుందుకు ఆస్కారం లేదు. ఇంటిపని అందుకోకపోతే అత్తయ్య సాధిస్తుంది. మామయ్య కేకలేస్తాడు. వొదిన పిల్లిమీద పెట్టే, పిచికమీద పెట్టే సూటిపోటిమాటలంటుంది. మొహం చూపితే అంతా కొరకొరలాడుతున్నారు. తల దాచుకుంటే అంతా సాధిస్తున్నారు. సెలవ లెప్పుడైపోతాయా అని కూచుంది.

మామయ్యకి చంద్రరావంటే ఎంతో అభిమానం. అతను చాలా బుద్ధిమంతుడు. అతని లోటుపాట్లన్నీ అతనే తనతో వొకసారి ప్రస్తావించి చెప్పాడు తనకి చిల్లిగవ్వలేదనీ ఇంట్లో గాని, ఆస్తిపాస్తులలో గాని పెత్తండ్రివల్ల తనకి సంక్రమించేది పూరి పుడకైనా వుండదనీ స్పష్టంగా చెప్పాడు. బి. యస్. సి. ప్యాసయిన తరువాత వుద్యోగం దొరికితే సరేసరి. లేకపోతే ఏ పెన్సిలు మేన్యుఫాక్చరింగో పెట్టుకుంటాననీ ప్రస్తావించాడు. ఈ రహస్యం ఎందుకు బైట పెట్టలేదా అని మీమాంస పట్టుకుంది మామయ్యకి. అతన్నే అడిగి తేల్చుకుందామనుకున్నాడు. ఎవరైనా దుర్మార్గుడు అతనంటే గిట్టనివాళ్లు ఈ అభాండమతని నెత్తిన వేశారేమో.

మాధవరంలో మున్నంగివారు, అటు కందికట్టువారికీ, ఇటు దాపర్తివారికీ కావలసిన బంధువులు. మున్నంగివారింట్లో పెళ్లికి ఆ యింటివారూ, ఈ యింటివారూ తర్లి వెళ్ళారు. సాయంత్రం క్రీనీడలు పొడుగు సాగుతున్నాయి. పెళ్లివారిల్లు కిటకిటలాడుతోంది. శశిరేఖకి చిరాకుగా వుంది. మేనల్లుడు బాజీని తీసుకుని షికారుగా బల్లకట్టుదాటి పంటకాలవ కెగువని బాడితిచెట్టునీడని చాలాసేపు కూచుని, పొద్దుకుంకేవేళ తిరుగుమొహం పట్టింది. మలుపు తిరగగానే కాలవ గట్టువాలుమీద సరుగుచెట్ల క్రీనీడని ఇసుకలో టర్కీతువాలు పరుచుకుని చదువుకుంటున్నాడొక కాలేజీ కుర్రాడు. గబగబ అడుగులేసింది. అతను చంద్రరావు! రామయ్యగారి తాలూకు వచ్చారని తెలుసుగాని, చంద్రరావు వచ్చాడనుకోలేదు.

వెదకబోయిన తీగ కాలికి తగిలినట్లయింది. ఈవారంరోజులలోనూ అతనెంతో చిక్కిపోయాడు. కళ్ళల్లో నిద్రాభారం కనిపిస్తోంది. ఇంత పరకాయించి ఎవరివంకా చూడలేదు తనింతవరకూ. అతనికి తన కృతజ్ఞత చెప్పుకోవలసి వున్నది. అతనితో మాట్లాడాలిసిన పని వున్నదికూడా. అతని వ్యాధిని గూర్చి అతనినే అడిగి తెలుసుకుంటానన్నాడు మామయ్య. "ఎవరో గిట్టనివాళ్లు వ్రాసి వుంటారు, నా కట్లాంటి వ్యాధి ఏమీ లేదు" అని చంద్రరావు అన్నాడా మామయ్య తప్పకుండా అతన్ని నమ్ముతాడు. అతనంటే మామయ్య కంతగురి. నిజానికి అతని కట్లాంటి వ్యాధి వున్నదని ప్రచారం కావడం తన కెంతమాత్రమూ యిష్టం లేదు. దానివల్ల తనకుపకారం జరిగినా అతనిభవిష్యత్తు అప్పుడే చాలావరకు భగ్నమయిపోయింది. అతిసామాన్యమైన సంసారులుగూడా అతనికి పిల్లనివ్వడానికి జంకుతున్నారప్పుడే. తనసంబంధం నిశ్చయం కాకపూర్వం అతనికోసం మొగబడినవాళ్లంతా "ఇంకా నయం, మనం తొందరపడలేదు" అని, ఇహ నా ప్రసక్తి విరమించుకున్నారు.—ఆగింది.

అతను కన్నెత్తి చూడలేదు. కొంచెం దూరంగా కూచున్నది "ఆ ఉత్తరం నువ్వేనా రాసా బావా" అని అడిగింది, వోరగా చూస్తూ. అతనింకా పుస్తకం చదువుకొంటూనే వున్నాడు. చాలా కోపంగా వున్నట్టుంది. ఆ పరిస్థితిలో వాళ్ళిద్దరినీ ఎవరైనా చూచినా ఏమైనా అల్లి పారెయ్యగలరు. ఆమె అభిమానం కొంత గాయపడిందికూడా. ఉన్నట్టుండి "కసితీరిందా?" అన్నాడు చంద్రరావు. "బావా, ఎందు కట్లా వ్రాశావు? ఈ పెళ్ళి తప్పించడానికి, నీ విట్లాంటి విపరీతమైన పంథా తొక్కుతావని తెలిస్తే నేను తప్పకుండా వారించేదాన్ని..." అతనిక పుస్తకం మూసేశాడు. "ఇదిగో శశీ, పిచ్చివాలకంగా మాట్లాడకు... నా యింట్లో నా కెంత స్వాతంత్ర్యమున్నదో నీకుమాత్రం తెలియదూ!" .. కాలి బొటనవ్రేలితో రాస్తూ మౌనం వహించింది శశిరేఖ. "శశీ" అని తనని పిలవడంలో వున్న చనువూ ఆంతర్యమూ గుర్తుపెట్టుకుంది. మళ్లీ పుస్తకం చదువుకొంటున్నాడతను. అతనివంకే చూస్తూ కూచున్నదామె. అంతత్వరలో వెళ్ళిపోవాలని లేదు "అవును గాని నాకు తెలియకడుగుతాను. నాకు క్షయవ్యాధి వున్నదని, ఇంటింటా వాడవాడలా నాలిక బుజమ్మీద వేసుకుని చాటింపేస్తేనే గాని మీకు తృప్తి తీరదా యేం?"

"నేనేంచేశాను చెప్పుబావా." అంటున్నది శశిరేఖ.

"నువ్వేమీ చెయ్యలేదనే అనుకుంటూంట"

"నాకు తెలియనివ్వలేదు. నిజానికి "

"అదుగో—తెలిసిం తరవాత నువ్వు తీసుకున్న చర్య యేమిటో చెప్పు. మీ మామయ్యతో గాని అత్తయ్యతో గాని, అతని సంబంధం మనమెల్లానూ వొదులుకుంటున్నాముగదా, అతని పేరు యాగీ చెయ్యటమెందుకు మనకీ, అని వొక్క మాట చెప్పి చూచావా నువ్వు?" తనవంక చూడకుండా చూపుడు వ్రేలు మాత్రం తన వేపు చురుగ్గా చూపుతూ సమాధానంకోసం ఎదురుచూస్తున్నాడతను. నిలువునా నీరయిపోయింది శశిరేఖ అతనివల్ల తనకి జరిగిన వుపకారాన్నీ, తనవల్ల అతనికి జరిగిన అపకారాన్నీ పోల్చి చూచుకుని ఎంతో కించపడింది. నిజమే, అతని భవిష్యత్తు మట్టిపాలవుతూంటే తను చేసిందేమిటి? తన కక్కర్లేని పెళ్ళి నిలిచిపోయిందే చాలని మురవడంకన్న! అపరాధం వొప్పుకుని మౌనంగా వూరుకుంది. "అట్లా వుండాలి—అయినా నీకేమి పట్టిందిలే వెళ్ళు—నీ సంకల్ప మీడేరిందిగా! ఇహ కోరుకున్న వరుణ్ణి పెళ్ళిచేసుకుని హాయిగా కులుకుతూ సంసారం చేదువు గానిలే. ఈ ప్రచారంవల్ల నాకు అదనంగా కలిగే నష్టమేమీ లేదులే! నీస్వార్థం ఎంతవరకూ పోయిందో చూపుతున్నాను నీకు. అంతే. నాకింక పిల్లనిస్తామనికూడా ఎవరూ రారని మురుసున్నావు వును. పెళ్ళి పెటాకులూ ఆనాడే మానుకున్నాను. నువ్వు నా అందాన్ని గురించి వుపన్యాసమిచ్చిన రోజున" అని వొక్క బిగిని తన అక్కసంతా తీర్చుకున్నాడతను.

శశిరేఖ "నా తొందరపాటుకి క్షమించు బావా," అని కంట తడిపెడుతూ వెళ్ళిపోతోంది. తన తెలివితక్కువకి తనని తానే నిందించుకున్నది. ఏమనాలో తోచనూ లేదు. తన కృతజ్ఞత వెల్లడించాలనుకొన్నది. మామయ్య అతన్ని అడిగి ఏమిటో తేల్చుకోవాలన్నాడు. ఏమని చెప్పదలచుకొన్నాడో ఆరా లడుగుదామనుకొన్నది. అతని ధోరణి బాగుండలేదు. లాభం లేదు. వెళ్ళిపోతోంది. దీనత్వంలోకి దిగజారి వెనక్కయినా తిరిగిచూడకుండా వెళ్ళిపోతున్న ఆ అందాలరాశిని అలవోకగా చూచాడతను. ఆమె జడ పడగెత్తిన నల్లత్రాచుపామై కదలిపోతోంది. పరవళ్ళు తొక్కుతో ఆమె వెంటపడుతున్న పంటకాలవతోపాటు అతని చూపులు కూడా చూపందేవరకూ ఆమెని వెన్నంటే వున్నాయి.

శశిరేఖకి రాత్రి అన్నం రుచించలేదు. రాత్రి అంతా నిద్రపోయిం తరవాత తలగడ కన్నీటి కాలవలుగా ఎంతోసేపు ఏడిచింది. అభాగ్య ఏమిటో తెలియలేదు. నిజంగా అతనికపకారం చెయ్యాలని తనకి లేదు. కాని అపకారం జరిగింది. అపకారం ఇంతా అంతా కాదు. అతనూ తల్లిదండ్రులు లేనివాడు. ఏ విధమైన ఆర్థికస్తోమతూ లేనివాడు. స్వతంత్రంగా బ్రతకలేనివాడనీ కాదు గొప్ప అందగాడు కాదనీ కాదు. అతన్ని ఎంచేతనో వరుడుగా స్వీకరించలేకపోయింది లోలోపల తరిచి చూచుకుంది మొట్టమొదటిసారిగా. అతను చాలా అపోహపడుతున్నాడు. తన కెవరిమీదనో మోహమున్నదని అనుకుంటున్నాడు బహుశా. నిజానికి తన మనస్సు ఎవ్వరిమీదా వాలలేదు. మనసులూ మమతలూ, విరహాలూ, వ్యామోహాలు ఇంకా తనని ఆవరించలేదు.

కోటు చిలకకొయ్యకి తగిలిస్తూ మామయ్య అత్తయ్యతో చెబుతున్నాడు. శశిరేఖ జాగ్రత్తగా వింది. చంద్రరావుతో ఆ ప్రస్తావన తెచ్చాడట. నిజమేనని తక్షణం వొప్పుకున్నాడట. అట్లాంటి లోపాన్ని స్వార్థంకొద్దీ తను దాచినందుకు చేతులు పట్టుకుని క్షమాపణ వేడుకున్నాట్ట. మామయ్యకీ కళ్ళు చెమ్మగిల్లినై. అంత చక్కని కుర్రవాడికి ఎట్లాంటి వ్యాధి! ఎంత బుద్ధిమంతుడు!! ఎంత వుదారగుణమతనిది. ఎంత తెలివితేటలైనవాడు. కాలేజీలోనూ, ఆవూళ్ళోనూ అతని కెంత మంచిపేరు! "ఇంతకీ శశి దురదృష్టవంతురాలు" అని పెదవి విరిచారంతా. శశిరేఖ కిదంతా ఆశ్చర్యంగా వున్నది. ఇంకా అతను "నాకు వ్యాధి లేదు, సింగినాదం లేదు కావలిస్తే డాక్టరు పరీక్ష చేయించుకో" మని నిగ్గదీస్తాడేమో ననుకుంది. అతని మాటంటే మామయ్య కెంతో గౌరవం. ఆ చురుకుచూపుల వెనక, కరుకుమాటల వెనకా తనంటే ఎంత మెత్తగా స్పందించే హృదయమున్నదో, ఆమె కవగాహనయింది తననించీ యేదో వొక ఆత్మీయతని పుణికి పుచ్చుకుంటున్నాడా అనిపించింది.

* * *

చంద్రరావూ, రఘూ క్లాసుమేట్లూ, రూముమేట్లూకూడా. ఆవేళ రఘు మంచి బందోబస్తుగా టాయిలెట్టయ్యాడు. అందమైన హవానా సూటు బనాయిస్తూ, తచ్చాడుతున్నాడు గదిలో. చంద్రరావు,

తన క్లాసు పుస్తకాలలో ఫోటోలు చింపి, అవతల పారేస్తున్నాడు. అట్లాంటి వొక ఫోటో రఘుమీద పడింది. ఏమిట్రా యిది. ఇంత చక్కని ఫోటోలు చించిపారేస్తున్నావట్రా. నీ కక్కరేకపోతే ఇట్లా పారెయ్యి అన్నాడు రఘు. "ఫోటోలతో కగ్గేమిట్రా, అట్లాంటి అసలైన పిల్లవొకతె సాక్షాత్తూ మా వూళ్ళోవుంది. కావాలంటే వెళ్లి తెచ్చుకో." అన్నాడు చంద్రరావు. "నిజం?" అని ఫోటోవంక కొంత పరిశీలనగా చూచుకున్నాడు రఘు ఆ వేళ వొక సంబంధం చూచుకుందుకు వెళుతున్నాడు రఘు. ఏదో వొక పల్లెటూరిపిల్ల, ఇక్కడ వ బంధువులయింటికి వచ్చిందట గణపతి నవరాత్రులకు. చూచిపొమ్మని ఆహ్వానం వచ్చిం దతనికి. స్నేహితులిద్దరూ పెళ్లిచూపులికి బయలుదేరారు

రఘు ధనవంతులబిడ్డ పిల్ల అందంమీదా, చదువుమీదా చూపతనికి; సంప్రదాయంమీదా, కట్నంమీదా చూపతని తండ్రికీ. ఆయన నిర్ణయించిన సంబంధ మితనూ, ఇతను అవునని తలవూపిన సంబంధం ఆయనా రద్దుచేసుకుంటూ వొస్తున్నారు. రఘూ భయస్తుడు. ఆదర్శాలకీ, ఆశయాలకీ పుస్తకాలలో యిచ్చినంత విలవ ఆచరణలో ఇవ్వడం సాహసమన్న మతంలో మనిషి. "నీకు నచ్చిన పిల్లని చేసుకోరాదుట్రా" అంటే, పితృభక్తిని ఆదర్శంగా చెపుతాడు. పోనీ పెద్దవాడు ఆయన నిర్ణయించిన సంబంధమేదో అంగీకరించరాదా అంటే, అమ్మో పిల్ల అందంగా వుండాలి, చదువులూ, సంగీతాలూ వెలిగిస్తూండాలి అని గొంతెమ్మకోరికలు వెళ్లబోస్తాడు. "ఇట్లాగయితే నీకు పిల్ల అమిరినట్టే." అని చంద్రరావు వొకసారి ఎత్తిపొడిచాడు. "మించిపోయిం దేముందీ, అన్నీ అమిరితేనే చేసుకుంటాను" అని సారాంశం తేల్చాడు రఘు. అంటే కావలసిన కట్నాలూ, కానుకలూ, లాంఛనాలూ, ముట్టజెప్పి, అందమూ చందమూ అమిరిన పిల్లని, చదువులూ సంగీతాలూ నేర్చిన పిల్లని సమర్పణచేస్తే దయా ధర్మభిక్షకింద స్వీకరిస్తాడు. అదీ అతనికి చాతనయింది.

పెళ్ళికూతుర్ని, తీసుకొచ్చారు. గుమ్మడి పువ్వులో మంచుబొట్టులా, పచ్చని తివాసీమీద పొందికగా కూర్చుంది శశిరేఖ. చంద్రరావు తెల్లబోయాడు. పెళ్ళిచూపు లయినాయి. పక్కకి తీసికెళ్లి "ఈ పిల్ల నెక్కడో చూచినట్టుందిరా" అన్నాడు రఘు. "ఆ ఫోటోలో పిల్లరా," అన్నాడు చంద్రం. "ఆ!" అని తెల్లబోయాడు రఘు. "అయితే, ఇహనేం, కట్నమూ గట్రా లావుగా యిప్పించారేయ్." అని గునిశాడు రఘు. సరిపోయింది! రామయ్యగారూ వచ్చారు. రఘూని తప్పించి రామయ్యగారూ చంద్రరావూ లోపాయికారీగా మాట్లాడుకున్నారు. రఘూ పరిస్థితులు సాకల్యంగా విడమర్చి చెప్పాడు. రామయ్యగారికి అన్నివిధాలా అవలంబించదగిన సంబంధమన్నాడు. పెళ్ళికొడుకుని వొప్పించే భారం నీదేనని రామయ్యగారు అర్థించాడు. "ఇదిగో, ఇప్పుడే వుప్రక్రమిస్తున్నా" అని చంద్రరావు "వొరేయి అబ్బాయీ! చెబుతున్నావిను. డబ్బు శాశ్వతం గాదు, అగ్నిహోత్రం లాంటి కుటుంబం. వజ్రపు నెరుసులాంటి పిల్ల. చదువులకు సరస్వతి. పాట పాడిందంటే మాటలు పెదవులమీద నించీ వస్తున్నాయో, వీణాతీగలమీదనించీ వస్తున్నాయో గుర్తించడం కష్టం. నీ యింటి కొక నెలుగనుకో!" అని ముగించాడు. బావుంది వర్ణన! శశిరేఖ కిటికీలోంచి చూస్తో సిగ్గుపడింది. రఘు చాలా సేపున్నాడు. చంద్రరావొక స్నేహితుడుగా, హితైషిగా పెద్దమనిషిగా, మధ్యవర్తిగా, ఎన్నో విధాలుగా బోధించి చూశాడు. "పిల్ల నచ్చిందీ" అని అతని చేత పలికించడానికి రెండు గంటలు పట్టింది. ఆఖరికి వొక మాట యిచ్చాడతను. కట్నాలేమీ యివ్వకపోయినా తండ్రికి నచ్చజెప్పిచూస్తానన్నాడు. ఆయన అంగీకారం లేనిదేమటుకు తను స్వతంత్రించనని నొక్కి చెప్పాడు. కొంత నయ మనిపించింది. రఘు వెళ్ళిపోయాడు.

చంద్రరావు ఆ రాత్రి భోజనాని కుండిపోయాడు. పంచపాళీలో కుర్చీ వేసింది శశిరేఖ. కూచున్నాడు. ఎవరూ లేరు. "నచ్చాడా" అని ప్రశ్నించాడు ఆంతర్యంగా. సిగ్గుపడింది. "మళ్ళీ కొంప ముంచకు, మహాతల్లీ" అన్నాడు. హాస్యంగా నవ్వింది. శశి అత్తయ్య వొచ్చింది. చిన్నతనంనించీ ఎరిగున్న మూలాన అతనంటే ఆవిడ కెంతో అభిమానం "జరిగిందేదో జరిగిపోయింది. నువ్వు కాబట్టె అన్నీ మర్చిపోయి తల్లీ తండ్రీ లేని పిల్లయినందుకు ఇంత శ్రమ తీసుకుంటున్నావు నాయనా. ఇంకొకాయితే గర్భశత్రువులుగా మారిపోయేవారు. నీ పెత్తండ్రి సరేసరి మమ్మల్ని చేస్తున్న యాగీ ఇంతా అంతా కాదు" అని ఏకరువు పెట్టిం దామె. "తప్పంతా నాదేనండి, ఆ సందర్భంలో నా లోపం నేను చెప్పేసివుండాల్సింది మీకు. భగవత్కృప వల్ల మీ రెట్లా తెలుసుకున్నారో గాని నా కాశ్చర్య

మయింది. లేకపోతే శశి జీవితం గంగపాలయ్యేది." అని నేరస్థుడిల్లే తల వంచుకున్నాడు చంద్రరావు. "విచారించకు నాయనా, నీ మంచితనమే నిన్ను రక్షిస్తుంది." అని వోదార్చిందామె. శశిరేఖ గది గుమ్మందగర వోరగా నిల్చుని వింటోంది. పాపం తనకోసమని అత ఎంత అసహ్యకరంగా, అవమానకరంగా నటించాల్సొచ్చిందో! తలుచుకొంటే, ఆమె అంతరాత్మ ఘోషించింది — భోజనాల వేళయింది. శశిరేఖ అప్పడాలూ వొడియాలూ వేయించింది. మామయ్యకీ చంద్రరావుకీ, వెండికంచాలుంచి వడ్డన కుపక్రమించబోయింది. "మామయ్యకి తరవాత వొడ్డిస్తువుగాని లే" అన్నది అత్తయ్య. "అతని కొక్కడికే కేటాయింపుగా వొడ్డిస్తే ఏం బావుంటుందీ" అని కించపడుతోంది శశి. "చెప్పినమాట వినవమ్మా తల్లీ, క్షయంటే దారుణమైన అంటువ్యాధి నీకు తోచదు, చెబితే వినవూ, చచ్చే చావయింది నాకు" అని చీదరించుకున్నదామె. కంచాలు తీసి వొక్కటే విస్తరి వెయ్యడం చూచాడు చంద్రరావు. గ్రహించాడు. తను భోజనానికి నిలవడం పొరబాటు. చెయ్యి కడుక్కుని పంచపాళీలోకి వచ్చేస్తూ గుమ్మందగ్గర ఆగి విన్నాడు. "నువ్వే ఎత్తు ఆ విస్తరి. అత నెత్తేస్తానంటే వొద్దని సైగచేస్తా నెందుకూ, నువ్వే! అనుభవించు" అని తుస్కారిస్తోంది అత్తయ్య తను వ్యాధిగ్రస్తుడన్న సంగతి ఘడియఘడియకి జ్ఞాపకముంచుకోవాలి తాను. రామయ్యగారితో మాట్లాడి వెళ్ళిపోతున్నాడు చంద్రరావు. తలుపు వేసుకుందుకు శశిరేఖ వచ్చింది. "చెప్పేస్తాను" అంది.

"ఏమనీ?"

"నేనే ఆ వుత్తరం నీచేత వ్రాయించానని నీ క్షయమాట అబద్ధమనీ"

"నష్టమెవరికో ఆలోచించి చూచుకో," అని చక్కాబోయాడు.

* * *

పొద్దున్న లాడ్జిలో రఘు చదువుకొంటో, చంద్రరావుదగ్గర కొచ్చి, "ఏమిరోయ్, మా వూరు పిల్లంటున్నావు, నీకేమయినా పాత పురాణమేమిట్రా" అన్నాడు చటుక్కున. ఏడిశినట్టేవుంది. అసలికీ తనకి మధ్య ప్రణయకాండ ఏమీ నడవలేదని వాడి బుర్రకెక్కించేసరికి తలప్రాణం తోకకి వచ్చింది. కొంత అసత్యమూ చెప్పాల్సొచ్చింది. కొంతమంది ఎంత కుళ్లుగా ఆలోచిస్తారూ!

సెలవల్లో రఘు సర్పవరం వెళ్ళిపోయాడు. చంద్రరావూ, రామయ్యగారూ సర్పవరం బయలుదేరివెళ్ళారు సంబంధం ఖాయం చేసుకుందుకని. రఘు తండ్రి సూరపరాజుగారు అతిలౌక్యుడు: ఆయన కొరుకుపడలేదు.

సెలవల్లో చంద్రరావు ఇంటికి వెళ్ళలేదు. అతనూ పెత్తండ్రీ ఘర్షణపడ్డారు ఏదో అపకారకం సంబంధాలకి...తన మెడలు విరుద్దామని చూస్తాడు. దానితో అతను సెలవల్లో పెంటపాడు వెళ్ళడం పడలేదు. కాకినాడలోనే వుండిపోయి, మూడు నాలుగు మంచి ట్యూషనుల ఏర్పాటు చేసుకున్నాడు.

* * *

రకరకాల సంబంధాలు చూశారు, చంద్రరావూ రామయ్యగారూ. రామయ్యగారు చూడామనుకొన్నవి కొన్నీ, చంద్రరావు ఎరికలో వున్నవి కొన్నీ, "పబ్బవడికి కావాలండీ. భోగంది గడిస్తుంది. పిల్ల చక్కదనమూ సంప్రదాయమూ కావాలిగాని" అని ప్రారంభించి, తీరా ముగ్గులోకి దిగింతరవాత కట్నాలూ, లాంఛనాలు ఆడబడుచు కెంతో, అలక కెంతో, మనుగుడుపుల కెంతో, కార్యానికెంతో, బాలతొడుగెంతో రూపాయణా పైసలతో అనుకున్న అంకెకి అందివస్తేనేగాని వొక తెన్నుకురాని సంబంధాలు, పూటకిటికానా లేకపోయినా పిల్ల పెళ్ళికున్నదీ అనగానే కట్నమెంత యిస్తారూ అన్న బేరంతో మొదలయ్యే సంబంధాలు, లక్షలున్నాయనిపించి ఆఖరికి వున్న ఆస్తులూ చేసిన అప్పులూ లెఖ్ఖవేసిచూస్తే అంకె మిగలకపోయినా ఆకాశయానం చేసే సంబంధాలు, నీటూగోటూ బోటుగా పెట్టుకుని చూపదగిన ఆస్తులు లేకపోయినా మా అమ్మమ్మ ఆస్తి నాకే వస్తుంది, మా మేనత్త నాకే రాస్తుంది, అని గాలిమేడలలో కూచుని పంకాలు లాగించుకోవాలని చూసే సంబంధాలు చూచిచూచి ప్రాణం విసిగింది.

శశిరేఖ అన్నీ వింటూనే వున్నది. "బిళ్ళపెట్టుగా అంతా వొచ్చిపడ్డాము. వొకరోజా, వొకవారమూ, మళ్ళీ వస్తామ"ని చెప్పి రామయ్య భార్యాపిల్లలూ, శశిని మాత్రం కాకినాడలో పినతల్లిగారింట దిగవిడిచి వెళ్లారు. చంద్రరావు తరుచు రావడం లేదు. వచ్చినా తనవంక చూడ్డంగాని తనతో మాట్లాడడంగాని పూర్తిగా మానుకున్నాడు. శశి పినతండ్రి, కలవాడూ, చాలా పెద్దమనిషీ. ఆయనా తాపత్రయపడుతూనే వున్నాడు. చంద్రరావు గ్రహించాడు, ఎవరెంత తాపత్రయపడినా పెళ్లిఖర్చులు మినహా,

కట్నాలరూపేణా గాని కానుకలరూపేణా గాని చిల్లి గవ్వ భరించేవా రెవరూ లేరని.

శశిరేఖ చంద్రరావుతో అంతరంగంగా మాట్లాడా లనుకొన్నది. తన కష్టసుఖాలు, ఎవరితోనూ అంతవరకూ ప్రస్తావించని సాంఘిక బాధకాలు అతని ముందు ఏకరువు పెట్టాలని తపనపడింది. కాని అతను తనచుట్టూ వొక గోడలాంటిది కట్టేసుకుంటున్నాడు. తను తొంగిచూచేందుకు వొక కిటికీ అయినా వొదలని ఇనుపగోడ. అమ్మక్క వొకసారి పెంటపాడు వెళ్ళివచ్చింది. చంద్రరావు అక్కడికి రావడమే లేదట. రామయ్యగారు గాని, ఆయన తాలూకు గాని అతని విషయం పట్టించుకోనే పట్టించుకోరు. అతను మాత్రం మా పెదనాన్న, మా పెదనాన్న అని వ్రాసుకుంటాడు. అతని జీవయాత్ర అంతా నిగూఢమయింది. అతని కష్టనిష్ఠూరాలు అతను చెప్పకోగా ఆమె యెప్పుడూ వినలేదు. అతని పుస్తకాలకి గాని, జీతాలకి గాని, తిండితిప్పలకు గాని పైసా యివ్వడు పెత్తండ్రి. మరి యెట్లా బండీలాగుతున్నాడో భగవంతుడికే తెలియాలి. తనకి గాని, తన మేనమామకి గాని తమ పనులమీద వినియోగించుకోవడం మినహా అతని కెట్లా గడుస్తుందో, ఆలనా పాలనా సూచనగానైనా అడిగి తెలుసుకుందామన్న శ్రద్ధ లేదు తన మేనమామకు. పరేసరి అతను రాగానే అక్కడ సంబంధం గొడవతోనూ, ఇక్కడి సంబంధం గొడవతోనూ అతి ఆత్రంగా అతన్ని తోమితోమి, భోజనాలవేళ దాటినా, భోజనానికి వుండమని లాంఛనప్రాయంగానైనా అనడు. ప్రయాణంలోనూ గట్టా అతనిఖర్చులు అతనే భరిస్తున్నటు మామయ్య ధోరణిలో ఒకనాడు పసికట్టింది. మామయ్య సంగతి తెలీదూ! తనని ఆ బంధువుల ఇంట్లోనూ ఈ బంధువుల యింట్లోనూ, నెలల తరబడి వుంచేస్తాడు. తొందర పడి వాళ్ళేమనుకొంటారోనని తనంతట తానే ఇంటికొచ్చేస్తే కూకలు వేస్తాడు. ఒక పెళ్ళి చూపులికి ముస్తాబవుతూంటే ఇంటిదగ్గర సిల్కు చీర మర్చిపోయివచ్చిందని తనని పట్టుకుని ఝాడించేశాడు చంద్రరావుసమక్షంలో — ఇంటిదగ్గిర తనకి నిజంగా వొక సిల్కు చీర వున్నట్టు — చంద్రరావు వొక జార్జెట్ సిల్కు చీర కొని తీసుకొచ్చాడు. ఈసారి పెంటపాడునుంచి రాగానే పైకమిచ్చేస్తానన్మని, మామయ్య చంద్రరావుతో రెండుమూడు సార్లు స్పష్టంగానూ, ఆతరవాత నసుగుతోనూ అన్నాడు. రోజులు గడిచింతరవాత మర్చిపోయినట్టు నటిస్తున్నాడు. ఆచీర కట్టుకొన్నప్పుడల్లా తనవొళ్లు గరిపొడుస్తుంది.

కాకినాడలో పినతండ్రియింట్లో ఆమెకి కొంత చనువున్నది. ఆయనకి శర్వరీటాకీసులో భాగముంది. నెలకి 40 పాసు టిక్కెట్లు వస్తాయి. పినతండ్రికొడుకు రవణని ఎనిమిదేళ్ళ కుర్రకుంక వొకడున్నాడు. వాడు . చీటికీ మాటికీ శశిరేఖని సినిమాకి తర్లించడం మరిగాడు. కథా, కథలో చిన్నిచిన్ని ఘట్టాలూ రసవంతంగా విడమర్చి చెబుతుంది. అందుచేత చూచిన సినిమాకే మళ్ళీమళ్ళీ ఆమెను వేధించి తీసుకెడుతూ వచ్చాడు. చంద్రరావు కిప్పుడు పరీక్షలయిపోయినై. లాడ్జిలో వొక గది తీసుకొని వొంటరిగానే వుంటున్నాడు. లాడ్జి సినిమానుంచి వచ్చేతోవలోనే వున్నది. వచ్చి, పొయ్యేటప్పుడు అది వొక ఆకర్షణగా పని చేస్తోంది ఆమెలో ఒకటి రెండుసార్లు
పక్కనే రవంత సేపాగి భయంగా నిల్చుని వచ్చింది ఎప్పుడు చూచినా ఆ మేడగది కిటికీదగ్గిర చదువుకుంటూ కూచుండేవాడు పరీక్షలయినా ఏమిటో చదువు! మేడ మేడంతా చీకటిమయం అక్కడ మాత్రమొక చిన్న లైటు. ఆ లైటు వెలుగున చట్రంలో బస్టు ఫోటోలా, అతను తదేక దీక్షగా చదువుకుంటూ కూచునే భంగిమ. ఒకనాడు రెండో ఆట అయిన తరువాత తిరిగివస్తోంది రవణతో. వీధి వీధంతా నిర్మానుష్యంగా వున్నది. అతను మాత్రమింకా ఏదో రాస్తూ కూచున్నాడు తనకోసం అంతింత తాపత్రయాలు పడే వొక ప్రాణి, తన హృదయంలో ఇంతచోటు దొరుకుతుందేమోనని గాలిస్తున్న ఆ చిన్న మెదడు అట్లా ఆ పుస్తకాలలో లీనమయిపోయివుండటం కొంత కష్టంగానే వుంది. అతనేమి చేస్తుంటాడో, ఎట్లా కాలక్షేపం చేస్తుంటాడో తెలుసుకోవాలని మనస్సు రెపరెపలాడుతోంది. వెళ్లి పలకరించా లనుకుంది. అంతరాత్రి వేళ! ఏమనుకొంటాడో!......వెళ్లింది. పక్కని రవణ వున్నాడుగా. ధైర్యం తెచ్చుకుంది. వొక్కొక్కటే మెట్లు ఎక్కి, నిలబడింది గదిలో. అతను వులిక్కిపడ్డాడు. "ఎక్కడనించి?" అతని ప్రశ్నలోనే చూపు లాగిపోయినాయి. ఆమె గది అంతా కలయజూచింది. పుస్తకాలక్కడా ఇక్కడా చెలాచెదురుగా లేవు. వుంటే సర్దుదామనుకున్నది. కూచోమని సైగచేశాడు ఉత్తరాలు కొన్ని టేబిలు మీద అడ్డదిడ్డంగా పడివున్నాయి. "వూరికి వచ్చు కోరాదూ?" అని వుపక్రమించింది "అది ఇంకా పరిశీలించాలిసి వున్నదిలే" అని వారించాడు. క్యాలండర్లో పాత నెలల కాయితాలు చింపుదామని బయల్దే

రింది. "అందులో కొన్ని తారీఖులు గుర్తు చూచుకో వాలి లే—చింపకు, చింపకు" అని అభ్యంతరాలు పెట్టాడు. అతనిమీద కోపమొచ్చింది. తనచేత వివిధమైన పనులూ చేయించుకోగూడదని మతం గావును. ఏమిటో తెగ వ్రాస్తున్నాడు కాయితాలతని చేతుల్లోంచి చనువుగా లాక్కొని చదివింది. అర్థం కాలేదు.

"ఏమి టిది?"

"ఒక వ్యాసం లే"

"దేనిని గురించీ?"

"వృక్షశాస్త్రంలో వొక థీసిస్"

"ఎందుకూ సెలవలలో"

"ఒక పోటీ పరీక్షకని"

ముక్కల్లో ముక్క, ముక్తసరిగా సమాధానం చెప్పాలి గావును!—చిరాకుపడింది.

"చాలా కష్టపడుతున్నావు, ప్రైజు కొట్టేలా వున్నావులే" అన్నది...తలవొంచి నిట్టూర్చాడు... వెళ్లిపోబోయింది. కదిలిద్దామని "కూచో, ఏం భయంగా వున్నదా?"

"భయ మెందుకూ" పైటకొంగు తెగ మెలి వేస్తోంది.

'ఏమోలే'

'కొంచెం చెడ్డవాడవయినా బావుణ్ణు"

"ఎందుకూ?"

"కాస్త భయమైనా నటించేదాన్ని"

కిలకిల నవ్వి మెట్లు దిగింది రవణతో. అతను కిటికీలోంచిచూస్తూ నిలబడ్డాడు "ఈమె వొక కొత్త శశిరేఖ!" అనుకున్నాడు. శశిరేఖ గబగబా వెళ్ళిపోతోంది. వెనక్కి తిరిగిచూడకూడదనుకుంది. కాని అతను కిటికీదగ్గర నిల్చుని చూస్తున్నాడా లేకపోతే తక్షణం వ్రాతలోపడ్డాడా తెలుసుకుందుకు ఆత్రంగా వుంది. వెనక్కి తిరిగిచూచింది. అతను చూస్తూనే నిల్చున్నాడు. ఎక్కణ్ణించో వల్లమాలిన సిగ్గు ముంచుకొచ్చింది. అడుగులు తడబడ్డాయి. ఎందుకు చూచానా అని కించపడ్డది.

ధోరణి మూస్తే, సర్వవరంలో రఘు సంబంధమింకా మామయ్య వదులుకోలేదు. చంద్రరావు అడపా దడపా సర్వవరం వెళ్లివస్తున్నాడు. రఘు తండ్రి అతి లౌక్యుడు తొంటచెయ్యి చూపడానికి తొంభైరోజులు తీసుకుంటాడు. అక్కడ జరిగిన మాటలూ వాళ్ళధోరణి వింటోంటే శశిరేఖకి చిటచిటలాడింది. అసలీ మధ్య సంబంధాల గాలింపుల్లో ఆమెకి ప్రపంచం చాలామట్టుకు అవగాహనయినట్టనిపించింది. పెద్దమనుషులుగా హుందాగా రొమ్ములు విరుచుకునే యీ మగరాయళ్ళలో ఎంతమందికి నిజమైన జీవితపు విలువలు తెలుసునో, ఎన్నెన్ని స్వార్థాలు ఎన్నెన్ని మారువేషాలలో మనుషుల్ని నడుపుతవో ఆలోచిస్తే వొకవిధమైన విరక్తి కలిగింది. చంద్రరావుకి తన అభిరుచులు బాగా తెలుసును. మామయ్యకి యిష్టమైన కొన్నికొన్ని సంబంధాలు తన కయిష్టమని ఎట్లా గ్రహించేవాడో ఏవో లొసుగులు వెతికి తెచ్చి ఆయనమనస్సు మార్చేవాడు. చిత్రంగా కనిపించేది. తనకి పెళ్ళి చేసెయ్యాలని ఎందుకో అందరికీ ఇంత అలజడి. ఆ చంద్రరావుకి మరీను. అతని కెందుకో యీ దుగ్ధ. తనకి పెళ్ళి కాకపోతే అతనికేమో. ఆ రఘుసంగతి మరీ చాంగలు కొరుస్తూ చెప్పవస్తాడతను వొడలంతా చీమలు పాకినట్టుంటుంది తనకి. రఘు అందమైనవాడే. చదువుకొన్నవాడే. తనని చేసుకోవాలని మహా వుబలాటపడుతున్నాట్ట! తన అందానికి ముగ్ధుడైపోయాట్ట! ఏడవలేకపోయినాడా అనిపించింది శశికి. కోరిన కట్నాలతో కులుకుతూవస్తే వాళ్లోకి తీసుకుంటాడు పాపం. వీళ్లకి సిగ్గులుండవా అని? నాకాపిల్ల నచ్చింది, ఈపిల్ల నచ్చింది అని చెప్పకుండుకు. వో గుంజుకుని చస్తున్నాడు రఘు, కట్నమెట్లా రాబట్టాలా అని. తండ్రీ వాడూ లాలూచీ అని, శశికి గట్టి నమ్మకం. ఈ స్వార్థాలన్నిటికీ అతీతమైన అంతస్తులో మరకలు లేని, నిర్మలమైన తెరమీద తళుక్కుమని మెరిశాడు చంద్రరావు. రఘూ సమాధానానికి అంగీకారంగా తల ఎందుకు వూపానా అనుకున్నది.

చంద్రరావు బి. యస్. సి. ఫెయిలయ్యాడు. ఒక చెంపని ట్యూషన్లు చెప్పకోడంలో, ఒక చెంపని తన పెళ్ళివ్యవహారాల గజిబిజిలో చదువు సాగలేదేమో అతనికి. మళ్ళీ యిహ చదవనన్నాడు. పెన్సిల్ మాన్యుఫాక్చరింగ్ పెట్టుకోవాలని అతని కొక ఆశ.

దానికి రెండుమూడు వేలన్నా కావాలి. మెషినరీకిగట్రా. చంద్రరావుకి తెలియందిలేదు. ఎలక్ట్రిక్ వర్క్సులోగాని ప్రెస్ వర్కులోగాని, ఏ పరిశ్రమలో ఎంత గిట్టుబాటవుతుందో అవలీలగా అంచ

నాలు వేయగలడు. అన్ని పరిశ్రమల కీలకాలూ అవగాహన చేసుకోగలడు. మామయ్యతో అతను కొన్ని కొన్ని పథకాలు చర్చిస్తుంటే ఆ పరిభాషే అర్థమయి చచ్చేదికాదు. డబ్బులేనివాడి బుర్ర ఎంత చురుగ్గా పనిచేస్తుందో ఆమె కర్థమయింది.

నెలలు గడిచినై.

మామయ్య ఒక శుభవార్త తెచ్చాడు. చంద్రరావుకి ఆంధ్రవిద్యాలయం బహుమతేదో వచ్చిందట మూడువేలట! "ఏదో పాపం, గుడ్డిలో మెల్ల" అని సంతోషించాడు మామయ్య. పేపర్లోపడి వారం రోజు లయిందట...తను చూడనేలేదు. లాడ్జికి వెళ్ళి వొకసారి పలకరిద్దామా అనుకున్నది. తనతో చెప్పలేదని కొంత రోషంగానూ వున్నది. ఆవేళ రవణని సినిమాకు లేవదీద్దామని ప్రయత్నించింది. వాడు రథోత్సవం సరదాలో పడివున్నాడు. మహా చికాకు పడ్డది. ఆవేళ సినిమా రకరకాలా వర్ణించి చెప్పింది. వాడి బుర్ర కెక్కలేదు. విసుక్కుంది. మామయ్యతోకూడా వెళ్ళి అతన్ని అభినందించవద్దామనుకున్నది. కాని అతను పట్నానికి వెళ్ళాట్ట. సరిపోయింది! ప్రైజందుకొందుకు గావును. ఆమె నిరుత్సాహపడింది.

శశిరేఖా రామచంద్రయ్యగారూ, కుటుంబ సమేతంగా పెంటపాడు వెళ్లిపోయారు. చంద్రరావు మళ్ళీ రాలేదు. కాకినాడకి వెళ్ళిపోయాడేమో తెలియదు. మామయ్యకీ అతనికీ ఉత్తరప్రత్యుత్తరాలు నడుస్తుండటం గమనించింది.

ఆనాడు శ్రీరామనవమి. వూళ్లో భరతనాట్యం. పిల్లా మేకా అంతా వెళ్లారు.

శశిరేఖ గబగబా కంచాలు కడిగేసి గొడ్డిగేదెకు కుడితి గోలెంలో పోసి ఇంటికి తాళంపెట్టి తనూ వెడదామని ఆలోచిస్తోంది. ఎవరో లోపలి కొస్తున్నారు, "అత్తయ్యా" అని పిలుస్తో; "లేరండీ" అని కేక వేసింది. గబగబా పెరట్లోకి వచ్చాడతను. చంద్రరావు! నైట్ క్వీన్ మొక్క సువాసనలు గుప్పున విసిరికొట్టింది. అతను మాంచి ఉత్సాహంగా వున్నాడు. "కూచో బావా" అని ముక్కాలిపీట నూతికి దగ్గిరసా లాగింది. "వో మాట చెబ్దామని వచ్చాను శశీ." చందమామవంక చూస్తున్నాడతను. "నేను పది మాటలు మాట్లాడదామనుకుంటున్నాను సరా" అని జడలో చెండు సర్దుకున్నది శశిరేఖ. "రఘు సంబంధం సెటిలయింది." ఎంతో సంబరపడుతుం దనుకున్నాడు. పైపెచ్చు "చట్, ఈ మగతనంలేని సంబంధాలన్నీ చూస్తావెందుకు బావా నువ్వు" అని చీదరించింది. సరిపోయింది! "ఈ నటన కేమిలే" అని వోరకంట చూచాడతను—"అంటే, ఆ రఘుమీద నాకు తహతహగా వున్న దనుకుంటున్నావుకదూ నువ్వు?"

"పోనీ ఆ తహతహ అతనిమీద నీకు కాదుగాని, వాడికి నీమీద, సరేనా!"

"అయ్యో రామ! నామీద అంత తహతహగా వుంటే వొక రెండు వేలు ఎక్కడైనా తెచ్చుకుని చదివించుకోరాదూ"

"ఆ అరేంజిమెంటే చేసివచ్చా. నా ప్రైజు సొమ్ము రూ 3000/ లు చెక్కు వచ్చింది. అతనికి ఎండార్సుచేసి యిచ్చేసివచ్చాను."

"పాపం యిహ కులుకుతూ పెళ్లి చేసుకుంటానన్నాడుకదూ—దేవయ్య!"

"శశీ, నీకు కాబోయే భర్తనట్లా ఈసడించకూడదుసుమీ" అతను సీరియస్ గా మొహం పెట్టాడు.

"నా పెళ్ళి నువ్వు చూడనక్ఖర్లేదు తెలిసిందా"

"చూడనక్కర్లేదూ?"

"అక్ఖర్లేదు. నేను చూచుకోగలను. చూచుకున్నాను గూడా."—అతని జేబులో వున్న ఫౌంటెన్ పెన్నులాగి అతని అరచేతిలో వ్రాసూ వర్ణక్రమం వల్లిస్తోంది. నకార ఈకారములు "నీ" వకార ఏకారముల "వే"—చెయ్యి లాక్కున్నాడతను. నూతిపక్కని అతని సరసనే నుంచుని కొంటెగా అతని కళ్లల్లోకి చూచింది శశిరేఖ.

"ఇట్లా బుద్ధిపుట్టిందేమిటీ" అతనికి నిజంగానే కోపమొచ్చింది.

"ఇదంతా కృతజ్ఞత గావును. అవునా?"

"ఛ—కృతజ్ఞతా? నీకా? దేనికీ? తిరిగావనా? బావుంది. ఎవరికోసం తిరుగుతావు" కిలకిల నవ్వింది. అతను మౌనంగా వూరుకున్నాడు. "నిజంగా బావా, నువ్వు నాకు అందంగానే వున్నావు." అతను ఫక్కున నవ్వాడు. ఆమె బుంగమూతి పెట్టి "నేనబద్ధాలాడను, తెలుసా" అన్నది వోరచూపుగా.

"నేను నవ్వుతాలకి రాలేదు శశీ—నా శశిని మకిలికళ్ళతో చూడలేదు నేను. నీలోని ఈ క్షణిక దౌర్బల్యాన్ని వుపయోగించుకుంటా ననుకున్నావేమో"

"ఏమిటి బావా, నిజమా?" ఆమె బిక్క మొహం పెట్టింది.

"నీ పెళ్లికి రఘు తండ్రీ, నీ మేనమామ రామచంద్రయ్యగారూ, ఇవాళనే తాంబూలాలు పుచ్చుకున్నారు సర్వవరంలో. ముహూర్తం నిర్ణయమయిపోయింది. నీతో చెప్పిపోదామని వచ్చాను. తొమ్మిది గంటలబండికి మద్రాసు పోతున్నా. ఇక మళ్ళీ మనం కలుసుకోము బహుశా." అని గబగబా వెళ్ళిపోతున్నాడతను "నాకీ పెళ్ళి అక్కర్లేదు." అని గునుస్తో చొక్కా పట్టుకుంది. అత నాగాడు.

"శశీ, నీమనస్సు నీకు తెలియదు. నాకు తెలుసు. రఘు బుద్ధిమంతుడు, చదువుకున్నవాడు. తగినంత ఆర్థికస్తోమతు కలవాడు, నీ ఆకర్షణకి గురి అయిన అదృష్టవంతుడు, నిన్ను ప్రాణప్రదంగా చూచుకుంటాడు, పిచ్చిపిల్లా, బావ యేదో నాలుగుసార్లు నీకోసం ఇటూ అటూ తిరిగాడుకదా అని, నీ హృదయాన్ని అర్పణ చేసుకోవాలని చూస్తున్నావా? పో! పో! పోయి కళకళలాడుతూ జీవితంలోకి అడుగుపెట్టు. నన్ను మరిచిపో. లేకుంటే చిక్కులపాలయిపోతావుసుమీ"

తల వంచుకుని వింటోంది శశి. అతను వెళ్ళిపోతున్నాడు. "బావా, బావా" అని పిలుస్తోనేవున్నదామె. ఏదో బరువు దించేసుకుని పారిపోతున్నవాడల్లే కనిపించాడు. శశిరేఖ అట్లానే నిలబడిపోయింది. వేడివేడి కన్నీళ్లు ఆమె చెంపలమీదనించీ పెరట్లో గుమ్మంముందు పోగుపడివున్న ఎండురావాకులమీద చిటపటమని రాలాయి. పక్కయింటి మదురుగోడ మీదనుంచి వాలిన సరుకు చెట్లనీడలు చీల్చుకొంటూ పోతున్నాడతను. తన జీవితంలోకి వద్దు పొమ్మన్నప్పుడు వచ్చి, రా రమ్మన్నప్పుడు వెళ్లిపోతున్న ఉదారమూర్తి! అందాన్ని గుర్తించగల ప్రజ్ఞా, హృదయాలు పంచుకోగల నేర్పూ తనకి అలవరచిన త్యాగమూర్తి!! ఏ పాటలూ ఎరుగని, ఏ కృతులూ మోగని, తనలో ఎన్నడో బూజుపట్టి, ఏమూలనో పడివున్న అనురాగ వీణని అతిసున్నితంగా మీటి, పోతున్న గంధర్వమూర్తి!!!

అతను ఇక రాడు!

# యక్షగానములు : సాంప్రదాయిక పాత్రలు

శ్రీ యస్. వి. జోగారావు

ప్రాయికముగా ప్రతిదేశ జానపదరూపకములలోను యేవో కొన్ని సాంప్రదాయిక పాత్రలుంటాయి ఇతివృత్తి మేదైనా ఆపాత్ర లన్నికథలతోను పొత్తు కుదిరేటట్లుగా ఉంటాయి. ఆ సాంప్రదాయిక పాత్రల తత్త్వము పరిశీలిస్తే అందులో చాలా మట్టుకు హాస్యరసప్రసక్తికోసం ఉద్దేశింపబడినట్లు ఉంటాయి. రుచులలో ఉప్పెటువంటిదో రసములలో హాస్య మట్టిది. అది సర్వజనమనఃపర్వమైనది. విద్వత్పారిషదుల కుద్దేశింపబడిన సంస్కృత నాటకాల్లోనే విదూషకపాత్ర గతానుగతికంగా కనిపిస్తుంది. అటువంటప్పుడు ఆరంభించినది మొదలు జాగరం చేయించే మన జానపద ప్రదర్శనాల్లో మధ్యమధ్య ప్రేక్షకుల కులాసాకీ ఖుషికీ కొంత వెసులుబాటు అవసరం. అందుకే ఆ పాత్రలు. ఆ పాత్రల వినోద ప్రసాదం అభినవ నాగరకులకు వెగటనిపించవచ్చును. కాని, మన యక్షగానాల విషయ మెత్తుకుంటే అవి యీనాడు మనకెంత మోటుసరుకనిపించినా ఒకనాడు కోటలోని రాజుకీ పేటలోని ప్రజలకీ సమానమైన కాలక్షేపంగా పరిఢవిల్లినవి. అసలా గ్రంథ రచన కావించినవారిలో గ్రామకరణాలే కాదు పండితగ్రామణులు, రాజకవులుకూడా ఉన్నారు. మరొకమాట ఆ ప్రదర్శనల ప్రేక్షకసమాజంలో యెక్కువపాలు ప్రజాసామాన్యము. వారికి కావలసినది విజ్ఞానమే అయినా వా రెక్కువగా కాంక్షించేది వినోదమే. ఆ వినోదకాంక్షలోనూ, తరాలుగడచినా ప్రజాభిరుచిలో, వారిలో వైజ్ఞానికపరిణామము వేగముగా రాదు కాబట్టి, ఏదో సమీచీనమైన సమానత్వము గోచరిస్తుంది. వారి ఊహాపోహాలు, ఆశయములు, ఆదర్శములు సమయబద్ధములు. అందుచేతనే వా రభిలషించే ప్రదర్శనములలో కొన్ని పాత్రలలోగూడ సాంప్రదాయికత పాదుకొన్నది. ఆ పాత్రలు ప్రజాదరం మూరగొని ప్రచారానికి వచ్చినవి. అప్పటి రూపకకర్తలది గుర్తించి, సంప్రదాయవిధేయులై తా మేకథ నెత్తుకొన్నా ఆ పాత్రల కెలాగో ప్రసక్తి కల్పిస్తూ వచ్చారు. తోలుబొమ్మలాటలో బంగారక్క జుట్టుపోలిగాడు, గంధోళిగాడు మొదలైన సరుకు మొదట యిలా బయలుదేరినదే. అలాగే యక్షగానాల్లోనూ, తద్రూపాంతరములైన కలాపములు, కొరవంజులు మొదలగువానిలోనూ కొన్ని పాత్రలు, అన్నీ హాస్యరస ప్రసన్నములే, సాంప్రదాయికముగా రూపొందినవి. ఆ పాత్రల హాస్యప్రవృత్తిలో సామాన్యజీవిత స్పర్శ వుంటుంది. తత్తత్పాత్రోచితమగు నాటి వ్యావహారికపు నుడికారము కైవారముకూడా తెలుస్తుంది.

ఒకొక్కపాత్రనే మెతుకుపట్టి చూద్దాం.

మాధవి:—ఇతగాడి పాత్ర కూచిపూడి కులపతుల అపూర్వసృష్టి. ఇతడు పాత్రంటే పాత్రకాడు. కాడా అంటే ప్రతి భామకలాపంలోనూ విధిగా ప్రత్యక్షమౌతాడు. గొల్లకలాపాల్లో కదాచిత్తుగా కనిపిస్తాడు. కాని సత్యాకృష్ణ సంబంధులగు పారిజాతాది కథాసందర్భము లితివృత్తంగాగల చాలా యక్షగానాల్లోకూడా తరచుగానే కనిపిస్తాడు. మాధవి సూత్రధారుని వలె కథానుసంధానం చేస్తాడు. విదూషకునివలె హాస్యప్రసంగాలు వినిపిస్తాడు. పాత్రలను ప్రేక్షకులకు పరిచయం చేస్తాడు, స్వయంగా పలకరిస్తాడు. ఇత డచ్చుమచ్చు సింహళదేశపు నృత్యరూపకము 'కోలం నాటిమా' లోని 'తోరాతరు కథాకారయ' లాంటివాడు. బర్మాదేశపు వీధినాటకము 'నిభటొకిన్' లో 'లూ—బయట్' లాంటివాడు. యథార్థాని కితడు కథాగత పాత్రకాడు. అలాగని కేవలం వెనకనుండి హంగుచేసే అక్కొబత్తుడూ కాడు. కథకు కలిసివచ్చేపాత్ర. నాయికానాయకు లిద్దరికీ శృంగార సహాయకుడుగా వ్యవహరిస్తాడు. వారిద్దరికీ మధ్య దౌత్యంకూడా నడుపుతాడు. వారిని వెటకారం చెయ్యడానికి 'లైసెన్సు' కూడా సంపాదించాడు. చెంగల్వరాయ పారిజాతాది యక్షగానకృతుల్లో వారి ప్రసంగాలకు 'పేరడీ'లు కూడా చేశాడు. మాధవి వేషం వేసేవాడు మగవాడే, ఆ ప్రదర్శక ముఖ్యు డెవడో వేస్తాడు. అసలా వేషానికొక నిర్దిష్టమైన ఆహార్యకమేమీ లేదు. పైమీద కండువావుంటే చాలు. మామూలు పంచెకట్టుతో దిగిపోవచ్చు ప్రదర్శనలోకి. నాయకుని పలకరించినప్పుడు మగధీరునివలెనే కండువా సవరిస్తాడు. నాయికను పలకరించేసరికి ఆ కండువానే పమిటగా సవరించి బుగ్గమీద వేలూ, నడుంప్రక్క కేలూ పెటుకొని నడ

కలో మాటలోకూడా ఆడారివాటం తెచ్చిపెట్టుకుంటాడు. అతడు అక్కల్లో అక్క, బావల్లో బావ. మాధవికే మాధవుడని కూడా పర్యాయ వ్యవహారమున్నది. మాధవ మాధవీ నామధేయాలు కృష్ణునికి, అతని సఖులకు మాత్రమే వర్తిస్తాయి. కాని, యీ భామాకలాపం సీసరుబుద్ధికికూడా ఆ పేళ్ళు పెట్టారంటే యేదో విశేషముండాలి. అప్పుడప్పుడు కలాపంలో నాయికా నాయకులకు పరస్పరం గాని, మరెవరితో గాని మాట్లాడడానికి అవకాశం గాని ఔచిత్యం గాని లేని సందర్భాలుంటాయి. కాని, పాత్రలు తమ మనస్స్వరూపము ప్రేక్షకులయెదుట పెట్టాలి. అందుకు 'స్వగతము' నాశ్రయించాలి. అసలే కలాపము ఆత్మాశ్రయఫక్కీలో నడిచే రూపకము. అందులో యీ స్వగతాలుకూడా వుంటే ప్రేక్షకులకు విసుగుదల హెచ్చవచ్చు. అదిగాక స్వగతాలు అసహజమైనవంటారుగదా కొందరు. బహుశా ఆ స్వగతాలను పరిహరించడానికే మాధవిపాత్ర ప్రకల్పితమైనదని ఊహించవచ్చు. ఎందుచేతనంటే ఒక మాధవుడింకొక మాధవునితోనూ, ఒక మాధవి యింకొక మాధవితోనూ మాట్లాడడమన్నది చాలా విచిత్రంగానే కనిపిస్తుంది, కాని, అలా మాట్లాడేరంటే పాత్రలు తమలో తాము మాట్లాడుకున్నట్లే జమ అవుతుంది. కలాపధర్మానికి కలిసివస్తుంది, దాని ఆత్మాశ్రయ ఫక్కీకి ఢోకా వుండదు. విసుగు పుట్టించకుండా నాటకం చక్కా నడిచిపోతుంది. అందుకే కలాపంలో మాధవి కథాగతపాత్ర కాకపోయినా కలిసివచ్చే పాత్ర అనడం.

సుంకరి కొండడు:—గొల్లకలాపాల్లో చూడాలి వీడి వాలకం. అన్నింటిలోనూ వాడి పేరు కొండడే. వీడు గుజరాతీ భావైలో 'రంగోళో'లాంటివాడు. లాలాకన్నయ అనే ఆయన రచించిన సుంకరికొండడి వేషము 'కథ' అనే యక్షగాననాటకంలో వాలక మిల్లా వర్ణింపబడింది.

గడితపు చల్వ చల్లడము పైన బిగించి
తగ రాణమెరయ గాదట్టి జుట్టి
పిక్కటి బిరుదుగా బిగియుచుంగురుగుంటి
చొక్కాయి పిక్కల నంట దొడిగి
జరికుసుంబారంగు శాలుపాగా మీద
రవగుల్కు కల్కితురాయి చెక్కి
గుభ గుభాళించు సౌరభము గుల్కెడి మేన
కమ్మదుప్పటి వేటుగా నమర్చి
కత్తి ఝళిపించి వరకరాగ్రమున నుంచి
వాడి కొనగోళ్ళ మీసంబు దీడి దీడి
దుండగీడౌచు సుంకరి కొండ డదుగో
వచ్చె కాబోలు వినవమ్మ వారిజాక్షి.

వాడి రాకపోకలు చెడబిసురుగా వుంటాయి. ఈలపాటలు పాడుకొంటూ హేలగా వస్తాడు. వచ్చి చల్లనమ్మే గొల్లభామను సుంకముగాని 'తత్ప్రత్యామ్నాయ' చుంబనము కాని యిమ్మంటాడు. ఆమె తప్పించుకోడానికి ప్రయత్నిస్తుంది. ఇక యిద్దరికీ వాగ్వివాదము. ఆ వాదం చాలా సరదాగా నడుస్తుంది. కాని, మోటుగా వుంటుంది. గొల్లభామ తన గయ్యాళి అత్తగారిని పిలుస్తాను చూసుకో అని బెదిరిస్తుంది. వాడసాధ్యుడు, 'సత్త లోగడను మీ యత్తమాకు' అంటాడు. చివరకు చెయిముట్టుకు సరసానికి కూడా దిగుతాడు. కాని, గొల్లకలాపాల్లో ఆ అత్తగారు రంగంమీదికి వచ్చి సుంకరిని గద్దించి కోడలుపిల్లని తీసుకొనిపోతుంది. ఇన్ని కబుర్లు చెప్పిన సుంకరీ ఆమె రాగానే బిక్కచచ్చిపోతాడు. కొన్నిట్లో అత్త రాకుండానే సుంకరే గొల్లభామను సరసంగానో బలవంతంగానో లాక్కుపోతాడు. గొల్లభామలుకూడా అత్తచాటున కర్చుపెట్టుకోడానికి సుంకండబ్బులు కలిసివస్తాయనో, నిజంగా కులాసాపుట్లో సుంకరి సరసానికి సై అనడం కద్దు. దీనినిబట్టి నాటి సుంకరి గొల్లభామల అల్లరిచిల్లర ప్రవర్తన విశదమౌతుంది. అసలు గొల్లకలాపానికి అంతరార్థం మరొకటున్నది. సుంకరి కృష్ణపాత్రకొక సంకేతము. గొల్లభామ గొల్లభామే. అందుచేత గొల్లకలాపము గోపికా కృష్ణ ప్రణయతత్త్వ ప్రతిపాదకమన్న మాట. ఈ ఊహకు బలకంగా శ్రీనివాసదాసు రచించిన రంగపురి పారిజాతం అనే ఒక అముద్రిత యక్షగానంలోనూ, లాలాకన్నయ గ్రంథంలోనూ శ్రీకృష్ణుడే సుంకరివేషం ధరించినట్లు స్పష్టంగా వుంది. కన్నయ గ్రంథంలో భాషలో విలక్షణత, భావాలలో విరసత్వము వున్నా సుంకరి కథ బాగా రక్తికట్టింది.

కటికము:—కటిక, కట్టియం, కటికీడు, కోలకేతి నాయుడు, కేతడు, ఆస్థాన సంతోషి, సంతోషుడు, బాగుదారు, చోపుదారు, బరాబరి అని వీడికి చాలా పేళ్లున్నాయి. యక్షగానములందు రాజప్రసక్తివచ్చే కథ లెక్కువ. కటికము రాజోద్యోగి. రాజకథాప్రసక్తిగల యక్షగానములందెల్ల వీడి అవతారం విధిగా వుంటుంది.

రాజంటే కేవలం రాజే కానక్కరలేదు, ఇంద్రుడూ శివుడూ మొదలైనవారుకూడా కావచ్చు. రాజపాత్రకు ప్రసక్తి లేని యక్షగానాల్లో కూడా అక్కడక్కడ వీడి అవతారం కనిపిస్తుంది. వాడి పేర్లనుబట్టి వాడి పనులు విశదమౌతాయి. వాడు రాజుగారివాకిలి కావలివాడు— వేత్రహస్తుడు. రాజుగారి రాక సభవారికి తెలియచేస్తాడు. రాజుగారిముందు నడుస్తూ త్రోవ కడ్డు తొలగిస్తాడు. రాజుగారు వచ్చి గద్దెనెక్కగానే కైవారములు, హెచ్చరికలు, పరాకులు పలుకుతాడు. వీడి పేర్లన్నింట్లోనూ యెక్కువ ఆకర్షించేది 'ఆస్థాన సంతోషి' అన్న పేరు. అంటే 'కోర్ట్ ఫూల్' అన్నమాట. ఉత్త సంతోషుడు అన్న పేరు 'బఫూన్' అన్నమాటకు సమానార్థకంగా గ్రహించవచ్చు. దక్షిణాంధ్ర యక్షగానాల్లో వీడి పాత్ర బాగా రూపు కట్టింది. తరువాత తరువాత ఉత్తరాంధ్ర కృతుల్లోనూ వీడి వునికి తరుచుగానే కనిపిస్తుంది. అసలు తంజావూరు నాయకరాజుల మహారాష్ట్ర భూపతుల కొలువులో చాలా ప్రాముఖ్యం వహించిన రాచతైనాతీ. వాడి దొక వెర్రిగొల్లని వాలకం. ఆ రాజులు హాస్యచతురాస్యులు. వాడికి బోలెడు చనవిచ్చిరి. వాడు తన సహజ వికృతాకార చేష్టా భాషణాదికము వలన కొంత నత్తియో చెవుడో నటించి, కొంత హాస్యము ప్రదర్శించెడివాడు. ఆ తంజావూరి రాజకవులు, తదాస్థానాశ్రితులైన తక్కిన కవులును తమ . గానకృతుల్లో కేకముపాత్ర ముచ్చటదీర చిత్రించుకొన్నారు. యక్షగానాల్లో (ఇవి అముద్రితములు) వీడి పాత్ర యింకను విశిష్టముగా చిత్రింపబడ్డది. అందు శివసంబంధులగు కృతులలో కుండోదర, కుంభోదర, చండికేశ్వరాది ప్రమథ శ్రేష్ఠులను మామూలు కటికీళ్ళవలెనే వ్యవహరించిరి. కటికమునకు వికటాంగుడను పేరు కూడ పెట్టినాడు శహాజి. వాడి వాలకము, దరువు...

పట్టెనామమూను బెట్టి, బారికోల కేలపట్టి
దట్టిపైని దుప్పటి గట్టిగా గట్టి
జుట్టునిండా పూలు సుట్టి, మిట్టా పంప్లనెగబెట్టి
యట్టాహాసముతో వికటాంగుడు వచ్చెన్.

చాల గ్రంథములందు సర్వసాధారణముగా కటికము రాకతోనే కథారంభమగును. వాడు భాగవతులతో హాస్యప్రసంగములాడుటయు కొన్ని గ్రంథములలో గలదు. గ్రంథములో వాడి హాస్యమున కెక్కువ అవకాశమిచ్చుపట్టు రాజదర్శనార్థులరాక వచ్చినవారినెల్ల యెకసక్కము చేయుట వాడిపని.

సింగి, సింగడు:— చెంచులు, ఎఱుకలు, కొరవలు అను కొండజాతులకు చెందిన దంపతులు వీళ్ళు. తాము చెంచుకోబకు అంటే గరుడాద్రి నారసింహుని వారసులమని వారి విశ్వాసము అందుకే ఆ పేళ్ళు. సింగడికి వేట వృత్తి. సింగికి సోది వృత్తి. సింగడు అడవికోనలు వేటతోపాటు వెళ్ళి వెల్లంకుల సంపాదనకూడా చేస్తాడు. సింగి దేశద్రిమ్మరియై సోదెతోపాటు ఆ వేళ్యా వెల్లంకులు అమ్ముతుంది. వారి వేషభాషలు, కులాచారాల్లో సగం ఆటవికత్వము, సగం దేశద్రిమ్మరితనం కనిపిస్తుంది. చెంగల్వరాయ పారిజాతం అనే - అముద్రిత- యక్షగానంలోని ఎఱుకల కథవల సింగి పచ్చబొట్లు కూడా పొడుస్తుందనీ, శకునాలు సాముద్రికం కూడా చెపుతుందని తెలుస్తుంది. సన్నిధిరాజు జగ్గకవి జ్ఞాన— ఎఱుకల కురవంజి మొదలైన గ్రంథాల్లో కూచిపూడి గొల్లకలాపంలో గొల్లభామలాగ వేదాంతోపన్యాసాలు కూడా చేస్తుంది. సింగడికి చోడిగాడనికూడా పేరు. ఆ పదం ప్రియుడు అనే అర్థంలో కోవెల రాఘవదాసు ప్రణయ కలహకలాపం, (అముద్రితం) కూర్మనాథకవి మృత్యుంజయవిలాసము మొదలగు యక్షగానాల్లో వాడబడింది. దాని అసలు స్వరూపం 'కోడెగాడు' అయివుంటుందని ఊహ. సింగికి ఎఱుక, కొరవజాతుల స్త్రీ అనే అర్థంలో ఎఱుకత, కొరవంజి అనికూడా పేళ్ళున్నాయి. అసలా మూడు సమానార్థకాలుగా వాడబడినవి గ్రంథాల్లో— ఉదాహరణకు: గిరిరాజ కవిరాజ మోహన కొరవంజి (అముద్రితం). చాలా యక్షగానాల్లో సింగీ సింగళ్ల ప్రసంగం వస్తుంది. కాని సింగిపాత్రకున్న ప్రసిద్ధి సింగడికి లేదు. ఆమె పాత్రకు ప్రాధాన్యముగల కొన్ని గ్రంథాలకు ఆమె పేరే పెట్టబడింది.

అవే కొరవంజులు. యక్షగానములకు కొరవంజులకు లక్షణప్రక్రియలో భేదము లేదు. కొరవంజుల్లో ఎఱుకత పాత్ర తప్పనిసరిగా వుంటుంది. యక్షగానాల్లో యాదృచ్ఛికము అంతే. కొరవంజుల్లో నైతేనేమి యక్షగానాల్లో నైతేనేమి సర్వసాధారణంగా ఎఱుకతపాత్ర ప్రవేశించే సందర్భము! కథానాయిక తాను వలచినవాని గూర్చిన తలపోతల్లో ఉంటుంది. అతని పొందు కుదురుతుందా కుదరదా అని అనుమానపడుతూ వుంటుంది. అప్పుడు వస్తుంది యెఱుకత. వచ్చి, తమ కులాచారము లుగ్గడించి, తన దేశాటన విశేషములు వివరించి, ఎఱుక దేవుళ్ళ నెకరువు పెట్టి సోది మొదలెడుతుంది. ఆ దేవుళ్ళ పరంపరలో యెవరి పేరు తప్పినా తప్పవచ్చు కాని కొల్లాపురి లక్ష్మి

పేరు తప్పదు ఆమె వారి కులదేవత. ఒక యక్షగానంలో 'కొల్లాపురమ్మను గొలుతుము మేము! ఎల్ల వారికి నది యిలు వేలుపమ్మ' అంటుంది...ఎఱుకత. ఆమె సోది అయిపోయేసరికి సింగడామెను వెదుకు కొంటూ వస్తాడు. ఆమె సోది చెప్పి సంపాదించిన సొమ్ములూ, అవీ చూసి మరెవడో యిచ్చివుంటాడని అనుమానపడతాడు. ఆమె సమాధానం చెప్పుకోవలసి వస్తుంది. అక్కడ వారి సంవాదం. ఆ ఘట్టము ఘట్టమంతా హాస్యరసోత్తరంగా నడుస్తుంది. కొన్ని కొన్ని గ్రంథాల్లో లక్ష్మీనారాయణాది దేవతలు కూడా సింగీ సింగళ్ళ నేపథ్యం స్వీకరించినట్లు తెలుస్తోంది. ఉదా: తరిగొండ వెంకమాంబ—అముద్రిత—శివవిలాస యక్షగానము మొదలైనవి.

మంత్రసాని:—శ్రీకృష్ణ, ప్రహ్లాద, మార్కండేయ, ధర్మాంగదాది బాలపాత్రల జననాదికమునకు ప్రాధాన్యముగల గాథలు గ్రహించిన యక్షగాన గ్రంథకర్తలు కొందరు మంత్రసాని పాత్రను తమాషాగా చిత్రించారు ఒక్క ఉదాహరణ—పాలుట్ల లక్ష్మణకవి ధర్మాంగద నాటకములో దాసీజనము రాణిగారికి ప్రసవసమయమైనదని మంత్రసానిని రమ్మందురు. దాని కెక్కడలేని బెట్టుసరి అప్పుడే వచ్చిపడినది. దాని సమయ మప్పుడే కదా! అయింతా 'అమావాస్యనాడు అట్లు బెడితిరె, పున్నమనాడు బూరెలు బెడితిరె' యిట్లా దెప్పడానికి లంకించుకుంటుంది.

ఇకపోతే, అంతంతమాత్రం తరచుగా వచ్చే చిల్లరమల్లర హాస్యపాత్రలు కొన్ని వున్నాయి. పురోహితులు, ముత్తైదువలు మొదలగువారు. వారి ప్రసంగాలు రంగాజమ్మ మన్నారుదాసవిలాసాదుల్లో కమ్మగా వర్ణింపబడ్డాయి. కొన్ని యక్షగానాల్లో హాస్యగాడని ప్రత్యేకంగా ఒక పాత్ర కనిపిస్తుంది. వాడు మాధవి కటికాల్లాగ వ్యవహరిస్తాడు. తంజావూరి యక్షగానాల్లో విఘ్నేశ్వరుని స్తుతిమాత్రమే కాకుండా విఘ్నేశ్వరుడొక పాత్రగా అతని రాకకూడా సంప్రదాయసిద్ధముగా ముచ్చటింపబడింది. ఉత్తరాంధ్ర యక్షగానకృతుల్లో కొన్నిట్లో గంధర్వస్త్రీల రాకడ అని గ్రంథారంభమున నే కథకు సందర్భశుద్ధి లేకపోయినను రంభోర్వశ్యాదుల రాకలు వారి గానాభినయముల ప్రసక్తియు చెప్పబడుట కద్దు. సత్యభామా రుక్మిణులు, గంగాగౌరులు, చెంచులక్ష్మి ఆదిలక్ష్ములు, మోహినీ సంధ్యావళులు మొదలగు నాయికల జంటలు వచ్చే యక్షగానాల్లో సవతి కయ్యమొకటి గతానుగతికముగా వచ్చుచున్న జనరంజకమగు విషయమైనది. భామాకలాపాల్లో దానిదొక ప్రత్యేకత.

తంజావూరు సరస్వతీమహాలు అముద్రిత గ్రంథసంచయంలో 'నాటక పాత్రలు' అను నొక గ్రంథమున్నది. అందులో నాడు ప్రదర్శనమున కెక్కిన రామాపండితాదుల నాటకము లిరువది మూడింటిలో వచ్చు వివిధపాత్రల, తత్పాత్రధారుల పేళ్ళుమాత్రము పట్టికలుగా నుదాహరింపబడినవి. అందు భిన్నభిన్నేతివృత్తములుగల గ్రంథాల్లో సామాన్యంగా కనిపించే పాత్రలు కొన్నివున్నవి. అవి విఘ్నేశ్వరుడు, ప్రమథగణాలు, మణియం కురుక్కళు, పరిచారకుడు, బిక్కాజినాయడు, మహల్దారులు, సుయిణి, బుగడవేషం, కైకొండనీ వేషం, జోసి మొదలైనవి. పై పాత్రలలో కొన్నింటి స్వరూపం యీనాడు మన ఊహాకందదు. పోనీ మనకు దొరికిన ఆనాటి యక్షగానాల్లో నైనా కనిపిస్తాయా అంటే మచ్చుకైనా కనిపించవు అందులో మొదటి నాలుగైదు పాత్రలు నాటక పూర్వరంగ ప్రవర్తన కుపయోగపడునవి. అందు మణియం, కురుక్కళు అరవమాటలు. మణియం అంటే మఠగ్రామాయతనాద్యధికారి, కురుక్కళంటే పూజారి లేక పురోహితుడు అని అర్థం వాళ్లిద్దరూ ఆ యిరవైమూడు నాటకాల్లోనూ కనిపిస్తారు బిక్కాజినాయకుడు తొమ్మిది నాటకాల్లో కనిపిస్తాడు. ఆ బిక్కాజి శబ్దానికి అర్థం తేలలేదుకాని కటికంలాంటి పాత్రగాని అయివుంటాడేమో అని తోస్తుంది.

యక్షగానాల్లోని సాంప్రదాయికపాత్రలను గురించి సంగ్రహంగా మనవిచేసుకున్నాను. ముఖ్యమైన పాత్రల స్వరూపస్వభావాలు నిరూపించడానికి కొంత ప్రయత్నించాను. యక్షగానాలు ప్రధానంగా ప్రజాసామాన్యపు వినోదానికి ఉద్దిష్టమైనవి. అందుచేత అందులోని సాంప్రదాయికపాత్రలు కూడా హాస్యరసాశ్రయాలుగా వుంటాయి. ఒక్కొక్కప్పుడా పాత్రలు చేసే పరిహాసం యెగుటి పాత్రల పాత్రతాపాత్రతలనుగూడా లెక్క పెట్టదు. అది శోచనీయమైన విషయమే అంతమాత్రంచేత మన మా కావ్యరాశినంతటినీ నిరసింపగూడదు. అందులో సాహిత్యజిజ్ఞాసువులు తెలుసుకోదగిన విశేషాలు, ఆ సాంప్రదాయికపాత్రలద్వారానే వెలువడేవి అనేకమున్నవి.

నాటిక

# ఆగంతుకము

శ్రీ మెట్టా వెంకటేశ్వరరావు

## పాత్రలు

| | |
|---|---|
| రామకృష్ణయ్య | వీరాస్వామి |
| ప్రభాకరరావు | రమణ |
| మాధవరావు | పార్వతి |
| కనకరాజు | వసుంధర |

* * ఇంట్లో ఒక హాలు, హాల్లో ఒకప్రక్కన టేబిల్, టేబుల్ చుట్టూ నాలుగు కుర్చీలు. ప్రక్కన పుస్తకాల బీరువా. మరోప్రక్కన మంచంమీద ప్రభాకరరావు పడుకుని ఉంటాడు

[అతని భార్య పార్వతి లోపలనుంచి వచ్చి]

పార్వ: ఏమండోయ్ .(దగ్గరకు వచ్చి) మిమ్మల్నే (కుదుపుతుంది)

ప్రభా: [ముసుల్తాడు]

పార్వ: మిమ్మల్నేనండీ! లేవరేం? ఎనిమిదైంది ఇంకేం నిద్దరండీ అంతూ పొంతూ లేకుండా? లేవండీ!

ప్రభా: అబ్బ! ఉండవే.

పార్వ: ఏమిటి వుండేటమండీ! ఎనిమిదైతేను. ఎంతసేపురా? (మొహంమీదనుంచి దుప్పటిలాగుతుంది)

ప్రభా: ఆగాగు. ఏమిటే నీ హడావుడి పొద్దున్నే. ఒక్క రోజన్నా కంటినిండా నిద్ర పోనిచ్చావే నన్ను? తెల్లవారనీవాయె, లేలే అని ఒకటే పోరు చెవికింద. మొగవాడు పెళ్ళంటూ ఒక దౌర్భాగ్యపుపని యేనాడైతే చేసుకున్నాడో ఆనాడే స్వస్తి, కమ్మటి నిద్రకి.

పార్వ: అవును పాపం, నాయూలంగా యెంత కష్టపడుతున్నారు. అనటానికి నోరెట్లా వస్తున్నదండీ! తెల్లవారనివ్వనూ—అయితే అయింది గాని లేచి తొందరగా మొహం కడుక్కోండి. లాంతరు 'సుకొచ్చేదా వెనకాల? పాపం చీకట్లో యేమన్నా తగిలి పడతారేమో...లేవం ,డి, కాఫీ చల్లారి పోతుంది. తొందరగా—

ప్రభా: ఎందుకు పోవాలి? పడుకురా.

పార్వ: పాచి మొహంతో నా—ఛా— నే నివ్వను.

ప్రభా: ఓసి నీ యిల్లు బంగారంగాను—ఎంత గడుగ్గాయి మనిషివే. (లేచి మెల్లిగా దొడ్లోకి వెళ్తాడు)

పార్వ: (పక్క చుట్టి, ఇల్లూడుస్తుంది. వాకిట్లో వంకాయలకేక వినబడుతుంది) ఇదుగో! వంకాయలూ ఎటా?

---

ఆంధ్ర విశ్వకళాపరిషత్ ఆంధ్రభాషాసమితి జరిపిన ఏకాంకిల పోటీలో ప్రథమ బహుమతినందిన నాటిక

[వాకిట్లోనుంచి 'శేష']

పార్వ: ఒక అరవీశెడు తుయ్యి. వస్తున్నానుండు (బుట్ట తీసికెళ్ళి పట్టుకొస్తుంది. ఇంతలోకే ప్రభాకరంవచ్చి కుర్చీలోకూర్చుని మొహం తుడుచుకుంటాడు)

ప్రభా: కాఫీ తీసుకురా—

పార్వ: (తీసుకొచ్చి బల్లమీద పెడుతుంది) చిత్తగించండి.

ప్రభా: నోటికి పట్టాలి.

పార్వ: పసిపిల్లలకి మల్లేనా.

ప్రభా: ఆపని యెటు దిరిగీ లేదుగా! నాకన్నా ఫట్టు (తీసుకుతాగుతూంటాడు)

పార్వ: ఏం? కావాలని అంత ఉబలాటంగా ఉందా!

ప్రభా: అదెందుకు లేనిపోని బాధ. లేకుండా ఉంటేనే యెనిమిదింటి కిస్తున్నావు కాఫీ. ఉంటే అసలు తిండికూడా పెట్టవు.

పార్వ: అయితే స్వామీ! తమరు పానుపు దిగటమే యీవేళకిగదా, ఆరింటికే చేసి నిద్రపోతున్నా సరే బలవంతంగా నోరుతెఱిచి చంచాతో పొయ్యమని సెలవా?

ప్రభా: ఒసే నీకేం తెలియకపోబట్టిగాని ఋగ్వేదంలో యేంచెప్పేడో తెలుసా శుక్రాచార్యుడు—

యాదదాతి పత్యై కాఫీమ్
ప్రాతఃకాలే దినమ్‌దినమ్
సా ఏవ పవిత్రానారీ
స్వర్గేపి కీర్త్యతే సదా—

అంటే 'ఏస్త్రీయైతే పెందలకడనే ప్రతి దినమూ భర్తకు కాఫీ యిస్తుందో ఆమెయే పతివ్రత. స్వర్గమునందుకూడా ఆమె కీర్తింపబడుచున్నది' అని. అయితే యిక్కడొక చిన్న మతభేదముంది. ప్రాతఃకాలమంటే యెన్నిగంటలప్పుడూ అని. ఈశ్లోకానికి వ్యాఖ్య వ్రాస్తూ ఐతంపూడి నారాయణస్వామి దీక్షితులవారు 'ప్రాతఃకాలే ఇతి కించిత్సూర్యోదయానంతరే' అంటే, కొద్దిగా యెండెక్కిన తర్వాత అని సెలవిచ్చారు. దీన్ని ఖండిస్తూ కొండూరు లక్ష్మీపతి భట్టాచార్యులవారు 'కించిత్సూర్యోదయానంతరే ఇతి ప్రామాదికవచనమ్; కదా భర్తా తల్పాదుత్తిష్ఠతి తదైవ ప్రాతఃకాలమ్' అని సెలవిచ్చారు. అంటే 'కొంచెం ప్రొద్దెక్కినతర్వాత' అన్నమాట పొరపాటు— ఎప్పుడు భర్త నిద్రపక్కనుండి లేస్తే—అదే భార్యకి ప్రాతఃకాలము కాబట్టి లేచిందాకా నిరీక్షిస్తూ లేవంగానే యివ్వవలెను' అని.

పార్వ: అయిందా . యింకేమన్నా ఉందా వ్యాఖ్యానం—అయితే స్వామీ! కాలేజీలో తెలుగు మేష్టరు పని యీ పాండిత్యంతో నేనా చేస్తున్నారు? అయితే త్వరగానే ఉద్వాసన చెబుతారు.

ప్రభా: ఏంపోతే ముష్టిఉద్యోగం? ఇంతకంటె భాటోక్రావ్ పని మరోటి లేదు.

పార్వ: మరెందుకు చేరేరు?

ప్రభా: ఏదో యీ పేరుతోనన్నా టౌన్‌లో కులాసాగా ఉండొచ్చునని — అరెరె — కొంప మునిగింది.

పార్వ: (కంగారుగా) ఏమిటి?

ప్రభా: ఏముంది అన్నీ రాత్రే తాగేశాగా.

పార్వ: సరే! ఇంతా చేస్తే సిగరెట్టా! ఏం యిప్పుడు లేకపోతే! అంత కుతేమిటండీ?

ప్రభా: ఒట్టి తెలివితక్కువ ప్రశ్న. గుడికి గోపురం దేనికి? చీరెకి అంచు దేనికి? నీకు నేను దేనికి? అట్లాగే కాఫీకి సిగరెట్టు. వాటిరెంటికీ అవినాభావ సంబంధం—ఇప్పుడు కొట్టుదాకా ఎక్కడ పోయేదే.

పార్వ: అంత అవసరమా?

ప్రభా: అయ్యో! అత్యవసరం. ఏం అలా అడుగుతున్నావ్ ఉందా?

పార్వ: (లోపలికెళ్ళి సిగరెట్టు అగ్గిపెట్టి తీసుకొచ్చి యిస్తుంది)

ప్రభా: ఏం? నువ్వుకూడా తాగుతున్నావా యేమిటి?

పార్వ: ఏం? తాగితే తప్పా?

ప్రభా: అబ్బే! తప్పేముంది? ఎంతమంది తాగటంలేదు గనక. మా కాలేజీ అమ్మాయిల్లో దాదాపు సగమ్మంది తాగుతారు; అట్లాగే నువ్వూ.

పార్వ: నాకదొక్కటే తక్కువ. పెట్టెలకి పెట్టెలు తగలేస్తుంటే రోగమొస్తుందేమోనని తీసి దాచాను.

ప్రభా: (సిగరెట్టు ముట్టించుకుంటూ బయటికి వెళ్ళిపోతాడు.)

[పెరుగుమనిషి రామక్క ప్రవేశము]

రామ: పట్టవమ్మా!

పార్వ: (లోపలి కెళ్ళి గిన్నె తెచ్చి పెరుగు వేయించుకుంటుంది)

రామ: ఈయ నేడీ?

పార్వ: ఇప్పుడే పొద్దుదిగి కాఫీతాగి దొడ్లోకి దయచేశారు.

రామ: ఏం ఇయ్యాల ఇంతాలిశ్యం.

పార్వ: ఏముంది నాటకం రిహార్సలని రాత్రి పన్నెండింటికి దయచేశారు కొంపకి.

రామ: నాటకాల గీటకాల కెల్లనియ్యి మోక వమ్మోయ్ పండంటి మొగాణ్ణి యేమంషవల్లో యేసుకున్నా కొంప కులోసవుద్ది.

పార్వ: మన మొద్దంటే ఆగుతారా యేమిటీ (నవ్వుతూ) ఇదుగో! మామగారొచ్చినప్పుడు చెబుతాను మీ అబ్బాయి నాటకాల్లో తిరిగి చెడిపోతున్నాడని.

రామ: అబ్బో! ఎలిక్కి పిల్లి సాచ్చెమంట. ఇంతకి పదాకు లెక్కువ సదివే డాయన. ఆయ నేం జేత్తాడు.

పార్వ: అదేమిటి రామక్కా మామగార్ని—

రామ: ఏం సంగనా చనుకుంటున్నావా మీ మావ<?—పోతా, తొందరగా పోసేసి పెందలాడి యింటికెల్లి గొడ్డనిప్పాలి. బుడ్డాడు లెగవటం లేదు.

పార్వ: అబ్బ వెళ్ళుగానిలెద్దూ తొందరేమిటి? అయితే యేమిటి కొద్దిగా చెప్పవ్ మామగారి సంగతి?

రామ: అబ్బో అదంతా పెద్ద బాగోతం. ఇప్పుడెక్కడ. అయినా సెప్పె మాటలు గాదులే అయి.

పార్వ: అదుగో నాదగ్గరకూడా రహస్యమేనా. ఎవరితోనన్నా అంటాననా! నేను కాపరాని కొచ్చినప్పట్నుంచీ యెరుగుదువే నిన్ను నాతో చెబితే యేం. ఏమిటి చెప్పు?

రామ: అబ్బే యేం లేదు. ఆయన గూడా ఒకప్పుడు కాల్జారిన మనిసేనని.

పార్వ: అదే ఎక్కడ—నువ్వసలు కూర్చోముందు. (చెయ్యిపట్టుకుని కూర్చోబెట్టి) ఆ! ఏమిటి? ఎక్కడా?

రామ: అయ్యో! మీ ఆయ నొస్తాడేమో బాగుండదు.

పార్వ: రాళ్లే యిప్పుడే వెళ్లారు.

రామ: ఒత్తేమటుకు నన్నేం జేత్తాడు. చిన్నప్పట్నుంచీ నా పాల్తో పెరిగినోడు.

పార్వ: అవున్లే—ఏదీ?

రామ: ఏముందీ. ఈపయోాజికుడు మీ అత్త కడుపున బడ్డాడు. ఆయన సాని.కూడెంమీద పడ్డాడు.

పార్వ: ఉహూ! ఎక్కడ ఏ వూరు?

రామ: బందర్లో వుండేదిలే వో సాని. నాలుగేల్లపాటు దాని ల్లిడిసిపెట్టలా. సివరకి మనూరి పెద్దమనుసులు కొందరు మీ అత్తనిగూడా యెంటేసుకు నెల్లి .డ బెమ్మపెలయం జేత్తే యెట్టాగోట్టా బయటపడ్డాడు. అప్పటికీ వొచ్చేవోడేనా. దాని కూ్కడా కడుపైతే యింకెందుకులే అని వొచ్చేశాడు. మొగాళ్ళంతా ఇంతేగా ఉండంత కాల ముండటం కడుపయ్యేతలికి గప్చిప్ గా తప్పకోటం—

పార్వ: అయితే మామగారు కూడా—

రామ: అబ్బో ఒకప్పడెలిగించినోడే. అయితే యేం పాపం అప్పట్నుంచీ మల్లీ యెక్కడా—మాట్టాడగొద్దు. చేసినపనికి సాలా నొచ్చుకునే వాడంట. మీ అత్త సెప్పేది నాతో. ఏదో అట్టా శనితోసుకొచ్చి తప్పటడుగేశాడు. ఆమాత్రం పెద్దమనిసుండాడంటమ్మా మనూర్లో.

పార్వ: అయితే యీయనగార్నిక జాగ్రత్త చెయ్యాల్సిందే.

రామ: అంతా అట్టాగే ఉంటారంటమ్మా పోట్టాడుకు నేరు కొంపదీసి నా మూలంగా. ఇకెల్తా పొద్దెక్కుతుంది.

పార్వ: ఏమిటి యింటిదగ్గర విశేషాలు. అత్తగారొకసారి రమ్మందూ మంచి సినిమా వొచ్చింది చూస్తారు.

ప్రభా: (ప్రవేశించి) ఏమిటేవో రహస్యాలు చెప్పకుంటున్నారు!

రామ: నీమీద సాడీలు సెబుతావుండయ్యా! అద్దరాత్తిరిదాకా యింటికి రావంట. నాటకాల్లో తిరిగి సెడిపోతున్నావంట. సలికాలంలో పెందరాడి కొంపసేరక మాబాద పెడతున్నావంట మీ నాన్నతో చెప్పి కొట్టిచ్చుద్దంట నిన్ను. ఆ మరి శేపోయినా ఆనిక్క బస్సులో మీనా న్నొత్తానన్నాడు. బోజన పేలకి వొత్తాడంట. యెల్తా (వెళ్ళిపోతుంది)

ప్రభా: అబ్బా! వేడిచేసిందే.

పార్వ: చెయ్యదూ మరి. అర్ధరాత్రిదాకా నిద్దరలేకుండా ఉంటూంటే.

ప్రభా: ఏం చెయ్యనే. నే నుంటేనేగాని అంతా సరిగ్గా ఉండదు.

పార్వ: మీ రెందుకండీ అక్కడ మీరేమీ వెయ్యరుగా.

ప్రభా: వెయ్యకపోతే మటుకేమే? నాటకం వ్రాసినవాణ్ణే నేనైతే నేనులేకుండా వుంటే యింకేం రిహార్సలు.

పార్వ: ఏదో చేప్పండి వంక. నే నేమన్నా మీ వెంట వచ్చి చూశేదాన్నా పెట్టేదాన్నా; యింట్లో పడుండేదాన్ని. మీయిష్టం వించేస్తే మటుకు కాదనే దెవరు?

ప్రభా: ఊఁ...అయితే పడించన్నమాట కడుపులో యేదో అనుమానం.

పార్వ: పడితేమటుకేం? మీ దారికేమన్నా అడ్డమా!

ప్రభా: నీ తస్సదియ్యా రెండేళ్లబట్టి కాపరం చేస్తున్నా యింకా నమ్మటం లేదే నన్ను.

పార్వ: ఏమో యెంతసేపు కావాలి కాలుజారటానికి. మహామహావాళ్లు యెంతో పెద్దమనుషు లనుకునేవాళ్లే తప్పటడుగులు వేశారు.

ప్రభా: అంత అనుమానంగా ఉంటే నువ్వు కూడా రారాదూ నావెంట.

పార్వ: ఏమిటీ! ఈసారంటే అన్నారు, ఇంకెప్పుడూ అనకం డామాట.

ప్రభా: ఏం?

పార్వ: ఏమేమిటండి. ఎక్కడన్నా కాపరం చేసుకుంటూ మర్యాదగా బతికే ఆడవాళ్లట్లాంటి చోటు కొస్తారుటండీ. ఎవరో బోగంవాళ్ళు రావాలి గాని.

ప్రభా: పొరపాటు గొప్పగొప్పవాళ్లే యెంతో గౌరవంగా బతికేవాళ్లే వస్తారు. మునిసిపల్ కౌన్సిలర్ గారి అమ్మాయిలు మా నాటకాల్లో డ్యాన్సు చెయ్యటానికి వస్తారు తెలుసా. నాకే కనక ఒక చెల్లెలున్నట్టయితే వాతోపాటు చదివించి నాటకాల్లో వేషాలు వేయించి ఒక గొప్ప 'స్టార్' ని చేసేవాణ్ణి. ...ఇంకా...పెద్ద రచయితనైపోయి, డైరక్టర్నయి, ప్రొడ్యూసర్నయి ప్రపంచఖ్యాతి పొందుదా మనుకున్నాను. నువ్వప్పుడే సాగిస్తివి.

పార్వ: ఇంకేం — ఒక బోగందాన్ని కూడా లంకించుకున్నారంటే చక్కగా మీరు తీయబోయే సినిమాలో డబ్బు ఖర్చులేకుండా యాక్టు చేస్తుంది. అప్పుడింకా యెక్కువ సినిమాలు తీసి యింకా యెక్కువకీర్తి సంపాదించుకోవచ్చు.

ప్రభా: ఒసేవ్ నువ్వు నన్నవమానపరుస్తున్నావ్.

పార్వ: మీకంటేనా? ఒక్కదాన్నీ బిక్కుబిక్కుమంటూ కొంపలో ఒదిలిపెట్టి మీ యిష్టం వచ్చినట్లల్లా తిరిగిరావటం నన్నవమానపరచటం కాదు కాబోలు.

ప్రభా: 'ఇష్టం వచ్చినట్లల్లా!'- -ఒసేవ్ నాకు కోప మొస్తున్నదనే చెప్పాలి.

పార్వ: స్వేచ్ఛ కద్దు తగిత్తే రాదూ మరి.

ప్రభా: వచ్చేసింది. తియ్ పెట్టెలోనుంచీ లంగోటీ తియ్.

పార్వ: లంగోటీ యెందుకు?

ప్రభా: అది కట్టుకుని నీతో పోట్లాడాలి.

పార్వ: నాతో పోట్లాట్టానికి లంగోటీ అక్కర్లేదు. అయినా నేను మీతో పోట్లాడ కూర్చోలేను. మీ యిష్టం వచ్చినట్లు చేసుకోండి. (వెళ్ళబోతూంది)

ప్రభా: ఆగు, ఈ మాట వినిపో. నీతో నేనూ పోట్లాడను. ఇంత అనుమానపడే పెళ్లాంతో కాపరం చేసేకంటే సన్యాసం పుచ్చుకోవటం మెఱుగు. ఆ పనే చెయ్యబోతున్నాను. ఇప్పటివఱకు పుచ్చుకున్నవాళ్ళల్లో నూటికి తొంభైతొమ్మిదిమంది పెళ్ళాం దెబ్బకి తట్టుకోలేక పుచ్చుకున్నవాళ్ళే. నేనూ వెళ్ళిపోతున్నాను. తలు పేసుకో.

పార్వ: ఎక్కడికో?

ప్రభా: నా యిష్టం వొచ్చినచోటుకి, హిమాలయాలకి వెళ్తాను.

పార్వ: అక్కడ మహా చలి. మీ రగ్గు తీసి

ప్రభా: అయితే వింధ్యపర్వతాల్లో కెళ్ళిపోతాను.

పార్వ: తలుచు ఉత్తరాలు వ్రాస్తూండండి.

ప్రభా: ఉత్తరాలు గిత్తరాలు జాంతానై. ఈ పూటతో నీకు నాకూ రాంరాం.

పార్వ: మఱి నా పేర పాలమేమన్నా వ్రాసి—

ప్రభా: దావా వేసుకో.

పార్వ: కోర్టు ఖర్చు లిప్పించండి.

ప్రభా: వస్తువు లమ్ముకో (వెళ్ళిపోతూండగా మాధవరావొస్తాడు) రారా! బావా! (పార్వతి లోపలికి వెళ్తుంది కొబ్బరినూనెకోసం)

మాధ: ఎక్కడికి బయల్దేరేవు (వచ్చి కుర్చీలో కూర్చుంటాడు)

ప్రభా: ఎక్కడికీ లేదురా. సిగరెట్లయిపోయినయ్. కొట్టుదాకా వెళ్ళొద్దామని.

మాధ: ఉన్నయ్ లేరా.

ప్రభా: నువ్వురా బావవంటే! ఏదీ ఒక్కటిప్పించు (తీసుకుని ముట్టిస్తాడు. పార్వతి వచ్చి తలకి నూనె రాస్తూంటుంది)

మాధ: బావ బావంటమేగాని నీ చెల్లెల్ని చ్చేదేమైనా ఉందా పాడా. ఊరికి నే అంటానికేం.

ప్రభా: లేదుగదరా. ఉంటే ఊరుకుండేవాణ్ణా. సుప్రసిద్ధ నటులు శ్రీ శ్రీ రంగదుప్పి మామిళ్ళ మాధవరావుగారి బావమరిదినంటే నా కెంతగౌరవం!

పార్వ: ఎందుకన్నయ్యా మనకీ వంశంలో వాళ్లు. ఈయన్ని చేసుకుని నే నింత సుఖపడుతున్నాను గదా. ఈయనకే కనక చెల్లెలుంటే గొంతగయ్యాళి దయ్యేదో. ఆవిణ్ణి చేసుకుని మీరేం సుఖపడతారు. (లోపలికి వెళ్తుంది)

ప్రభా: అబ్బ! బహు కష్టపడుతున్నదిరా యిల్లాలు. పోనీ ఒకపని చెయ్యరాదుట్రా... నన్నే చేసుకోరాదూ. దీన్ని పుట్టింటికి తోలేస్తాను.

మాధ: చేసుకోవచ్చుగాని నువ్వు ఉద్యోగం మానేసి వంటచేస్తూ యింట్లో ఉంటావా?

ప్రభా: నే నొక్కణ్ణే చెయ్యటమేం? చెరి పదిహేనురోజుల చొప్పున. ఎవడింట్లో ఉంటే వాడు పెళ్ళాం. బయట పన్లుచూసేవాడు మొగుడు.

మాధ: పరేగాని మూడురోజులు బయట కూర్చోటం మాత్రం నీపనే.

ప్రభా: ఎందుకని, చెరి రోజున్నర.

మాధ: మరి యింతమంచి అభిప్రాయాన్నిన్ని రోజులబట్టీ దాచావేం?

ప్రభా: మించిపోయిందేమిట్లే అని ఊరుకున్నాను—

మాధ: సరే యీ సొల్లుకబుర్లకేంగాని ఒక ముఖ్యమైన రహస్యవిషయం మాట్లాట్టానికి వచ్చాను.

ప్రభా: ఏమిట్రోయ్ అంత విషయం! కొత్తగా మాట్లాడుతున్నావే యివాళ. అసలెందుకనో వాలకమంతా కొత్తగానే ఉందిలే! ఏమిటి సంగతీ?

మాధ: చెబుతా...పార్వతి—

ప్రభా: లేదులే దొడ్లో స్నానం చెయ్యటానికి వెళ్ళినట్టుంది.

మాధ: రాత్రల్లా యీవిషయంమీద నాకు నేనే తర్జనభర్జన చేసుకున్నాను. ఒక నిర్ణయానికి వచ్చాను. నీతో చెప్పి నిశ్చయం చేసుకుందామనుకుంటున్నాను. ఇది నా జీవితసమస్య. జాగ్రత్తగా ఆలోచించు.

ప్రభా: ఏమిట్రా అంత కొత్తగా మాట్లాడుతున్నావ్. అసలుసంగతేమిటి?

మాధ: ఏం లేదురా పెళ్ళి చేసుకుందామనుకుంటున్నాను.

ప్రభా: నిజంగానా!...ఏం... నేటికవసరమనిపించిందా. రెండేళ్ళబట్టీ నేను చెబుతున్నా వద్దంటున్నావుగా.

మాధ: ఏం చెయ్యమంటావురా నాకొచ్చేది అరవైరూపాయలా? నాకే హస్తాహస్తు. మరోమనిషికూడా యేం పెట్టను చెప్పు.

ప్రభా: బాగుందే—సరిపోవటానికీ పోకపోవటానికీ ఎక్కడ్రా? అందులో నే; తప్పేదేమన్నా ఉందా.

మాధ : అయితే యిప్పుడా యిబ్బందికూడా లేకుండా కుదురుతుంది.

ప్రభా: ఏం బాగా ఉన్నపిల్లా యేమిటి? అసలు సంగతంతా చెప్పు. ఎవరమ్మాయ్? యేంచేస్తున్నది?...

మాధ: అదుగో ఆ విషయంగురించే మన మిప్పుడాలోచించాలిసింది—నాకు అమ్మా నాన్నా లేరు గదా! ఉన్న అక్కయ్యలకీ నాకూ సగమేటుక. కాబట్టి నే నేపిల్లని చేసుకున్నా కాదనేవాళ్లు లేరు గదా; ముందీసంగతి చెప్పు; పుటకకీ ప్రవర్తనకీ సంబంధ ముంటుందంటావా?

ప్రభా: కొన్నిచోట్ల ఉండవచ్చు. అందరు వ్యక్తుల విషయంలో అలా ఉంటుందని చెప్పలేము.

మాధ: అయితే మంచి భోగం పిల్లని చేసుకోమంటావా?

ప్రభా: నిరభ్యంతరంగా—అయితే నీ మనస్సు కష్టపడే ప్రవర్తన లేకుండా ఉండాలి—అంటే—

వృత్తిలోకి దిగిన పిల్ల కాకుండా వుండాలి. ఇంతకీ ఎవరో చెప్పవేం? నే నెఱుగుదునా! ఎవర్రా!

మాధ: వసుంధర.

ప్రభా: వసుంధరా! మన నాటకంలో వేషం వేసే వసుంధర! నిజం చెప్పు. నాతో యెగతాళిగా మాట్లాడుతున్నావా!

మాధ: ఎగతాళేమిట్రా—రాత్రల్లా యీ విషయాన్ని గురించి ఆలోచించి ఆలోచించి ఇక నీ ఒక్కడితో మాట్లాడి ఆఖరు నిర్ణయం చేసుకుందామని వచ్చాను.

ప్రభా: అది సరేరా—అస లింతదూర మెలా వచ్చింది? నువ్వా అమ్మాయితో మాట్లాడేవా? చేసుకుంటా నందా? అసలు కథంతా మొదట్నుంచీ చెప్పరా!

మాధ: వినుందిరా—మొన్నొక రోజున మన హార్మోనిస్టు భీమశంకరం పాటలు ప్రాక్టీసు చేయిస్తూ యేదో మామూలుగా అడిగేడట కుటుంబ పరిస్థితులు. ఆ మాటమీదా యీ మాటమీదా వచ్చి ఎవరైనా పెళ్లి చేసుకుందామని అనుకుంటున్నట్టుగా మాట్లాడిందట. ఆ విషయం నిన్న పొద్దున నాతో చెప్పేడు.

ప్రభా: కావచ్చు. అంతమాత్రంచేత నిన్ను చేసుకుంటుందని—

మాధ: ఆగరా—సాంతం విను మరి; ఈ వూరొచ్చినప్పట్నుంచీ ఆ అమ్మాయిని చేసుకోవా లనిపించింది నాకు. భీమశంకరం నాతో యీ మాట చెప్పగానే మన ప్రయత్నాని కనుకూలంగానే ఉందని అతనిచేత నే అడిగించాను.

ప్రభా: ఏమని?

మాధ: పేరుమాత్రం చెప్పకుండా నా పరిస్థితంతా చెప్పి యేమంటుందో కనుక్కోమని. చేసుకుంటా నందిట.

ప్రభా: నిజంగానా!

మాధ: ఒట్టురా; ఇక చెయ్యాల్సిందేమిటంటే మనిద్దరం వెళ్లి స్వయంగా అడిగి తేల్చుకోవటమే. ఇక అనుమానమేమిలేదురా. ఖాయంగా ఒప్పుకుంటుంది. రిహార్సల్లో కనిపెడుతునే ఉన్నాగా.

ప్రభా: ఆ పిల్లసంగతి సరే, మరి ఆ అమ్మాయి తండ్రో?

మాధ: ఎవడు వీరాస్వామిగాడా! వాడొప్పుకుంటే యెవడిక్కావాలి ఒప్పుకోకపోతే యెవడిక్కావాలి. ఆ అమ్మా యొప్పుకుంటే చాలు.

ప్రభా: అదేమిటి! అత నిష్టంలేకుండా.

మాధ: వాడిసంగతి చాలా ఉందిలేరా. అసలు వాడీ అమ్మాయి తండ్రి కాడుట. ఈ పిల్ల పుట్టిం తర్వాత తల్లిదగ్గరవచ్చి చేరేడుట ఆ మనిషి రెండు నెలల్క్రిందటే పోయిందట. ఇప్పు డతని గొడవేమిటీ, యెలాగైనా యీ పిల్ల పేరనున్న ఆస్తి కాస్తా కాజేసి చల్లగా తప్పుకుందామని.

ప్రభా: ఓరి నీ తస్సదియ్యా! తండ్రే అనుకుంటున్నా! అయితే ఆ అమ్మాయికి ఆస్తికూడా ఉందేమిటి.

మాధ: ఏదో కొద్దిగా వుందిలే. బందర్లో ఒక చిన్న యిల్లు, బ్యాంకులో ఒక రెండువేలు రొఖ్ఖం.

ప్రభా: అహా! మొత్తానికి భోగట్టా అంతా తీశావన్నమాట. నిజంగా ఆ పిల్లని నువ్వు చేసుకుంటే సుఖపడతావురా. ఆస్తిసంగతి దేవుడెఱుగుగాని యెంత చక్కటి పిల్లరా. చక్కగా 'ఆక్టు' చేస్తుంది. ఒక్కసారి చెబితే చాలురా, వెంటనే గ్రహిస్తుంది. కాస్త చదువూ సంస్కారం ఉన్న పిల్లలాగే ఉంది. చేసుకోరా నాకూ బాగానే ఉంది.

మాధ: మరి నీ సాయం కావాలి.

ప్రభా: నేనేం చెయ్యాలిందులో? పెళ్ళంతా నా చేతిమీదుగానే జరిపేస్తాను.

మాధ: అది సరేలేవోయ్. ముందుసంగతో. నువ్వు వాళ్ళిద్దరితో మాట్లాడాలి. కాలేజీ మేష్టరువనీ, మంచివాడివనీ నీకు పెద్ద గౌరవమాయె అక్కడ. మరి భోంచేసింతర్వాత వెళ్దామా రూముకి.

ప్రభా: ఎందుకురా ఆ అమ్మాయి యిక్కడికే వస్తుంది.

మాధ: ఎప్పుడు? నిజంగా? ఎందుకు?

ప్రభా: మొన్న మన ఆర్గనైజర్ని చదువుకోవటాని కేమైనా పుస్తకాలుంటే యివ్వండని అడిగిందట. అతను నన్నడగమని చెప్పేడు. అడిగింది. కావాల్సినవేవో వచ్చి చూసుకోమని చెప్పేను. మన రమణగాణ్ణి వెంటబెట్టుకుని యీపూట వస్తానంది. ఇంకొకళ్లయింటికైతే అలా వస్తారా. రమ్మంటానికసలు గుండెలుంటాయా! మనమంటే గౌరవమోయ్. అయ్యగారి పద్ధతంతా వేఱు. పెద్దమనిషితరహా—

మాధ: అఘోరించినట్టుంది నీ పెద్దమనిషితనం.

[ప్రవేశం 12 యేళ్ల కుర్రాడు రమణ]

రమ: మేష్టరుగారూ! మరి—

ప్రభా: వచ్చిందా వసుంధర?

రమ: వచ్చిందండి. అదుగో బయట—

ప్రభా: అరే రమ్మను (లేచి వాకిలిదాకా వెళ్ళి) రామ్మాయి! అదేమిటి బయట నిలబడ్డావేం. రా! .... కూర్చో.

వసుంధర: (ఇద్దరికీ నమస్కారం చేసి కూర్చుంటుంది)

రమణ: నేను రేడియో ఆఫీసుదాకా వెళ్ళొస్తానండి. రాజుగారు చీటీయిచ్చి రమ్మన్నారు. (వెళ్తాడు)

ప్రభా: (మాధవరావుని చూపుతూ) వీరి నెరుగుదువా?

మాధ: (ప్రభాకరాన్ని చూపుతూ) వీరు సాక్షాత్తు ఆంజనేయస్వామి అవతారం. ఆ మొహం ఆ వాలకం అంతా తెలుసునే ఉంది గాబట్టి వేరే చెప్పక్కర్లేదనుకుంటా.

ప్రభా: (పెద్దగా) ఉంటే ఒక్కసారి ఇలా దయచేస్తావ్ (లోపలనుంచి "వస్తున్నా") చిత్తం అలాగా కానీయ్— కాని కొంచెం శీఘ్రంగా.

పార్వ: ("ఏ మ్మనిగిపోయిం"దంటూ ప్రవేశించి నాలుక్కరుచుకుని వసుంధరని చూస్తూంటూంది)

ప్రభా: ఇలా రా! ఈ అమ్మాయిని వసుంధరంటారు. మా నాటకంలో వేషం వేస్తున్నదని చెప్పేనే...

పార్వ: ఓహో! బాగా పాడుతుందని కూడా చెప్పేరు.

ప్రభా. ఆ! ఆ అమ్మాయే. ఇక—(వసుంధరతో) ఈమెనిగురించి చెప్పాలంటే చాలా వుంది. నే నెక్కడ సుఖపడిపోతానో అని సృష్టించి బ్రహ్మదేవుడు నా మెడ కంటగట్టిన స్త్రీరత్నం. ఒక్క మాటలో చెప్పాలంటే నా భార్య.

మాధ: ఒరేయ్ నువ్వెన్ని జన్మల్లో పుణ్యం చేసుకున్నావో అలాంటిది దొరికింది. లేకపోతే నీ మొహానికి—

పార్వ: పాంకోటి టిక్కర్లే—

మాధ: హైదరాబాదు రాచిప్పర్లే.

పార్వ: మన బుద్ధికి మన అందానికి అయ్యో మా భోటివాళ్ళెం పనికొస్తామా.

మాధ: మొగవాడు గాని ఆడది గాని మనిషై సిగ్గనేది ఉండాలి. మన మొఖమెట్లా ఉందో ఒక్కతడవ అద్దంలో చూసుకుని తర్వాత యితరుల్ని వెక్కిరించాలి.

ప్రభా: ముళ్ళకంప. రామరామ. కదిలించితే చాలు వదిలించుకోలేవు—మీ యిద్దరి నోళ్ళూ మూయించాలంటే బ్రహ్మతరం గాదు. ఇదుగో అమ్మాయి! అన్నా చెల్లెళ్లిద్దరూ యేకమయ్యారు. థామస్ ఫుల్సీ గాడి 'బ్యాలెన్సు ఆఫ్ పవర్' సిద్ధాంతం ప్రకారం మనిద్దరం ఒక పక్షం కావాలి.

వసుం: వదినెగారదృష్టవంతురాలు.

పార్వ: ఎందుకనో.

వసుం: ఎప్పుడూ కులాసాగా నవ్విస్తూ రోజు క్షణంగా గడిపే భర్త దొరకటంకంటె స్త్రీకి అదృష్టమేముంది చెప్పండి?

పార్వ: నాలుగురోజు లిక్కడున్నావంటే తెలుస్తుంది నా అదృష్టం. కొత్తవాళ్లముందబ్బో యెంత మర్యాద.

ప్రభా: ఒసే! అంటే రాక్షసల్లే మీదపడతావు గాని యింటికి చుట్టాలంటూ వచ్చినప్పుడు కాస్త కాఫీ అంటూ—బొత్తిగా మర్యాదంటూ తెలియదేమే నీకు?

వసుం: అబ్బే! ఇప్పుడే—

పార్వ: మరిచేపోయానండీ మాటలసందట్లో పడి—

ప్రభా: మా యిద్దరికీ చాల్లే. నువ్వు కళ్లుమూసుకుంటావుగదరా మేం తాగేటప్పుడు.

పార్వ: (లోపలికి వెళ్తూ) కలపగానే పిలుస్తాను లోపలికి రా అన్నయ్యా! గప్‌చిప్‌గా చేరి కాస్తా తాగుదాం (వెళ్తుంది)

మాధ: సరే నే నొస్తారా. కాస్తపనుంది (ప్రభాకరానికి కన్నుగిలిపి వెళ్లబోతూండగా అతను చెయ్యిపట్టుకుని నిలిపి కూర్చోబెడతాడు)

ప్రభా: ఆగరా పోదుగాని తొందరేం.

మాధ: బజార్లో పనుందిరా కొద్దిగా.

ప్రభా: నీకూ నాకూ పన్లేం దెప్పుడులే. భోంచేసి పోదువుగాన్లే కూర్చో...ఏమిటమ్మా సంగతులు?

వసుం: ఏమున్నయ్యండి.

ప్రభా: చూశావుగా మా యింటి పరిస్థితులు. ఎప్పుడూ ఒకళ్లనొకళ్లు వెక్కిరించుకోవటం పోట్లాడుకోవటం.

వసుం: ఇంతకంటె యేం కావాలండీ జీవితానికి! నిర్మలమైన హృదయాలతో —ప్రేమించుకుంటూ— హాయిగా కాలంగడిపేకంటె మనుషుల కేంకావాలండి! నాబోటివాళ్లకి మీ ఆనందం చూస్తే యెన్ని జన్మలకైనా యిలా బ్రతికే అదృష్టం దొరుకుతుందా అని జీవితంమీద విరక్తికూడా కలుగుతుంది. నరకంలోనుంచి స్వర్గంలో పడితే యెలా ఉంటుందో అలా ఉంది నాకీ అయిదు నిమిషాలనుంచీ.

ప్రభా: మీ యిళ్ళల్లోమటు కేంవమ్మా.

వసుం: హుఁ...ఇళ్లు. మావికూడా యిళ్ళే నంటారా? పాపపుగూళ్లు. ఇప్పుడా రొంపిని జ్ఞాపకం చేసుకోవటం దేనికిలెండి. చెప్పండి? చదువుకున్నవారుగదా! పుణ్యపాపా లున్నాయంటారా?

ప్రభా: ఉన్నాయో లేవో చెప్పలేనుగాని ఉన్నట్టుగానే నా మనస్సుకు నిష్కారణంగా తోస్తుంది. అంటే నమ్మకముంది కొద్దిగా.

వసుం: అయితే పాపం చేసుకుంటే నేగదూ భోగంకులంలో పుట్టేది.

ప్రభా: అదేమిటమ్మా! ఎందుకని.

వసుంధర: ఎందు కేమిటండీ! చదువూ విజ్ఞానం ప్రేమా ఆనందం అన్నిటికీ దూరమైపోయి పురుగుల్లాగా ఆ పాడునరకంలో పడిఉండటం పాపం కాకపోతే మరేమిటి చెప్పండి.

మాధ: అదేమిటి నీచంగా బ్రతికేవాళ్లేకులంలో మాత్రం లేరు? ఈ బెజవాడలో నిజానికి భోగంవృత్తిలో వున్నవాళ్ళు నూటికి తొంభైమంది మే మెక్కువంటే మే మెక్కువనుకునే కులాలవాళ్లే.

ప్రభా: పుటకకి వ్యక్తి కారణం కాదమ్మా తాను చేసేపన్లకీ తన జీవనవిధానానికీ కారణం. మీ కులంకూడా చాలావరకు మారిపోయింది. చదువుకుని పెళ్ళిచేసుకుని సంసారులకంటె గా బ్రతికేవాళ్లెందరు లేరమ్మా.

వసుం: ఉండొచ్చులేండి, కొద్దిగా యెవరో అదృష్టం వున్నవాళ్లు.

ప్రభా: దానికి పెద్ద అదృష్ట మేమిటమ్మా. అలా నడుచుకోవటమే.

వసుం: అది సాధ్యమౌతుందంటారా?

ప్రభా: తప్పకుండా. ఇదేం భూమికీ ఆకాశానికీ తాళం వెయ్యటమా. మన చేతిలో ఉన్నదాన్ని మనం చెయ్యటంలో సాధ్యం అసాధ్యం అన్న ప్రశ్నేముంది.

వసుం: అయితే ఒక చిన్న సాయం చేస్తారా! నే నీప్రాంతంలో నే ఎక్కడన్నా ఒక చిన్నగది తీసుకు నుంటాను. మీదగ్గర చదువుకుంటాను నాకు గార్డియన్‌గా ఉండండి. నే నిక ఆ పాడు లోకంలో అడుగు పెట్టను.

ప్రభా: ఓ అలాగే! అయినా నీకంత కష్ట మేమొచ్చిందమ్మా? మీ నాన్న నువ్వు చెప్పినట్టే వింటాడుగా.

వసుం: (నిట్టూర్చి) నాన్న...భోగం కొంపల్లో 'నాన్న' 'అన్న' అనేవి ఉద్యోగాల్లాంటివి. ఒక్క తల్లీ కూతుళ్లది తప్పితే మిగతా సంబంధాలన్నీ బూటకాలే.

ప్రభా: అయితే వీ—రా—స్వా—మి?

వసుం: ఆ! వీరాస్వామి—మా అమ్మ మొగుడు —నాపాలిటి యముడు.

ప్రభా: అదేం! నువ్వంటే బాగానే ఉంటా విన్నా కష్టపెడుతున్నాడా?

వసుం: ...ఎందుకులెండి అన్నయ్యగారూ! ఈ మాటలన్నీ ఆ మనిషితో సంబంధం పూర్తిగా తెంచుకున్న తర్వాత అనుకోవాల్సినవి. లేకపోతే—

మాధ: తెంచుకోరాదూ?

వసుం: ఆశ్రయం లేకుండా ఆడది బతగ్గలదా?

మాధ: మరొకటి కల్పించుకోవటమే.

వసుం: ఎక్కడ?

మాధ: ఇష్టమైన చోట.

వసుం: నిజమేనా?

మాధ: అక్షరాలా!

వసుం: (నవ్వుతూ) అయితే మీ యిద్దరూ హాయి.

మాధ: కచ్చితంగా.

ప్రభా: చెప్పమ్మా? అసలు సంగతేమిటి? ఈ వీరాస్వామి యెవరు? నీకేం యిబ్బంది కల్గిస్తున్నాడు.

వసుం: .........పదహారేళ్ల క్రితం మాట; మొదట్లో యితను గుఱ్ఱబ్బండీ తోలేవాడు. పెద్ద జట్టుండేది. ఇతన్ని చూస్తే బందరులో సానివాడంతా భయపడేది. ఇరవైనాలుగ్గంటలూ

తాగుడూ పేకాటా ఇతనాడిందాట పాడింది పాటగా ఉండేది. నేను పుట్టింతర్వాత యితను మా అమ్మదగ్గరికి చేరేడుట.

ప్రభా: అదా సంగతి ఇతను మీ నాన్న అనుకుంటున్నాం, యిన్నాళ్లబట్టీ.

వసుం: కాదండీ ఈ విషయం యీ వీరాస్వామి సంగతీ అంతా చచ్చిపోయేముందు మా అమ్మే చెప్పింది.

మాధ: మరయితే అసలు మీ నాన్నెవరో చెప్పలా

వసుం: ఎవరో చౌదరిగారని చెప్పిందండి. అట్లాగే పిలిచేదిట. అసలు పేరేదో మరిచేపోయిందండీ ఎందుకూ మా అమ్మా ఆయనా కలిసి తీయించుకున్న ఫొటోలున్న ప్యాకెట్టి ఈ ఊరు తీసుకొచ్చాను. నా పెట్టెలో ఉన్నయ్. ఏమనిషి కనుపించినా తేర పార చూస్తాను ఫొటోలో మొహం పోలుతుందేమోనని

మాధ: ఆ! తర్వాత!

వసుం: మా వీధిలోనే ఒక చిన్న బడుండేదండి మా అమ్మ నన్ను అయిదోయేటనుంచే బళ్లోకి పంపేది. అయిదోక్లాసునాకా ఆ బళ్లో చదువుకున్నాను. నేనింకా చదువుకుంటానంటే మా అమ్మ నన్ను హైస్కూల్లో చేర్పించింది. మూడవ ఫారం చదువుతూండగా మానిపించేశాడు నాకింత డబ్బు ఖర్చౌతున్నదని.

మాధ: ఇతనే?...డబ్బు తనది కాదుగా మీ అమ్మదేగా.

వసుం: అయితేనేమటుకేమండి. ఎవరు చెప్పటానికి గుండెలెవరికున్నయ్! నేనెంతవరకు చదువుకుంటే అంతవరకు చెప్పిస్తాననేది; ఎందుకంటే మా అమ్మ స్నేహితురాలొకామెని తాశీల్దారుగారుంచుకుని పుట్టినకూతుళ్లకి డాక్టరుచదువు చెప్పించాడట. వాళ్ళని చూసినప్పుడల్లా మా అమ్మెంతో ఉబలాటపడేది నాక్కూడా పెద్దచదువు చెప్పించాలని.

మాధ: కొంపతీసి చదివినట్టయితే మా కొడ వేషం వేసేమనిషి దొరక్కపోను.

వసుం: అబ్బ యేం యెగతాళిచేస్తారు లెండి. ఇన్నాళ్లబట్టే వేసే వేషానా యేమిటి? ఏదో అదృష్టవశాత్తు యీవూరు నాటకానికి రావటం మీరు చూసి నన్ను తీసుకోవటం జరిగింది గాని.

ప్రభా: ఆ!—మానేశావు తర్వాత—

వసుం: ఏముందండీ ఇంట్లో కూర్చోటమే. మాఅమ్మే నాకు సంగీతం నేర్పుతూండేది. ఎప్పుడన్నా అడిగితే కథల పుస్తకాలు కొనిపెట్టేది. అవి చదువుకుంటూ కాలం గడిపేదాన్ని. రెండేళ్లక్రితమే నాచేత వేషాలు వేయించటం మొదలుపెట్టేడు.

మాధ: నాటకాల్లోకి దింపిందీ యితనేనన్న మాట—అవుతే మాకు చాలా సాయపడ్డాడన్నమాట!

వసుం: ఏంసాయంచేశాడంటారు?

మాధ: అవును మరి. అతను నిన్ను నాటకాల్లోకి దింపకపోతే మనమిలా కలుసుకోవటం సందర్భపడేదికాదుగా అంట.

ప్రభా: అయితే యీ రెండేళ్లబట్టే నాటకాలు వేస్తూనే ఉన్నావన్నమాట.

వసుం: ఆహా! ఆయనగారి తాగుడికి నన్నీవిధంగా ఉపయోగించుకుంటున్నాడు.

మాధ: అంతేనా!......ఇంకేమన్నా గందరగోళం...

వసుం: చేశేవాడేగానీండి, మాఅమ్మ చచ్చియేలోకానుందో తను చెడ్డా నేనైనా నీతిగా బతకాలని అన్నీ సర్దుతూండేది.

మాధ: ఏంచేశేవాడేమిటి?

వసుం: ఏంచేస్తాడు. వాళ్లదగ్గరా వీళ్లదగ్గరా ఆమాటా యీమాటా చెప్పి డబ్బు తీసుకుని వాళ్ళని యింటిమీదకి తోలేవాడు. మాఅమ్మ వాళ్ళని బతిమాలి, చెప్పినంత డబ్బు తిరిగి యిచ్చేసి కొందర్ని, కొందరికేమాటా యీమాటా చెప్పి పంపించేసేది. ఎవరైనా యింటికొస్తే చాలు నాకు గుండెలు పగిలి పక్కింటికి పరిగెత్తేదాన్ని. అయితే పోలీసుల్ని మాత్రం హడలగొట్టేది.

మాధ: ఎట్లా?

వసుం: సబ్ ఇన్స్పెకరు వచ్చే వేళయిందనేది. పాపం గుండెలు బాదుకుంటూ పరిగెత్తేవాళ్లు.

మాధ: అయితే యెంత గ్రంథం చెయ్యాలో అంతా చేస్తూనే ఉన్నాడన్నమాట.

ప్రభా: పాపం మీ అమ్మ పోయి రెండు నెలలెందా.

వసుం: అవునండి. ఇంకా కొద్ది కాలమున్నా బతికుంటే నన్నీయన బారినుంచి తప్పించేది.

ప్రభా: అంటే... పెళ్ళి చేసేదా!

వసుం: (సిగ్గుతో) రెండేళ్ళబట్టి ప్రయత్నం చేస్తూనే ఉందండి. మంచి సంబంధ మెక్కడా దొరక్క ఊరుకుంది. మాకు మంచి వాళ్లెలా దొరుకుతారు చెప్పండి?

మాధ: ఎందుకు దొరకరూ చేసుకోదలిస్తే. వజ్రాల్లాంటివాళ్లు దొరుకుతారు.

ప్రభా: అవును. పిల్ల బంగారంలాంటిదైతే వజ్రంలాంటివాళ్లే దొరుకుతారు...ఊ......ఇదా సంగతి!

వసుం: దయచేసి అతన్తో మాత్రం ఒక్క మాట కూడా అనకండేం; పీక పిసికేస్తాడు......మీ బోటివారితో మా కెంతో సంతోషంగానూ గౌరవంగానూ ఉంటుందండి. అదీ యెప్పుడన్నా నాటకాలకంటూ యిల్లు కదిల్తేనే. ఇంటిదగ్గరుంటే యేముంది, దిన దిన గండం—

ప్రభా: మూడవఫారండాకా చదువుకున్నావా!

వసుం: అందుకనేనండి కాస్త ఆ పుస్తకం యీ పుస్తకం చదవాలన్న ఉబలాటం. అందుకనే వచ్చాను. నాటక మయిపోయేలోగా చదివిచ్చేస్తాను.

ప్రభా: ఏం ఫరవాలేదు. అదుగో బీరువా నీ క్కావాల్సినవి తీసుకెళ్ళు (లోపల్నుంచి "అన్నయ్యగారూ")

ప్రభా: తీసుకురావే మహాలావు అన్నయ్యగారూ దున్నయ్యగారూనూ మీ మ్మాయిద్దరిదే పొట్టా.

పార్వ: (ప్రవేశించి కాఫీ ముగ్గురికీ యిచ్చి) వంకాయకూర చేశాను. బీరకాయలున్నయ్ యేంచెయ్యమంటారు.

ప్రభా: ఉన్నాడుగా అన్నయ్య. ఆయ న్నే అడుగు.

పార్వ: సరే మా యిష్ట మొచ్చిందే చేసుకుంటాం లెండి. వెయ్యమని అడిగినప్పుడు చెబుతా (ఇంట్లోకి వెళ్తుంది)

ప్రభా: తీసుకోమ్మా?

[ముగ్గురూ తాగుతారు. ప్రభాకరం మాధవరావులు సిగరెట్లు ముట్టిస్తారు]

మాధ: ఇప్పుడే వస్తారా (ప్రభాకరాన్ని చాటుగా గిల్లి వెళ్తాడు.)

ప్రభా: ఊ...మరేమిటమ్మా! ఇక ముందేం చెయ్యాలని.

వసుం: నే నేం చెయ్యగలను చెప్పండి. ఏమీ తోచటంకూడా లేదు.

ప్రభా: మళ్ళీ మీ వూరు వెళ్ళింతర్వాత వీరాస్వామి వెనకటి ప్రవర్తనే మొదలు పెడతాడేమో!

వసుం: అదే భయంగా ఉందండి. మొన్నటిదాకా మా అమ్ముండేది కాబట్టి గండాలన్నీ తప్పించేది. ఇప్పు డడ్డుపడే దెవరు? ఈ రెండు నెల్లబట్టి అది చచ్చిపోయిన గొడవల్లో నామీద కెవర్నీ తోల లేదు. ఇక బతకనియ్యడేమోనని భయంగా ఉందండి. నన్నేం చెయ్యమంటారు చెప్పండి. మీ రేది చెబితే అది చేస్తాను. ఈ రెండేళ్ళబట్టి వేషాలు వెయ్యటంలో కూడా అసలు కారణం అతనే అయినప్పటికీ నాకుకూడా కొంత ప్రయోజనముంటుందనే ఉద్దేశం కూడా కారణమేనండి. ఏమిటంటే పదిమందితో పరిచయమౌతుంది. ఎవరన్నా ఒకరు యేదోవిధంగా నా కితనిబాధ తప్పిస్తారేమో నని. నా అదృష్టంకొద్దీ యిప్పటికి మీరు—

ప్రభా: ఒక పని చెయ్యరాదూ—

వసుం: ఏం చెయ్యమంటారు చెప్పండి మీరేం చెయ్యమంటే అది చేస్తాను. ఇంతవఱకూ నాతో యింత ఆప్యాయంగా మాట్లాడినవారుకూడా లేరు. నా కష్టసుఖా లెవరిక్కావాలి చెప్పండి.

ప్రభా: తిరిగి బందరు వెళ్ళబోకు.

వసుం: నిజమే వెళ్లేకూడదనేఉంది. అత నూరుకుంటాడా యుద్ధం చెయ్యడూ. మరి నా కండగా యెవరు నిలుస్తారు చెప్పండి. ఎక్కడుండేది?

ప్రభా: ఆ యేర్పాట్లన్నీ ముందుగానే చేసుకుందాం.

వసుం: అంటే? చెప్పండి ఎలాగో.

ప్రభా: ఏముంది. నువ్వెవర్నన్నా పెళ్ళిచేసుకుందా మనుకుంటున్నావుగా చేసుకుని అతనింట్లో ఉండిపో.

వసుం: పె...ళ్ళా!

ప్రభా: ఊ! ఈ వారంరోజుల్లోనే జరుగుతుందా అని నీ అనుమానంకాదూ? అస లెలాంటివాణ్ణి చేసుకుందామని నీ ఉద్దేశం చెప్పు?

వసుం: నే నేం చెప్పగలనండి?

ప్రభా: అహా! ఉద్దేశం. ఎలాంటివాడైతే నీకు సుఖం దొరుకుతుంది...మరి పెళ్ళంటే మాటలు కాదు చూడు. నూరేళ్ల జీవితానికి సంబంధించిన విషయం. అన్నీ జాగ్రత్తగా ఆలోచించుకుని దిగాలి...

వసుం: మధ్యలో నన్ను మోసం చెయ్యకుండా ఉంటే చాలండి. ఇంక నాకేం అక్కర్లేదు. నా చేత వేషాలు వేయించటాని కొప్పుకుంటే తేలిగ్గా నెలకు వంద రూపాయలు తేగల్ను. అలా యిష్టం లేకపోతే నాకింత తిండీ గుడ్డా యివ్వగల్గితే చాలు. డబ్బు సుఖం గురించి నాకేమీ ఆశలేదండి. 'భార్య' అనే గౌరవం దొరికితే చాలు. మామూలు సంసారాల్లో పిల్లని చేసుకుంటే ఎలా ఉంటారో అలా ఉంటే చాలండి నాకు.

ప్రభా: మన హార్మోనిష్టు భీమశంకరం నీతో మాట్లాడేడటగా మొన్న!

వసుం: మాట్లాడేరండి.

వసుం: ఏమన్నావ్?

వసుం: అలాగే నన్నానండి. మళ్ళీ ఆ విషయం గూర్చి ప్రస్తావన చెయ్యలేదు.

ప్రభా: మరయితే నే నొకటి చెపుతాను. నీకు యిష్టమైతే చూడు. మాధవరావుని చేసుకుంటావా?

వసుం: (ఆశ్చర్యంగా) ఆ! (తల వంచేస్తుంది)

ప్రభా: అవునమ్మా! భీమశంకరం నీకు చెప్పింది వీణ్ణిగురించే. పేరు చెప్పకుండా పరిస్థితంతా చెప్పేడు. అడిగించిందే వీడు. చేసుకోవాలని చాలా ఉబలాటపడుతున్నాడు. నువ్వొచ్చేదాకా యీ విషయాన్నిగురించే మాట్లాడుకుంటున్నాం. వెళ్ళి అడుగుదాం రమ్మంటున్నాడు. నువ్వొచ్చావు... చెప్పు నీ కిష్టమేనా.

వసుం: (సిగ్గుతో)......నిజంగా నాండి.

ప్రభా: ఇటువంటి విషయాల్లో ఎగతాళిటమ్మా. చెప్పు. ముందు అసలుమనిషి నచ్చేడా?

వసుం: నాకంత అదృష్టం పడుతుందాండి?

ప్రభా: వాడూ అలాగే అనుకుంటున్నాడు. నువ్వొప్పుకోవటం తనకు పెద్ద అదృష్టమని.—ఇక వాడి పరిస్థితేమిటంటే తల్లిదండ్రులిద్దరూ లేరు. అప్పలున్నారంటే వాళ్లు వీణ్ణి రమ్మనరు వీడు వాళ్లిళ్లకి వెళ్లడు. వాళ్లకి తగని అతిశయం వీడికి తగని అభిమానం. ఒక ప్రెస్సులో పనిజేస్తూ నెలకి అరవై రూపాయలు తెచ్చుకుంటున్నాడు. ఒక చిన్నగది అద్దికి తీసుకుని కాలక్షేపం చేస్తున్నాడు. వస్తే మాయింటికి లేకపోతే రిహార్సల్ రూము. ఇదీ పరిస్థితి. స్వంత ఆస్తి యేమీ లేదు. ఆలోచించుకో మరి ......నా ఉద్దేశ్యంలో మీ పరిస్థితుల్ని బట్టి యిద్దరికీ చాలా చక్కగా సరిపోతుంది. ఇద్దరూ కలిసి నాటకాలాడుకోవచ్చు. నాలుగు డబ్బులు తెచ్చుకుని సుఖంగా జీవితం గడుపుకోవచ్చు. ఏమంటావ్?

వసుం: నా కంతకంటె యింకేం కావాలి. నా జీవితాంతం మీకు—

ప్రభా: అదుగో అదేవద్దు. నే నేం నీకు సాయం చెయ్యలేదు. నా స్నేహితుడి తరఫున నేను మాట్లాడుతున్నాను. ఇందులో ఒకళ్లొకళ్లకి కృతజ్ఞత చూపవలసిన అవసరమేమీ లేదు. ఎలాగైనా ఒక ఒడ్డుకు చేరుకుందామని నీ ఉద్దేశం. ఎలాగైనా నా స్నేహితుడు సుఖపడే పద్ధతి చూద్దామని నా ఉద్దేశం. ఈ రెండు ఉద్దేశాలతో నే మన సంభాషణంతా నడిచింది...... మరి సరే నన్నదని చెప్పమంటావా వాడితో?

వసుం: (కొద్దిగా తల పైకెత్తి కృతజ్ఞతా, ఆనందమూ, స్వేచ్ఛా అన్నీ ద్యోతకమయ్యేలాగ చూస్తూ అంగీకారాన్ని తెలియజేస్తుంది)

మాధ: (ప్రవేశించి) ఏమయిందన్నట్టు కళ్లతో అడుగుతూ పైకి) ఇక నే నింటికి వెళ్తారా!

వసుం: (వెనకటిలా గా కాదు. ముఖకవళికళలో కొద్ది మార్పు. కొద్దిగా పక్కకి తిరిగి కూర్చుంటుంది).

ప్రభా: పో! నే నేం బలవంతం చేస్తాననుకున్నావా. ఉండి నన్నేం ఉద్ధరిస్తావా. తిండి దండగ పైగా.

మాధ: పోనీరా నువ్వంత సరదా పడుతూంటే నేనెందుకు కాదనాలి. భోంచేసే పోతాలే.

ప్రభా: అరవకుండా యిటు రా (ప్రక్కన కూర్చోపెట్టుకుని) ఏవిటి మరి?

మాధ: ఏవిటి?

ప్రభా: వసుంధర ఒప్పుకుంది.

మాధ: నిజంగానా...అయితే—

ప్రభా: చెబుతా విను. నాటక మయ్యేలోపుగా మీరు పెళ్లి చేసేసుకోండి. వీరాస్వామి యివాళో రేపో వస్తాడుగా! రాగానే చెబుదాం ఇక ఈ అమ్మాయితో సంబంధం ఒదులుకోమని.

మాధ: ఒదులుకో కేం జేస్తాడు. అసలతనికేం సంబంధం. ఎందుకు నా గదిలోనే—

ప్రభా: తొందర్లేదు. అదేం చాలుతుంది. కాస్త యిల్లంటూ దొరికేదాకా యిక్కడే వుండొచ్చు. ఒక్కటిమటుకు జాగ్రత్త. పెళ్లయిపోయేదాకా మీ కేం బయటపడకూడదు.

[ప్రవేశం: కనకరాజు, వీరాస్వామి.]

ప్రభా: హలో! కనకరాజుగారూ! అరె వీరాస్వామిగారు కూడా వచ్చారే! రండి రండి కూర్చోండి (లేచి కుర్చీలు ముందుకి జరుపుతాడు.)

వీరా: కూర్చోవటానికి వీల్లేదండి. వాకిట్లో రిక్షా నిలబడి ఉంది. ఈ బస్సులో బందరు వెళ్ళిపోవాలి. ఇదిక్కడికి వచ్చిందని మనవాళ్ళు చెబితే వచ్చాను.—ఇక్కడి కొచ్చావేమే?

ప్రభా: ఆ యేదో చదువుకోవటానికి పుస్తకాల కోసమని వచ్చింది. ముందు మీరు కూర్చోండి (ఇద్దర్నీ కూర్చోబెడతాడు. మాధవరావు టేబిల్ మీదకి చేరతాడు) అయితే యిదేమిటి యిప్పుడు వెళ్ళటం?

కనక: వారంరోజుల్లో నాటకం పెట్టుకుని యిప్పుడా మ్మాయిని తీసికెళ్తానంటాడండి. ఇప్పటి కింత డబ్బు ఖర్చుపెట్టేమే.

ప్రభా: అదేమిటండీ వీరాస్వామిగారూ! న్యాయమేనా? మధ్యలో వెళ్ళటం యేం బాగుంటుంది చెప్పండి.

వీరా: కాదు మేష్టరుగారూ అర్జంటు పనొకటుంది. అది చూసుకుని మళ్ళీ యెల్లుండి పొద్దునకల్లా వచ్చేస్తాను.

ప్రభా: అదేదో మీరే చూసుకోరాదూ.

వీరా: కాదండీ అది కూడా రావాలి.

ప్రభా: అంత అర్జంటు పనేమిటబ్బా.

కనక: ఈ పిల్ల పేర నున్న యింటికేదో మంచి ధర వచ్చిందట. వెంటనే రిజిస్టరు చేసేపద్ధతిలో కొంటారట. అందుకని.

ప్రభా: అంత యిల్లవసరమైనవాళ్ళు వారం రోజు లాగలేరుటండీ.

వీరా: కాదండి క్షణాలమీద బేరం. పోతే మళ్ళీ చిక్కదు.

వసుం: అస లిల్లమ్మటం దేనికి?

వీరాస్వామి: నోర్ముయ్. ఆ సంగతి నాకు తెలియదూ.

ప్రభా: (కంటితో మాధవరావుని మాట్లాడవద్దని సైగచేసి) నువ్వూరుకోమ్మా! పోనీ అలాగే వెళ్దురుగాని. ఈపూట మాయింటికి చుట్టాలు. భోంచేసి వెళ్ళండి. ఎటుదిరిగీ తొమ్మిదయిందిగా.

వీరా: ఎందుకులెండి. ఇంటికి వెళ్ళి భోంచేస్తాంగా.

ప్రభా: ఫరవాలేదులెండి మా యింట్లో చేస్తే తప్పా! ఈ వేళప్పుడు యింటికొచ్చినవాళ్ళని భోంచెయ్యకుండా పంపటం న్యాయమేనా? వంటయిపోవచ్చింది. హాయిగా భోంచేసి వెళ్తే యే వేళికి చేరినా యిబ్బంది ఉండదు. మరిచేపోయా! వాణ్ణి వెళ్ళమంటాను.

వీరా: అహహా! పెట్టె వుంది. ఇటునుంచే బస్ స్టాండ్‌కి వెళ్దాంగదా అని రూమునుంచి దాని పెట్టె కూడా తెచ్చాను.

ప్రభా: ఏయ్ రిక్షా! ఆ పెట్టె యిలా తీసుకురా!

[రిక్షావాడు పెట్టె తీసుకొస్తాడు. వీరాస్వామి డబ్బులిచ్చి పంపేస్తాడు]

ప్రభా: నువ్వు ముందు స్నానం చేసెయ్యమ్మా! తర్వాత మేంకూడా చేసేస్తాం. ఇదుగో ఈ అమ్మాయిని తీసికెళ్ళవే.

[వసుంధర పెట్టె తీసి గుడ్డలు తీసుకుంటుంది పార్వతి గుమ్మందగ్గరకు వచ్చి ఆమెను తీసికెళ్తుంది]

కనక: అది సరేనండి. వీళ్ళిలా మధ్యలో వెళ్ళిపోవటం నాకేం బాగాలేదు.

ప్రభా: నిజమే మరి. మళ్ళీ వచ్చిందాకా రిహార్సల్స్ ఆపాల్సిందే గదా? మధ్యలో ఆపితే చేసిన ప్రాక్టీసంతా వృధా. ఎలాగోలా యీవారం ఓపికపట్టండి వీరాస్వామిగారూ.

వీరా: అబ్బే చెప్పేనుగదండి వీల్లేదని. ఇక పదిసార్లడక్కండి.

కనక: ఎలాగయ్యా వెళ్తే! ఇప్పటికి రెండు వందలు ఖర్చుపెట్టేను. ఇదేం తమాషా అనుకున్నావా డబ్బుతో పని.

వీరా: అదేమిటండీ అలా మాట్లాడతారు. మళ్ళీ ఎల్లుండికల్లా వచ్చేస్తామంటూంటే.

కనక: అవునయ్యా మాకు నమ్మక మేమిటి? రాకపోతే మే మభాసుపాలు గావద్దు...ఇంతవరకు మా నాటకాలన్నా మేమన్నా యీవూళ్ళో కాస్త గౌరవముంది. అది కాస్తా మన్నుకొట్టుకుపోతుంది.

వీరా: అంత అనుమానంగా ఉంటే మీరిచ్చిన బయానా తీసుకోండి.

కనక: బయానా తిరిగిస్తే అయిందా యేమిటి? మళ్ళీ యిప్పుడు వేరేమనిషిని వెతుక్కుని అంతా మొదలెత్తుకుని వారంరోజుల్లో తయారు కాగలమా?

ఈపూళ్లో అంతమాత్రం తెలివిగల దెక్కడుంది? నెల రోజులు రుద్దితే నే అంతంతమాత్రం. ఈ వారంలో పూర్ణనుకూడా రాదు. అసలు కొస్త అక్షరజ్ఞానం ఉండి వేషాలు వేసే దేదీ యీపూళ్ళో. అందుక నేగా మీకోసం బందరు పరిగెత్తుకొచ్చింది. పోనీ నాలుగు రోజులు వెనక్కి జరుపుదామంటే హాలుకు 'తేదీ' ఖాయం చేసుకుంటిమి బయానాకూడా యిస్తిమి. ఆగో జాడుకోవాలి లేకపోతే బయానాకి తిలోదకాలే. నువ్వేమన్నా చెప్పవయ్యా మీరు వెళ్ళటానికి వీల్లేదు. నాటకమయ్యేదాకా ఆ అమ్మాయిని కదిలించటానికి వీల్లేదు.

మాధ: రాజుగారూ! ఎందుకు మీకీ కంఠశోష. ఆ అమ్మాయి యెక్కడికీ వెళ్ళదు. సరేనా. మీరూరుకోండి (ప్రభాకరం మాట్లాడవద్దని సైగ చేసినా ఊరుకోడు.)

వీరా: అదేమిటండోయ్! ఎందుకని?

మాధ: ఎందుక నేమిటి? అస లెందుకు రావాలి నీతో? రాదు. ఇక నువ్వా అమ్మాయిని గుటిం చేబాగ్యతా పెట్టుకోనక్కర్లా తెలిసిందా?

వీరా: అదేమిటండోయ్ మీరు మర్యాదా దాటి మాట్లాడుతున్నా రిష్టంవొచ్చిన...

మాధ: పొరపాటు. నేను మర్యాదా దాటి మాట్లాట్టం లేదు. ఉన్న విషయా లేవో విశదంగా చెబుతున్నాను. నీకూ వసుంధరకీ యిక యేరకమైన సంబంధమూ లేదు.

వీరా: మీరు జాగ్రత్తగా మాట్టాడాలి అది నా పిల్ల.

మాధ: ఎంతమాత్రం కాదు. ఆ ఉద్దేశమే యిక విడిచిపెట్టమని చెబుతున్నాను.

ప్రభా: ఒరేయ్ నువ్వుండు చెబుతా. ఇదుగో వీరాస్వామిగారూ! ఇక వాగ్వాదంతో లాభం లేదు. వసుంధరా మాధవరావూ పెళ్లి చేసుకోబోతున్నారు—

వీరా: వీల్లేదు.

ప్రభా: ఎందుకు లేదులెండి. ఇక మీరు అనవసరంగా ఆయాసపడొద్దు. మీ రామ్మాయి తండ్రి కానట్లు తెలిసింది. కాబట్టి—

వీరా: ఇదుగో మీరుకూడా అలాగే మాట్టాడుతున్నారు. మీ రేమో మర్యాదస్థులనుకున్నాను. ఎవరు చెప్పేరు మీకు?

ప్రభా: ఎవరో చెబితే యెలా తెలుస్తుంది. తల్లి చెప్పిందని ఆ అమ్మాయి చెప్పింది—

వీరా: ఏది బావడఖావ్.

మాధ: పళ్లు రాలిపోతయ్ మరోసా రన్నావంటే. పిచ్చి పిచ్చి—

వీరా: ప్రాణం తీసేస్తాను (మీదకిపోతూంటేగా ప్రభాకరం పట్టుకుంటాడు. మాధవరావును కనకరాజు పట్టుకుంటాడు)

మాధ: వదలండి రాజుగారూ! కృష్ణలో పాతేస్తాను.

[రామకృష్ణయ్యగారు హడావుడిగా లోపలికి వచ్చి]

రామ: ఏమిటేమిటి!...

ప్రభా: (అదిరిపోయి) రా నాన్నా!

రామ: ఏమిటీ గందరగోళం......ఒక్కళ్ళూ మాట్టాడరేమిరా...ఏమిట్రా ప్రభూ...ఏమిట్రా మాధవా! కొట్టుకోబోతున్నారు.

[వీరాస్వామి రామకృష్ణయ్యవంక తేరిపార జూస్తుంటాడు]

మాధ:...ఏమీ లేదు మామయ్యా...నాటకం రీహార్సలు.

రామ: ఛా! నోరుముయ్! (వీరాస్వామివంక తేరిపారజూచి)...ఎవరీ మనిషి......ఎక్కడో... చూసినట్టు

కనక: బందరండి. వీరాస్వామి—

రామ: బందరు—వీరాస్వామా......ఆ గుర్తుకొచ్చింది. ఒరి నీ తస్సదియ్యా గుర్తుపట్టకుండా మారిపోయా వేమోయ్ చాలా చిక్కిపోయావ్ నన్ను గుర్తుపట్టావా?

మాధ: నువ్వెరుగుదువా యేమిటి మామయ్యా!

రామ: ఎఱిగట మేమిట్రా నాలు గేళ్ళ పాటచ్చంగా నాకు గుఱ్ఱబ్బండీ కట్టేవాడు. మేఘాల మీద పోయే దా గుఱ్ఱం. ఏమోయ్ వీరాస్వామీ! ఈ పూరొచ్చా వేమిటి...అయితే యీ పోట్లాటేమిటి.. ఆర వెళ్ళిపోతా వేమోయ్.

వీరా: (కంగారుగా నీళ్లు నములుతూ నడుస్తూనే) ఆ! ఇదుగో ఒకటి కెళ్లొస్తా. (వెళ్తాడు)

[ప్రభాకరం లోపలికి వెళ్తాడు.]

రామ: (కనకరాజుతో) ఏమిటండీ యిదంతా మాయగా ఉంది నాకేం అర్థంకావటం లేదు?

కనక: ఆ...యేమీ లేదండి...మా నాటకంలో వేషం వెయ్యటానికి బందర్నుంచీ ఒకమ్మాయిని తీసుకొచ్చాముండి. నాటకమింకా వారంరోజులుంది. ఆ అమ్మాయిని తీసికెళ్ళిపోతానంటాడు ఇతను. వీల్లేదని మేము. ఇదండీ పోట్లాట.

రామ: ఇతను తీసికెళ్ళటమేమిటి! వాళ్లిద్దరికీ సంబంధం?

కనక: ఆపిల్ల తండ్రి నంటాడండి.

రామ: అనటమేమిటండి. అసలు విషయమేమిటో మొదట్నుంచీ వివరంగా చెప్పండి.

మాధ: ఏంలేదు మామయ్యా! ఆ పిల్ల పుట్టిం తర్వాత తల్లిదగ్గర ఈ వీరాస్వామిగాడు చేరేడు. ఆ పిల్లని నానా బాధలు పెడుతున్నాడు. రెండునెల్ల క్రిందటే తల్లి చచ్చిపోయింది. సరే కాటకాని కంటూ యీవూరొచ్చింది. ఇప్పుడు మధ్యలో తీసి కెళ్తానంటాడు. ఆ పిల్లేమిటి—ఇక మళ్ళీ ఆ వూరు వెళితే నానాబాధలు పెడతాడని అచ్చంగా యిక్కడే వుండిపోదామని నిశ్చయం చేసుకుంది.

రామ: చేసుకోనీ. మధ్యలో మీరు పోట్లాడు కోవటం దేనికి?

ప్రభా: (చెంబుతో నీళ్ళుతెచ్చి) కాళ్ళు కడుక్కో నాన్నా!

రామ: అక్కడ పెట్టు...మాట్లాడరేమండీ.

[మాధవరావు మెల్లిగా కనకరాజును గిల్లుతాడు.]

కనక: అంటే మాధవరావుగారు...ఆ అమ్మాయిని—పెళ్ళి....

రామ: ఏరా మాధవా! నిజమేనా?

మాధ: (తలవంచుకుని) నిజమే మామయ్యా!

రామ: అయితే తల్లిదండ్రులు లేరుగదా అని యిష్టంవచ్చినట్లు ప్రవర్తించటమే నన్నుమాట...... అంతకంటే మంచి సంబంధమేమీ దొరకలా?...... మాట్లాడవేంరా?

మాధ: నాకేం ఆస్తా పాస్తా. మామయ్యా! మంచి సంబంధాలు రావటానికి? ఏదో నాతోపాటుగా నాలుగుడబ్బులు సంపాదించేది. లేకపోతే యెట్లా గడవాలి నా జీవితం. ఒక్క కులాన్నిగురించే కదా నీ కిష్టంలేంది.

రామ: అవున్నా మరి. పదిమందిలో తిరగ వలసినవాడివి. మీ అక్కయ్యలు నిన్ను గడపతొక్క నిస్తారా?

మాధ: ఆ!...ఇప్పుడు తవ్వి తలకెత్తుతున్నారు. ఇక చూడరేమో నని దిగులు. నాలక్ష్యం వాళ్ళకి లేదు వాళ్ళలక్ష్యం నాకు లేదు. నా జీవితం యిబ్బంది లేకుండా గడిచే మార్గమేదో నేను చూసుకోవాలి గదా. ఇక కులం సంగతంటావ్. నిజాయితీగా ఉండేవాళ్లు వాళ్లల్లోనూ ఉన్నారు. పెళ్ళినాటికే రెండుమూడు గండాలు గడిచినవాళ్లు మన కులాల్లోనూ ఉన్నారు.

రామ: అబ్బే! ఆ విషయం నేను. కాదనటం లేదు. మంచిపిల్లలు వాళ్లల్లోనూ ఉండవచ్చు. కాని నీకు సంబంధించిన వాళ్ళతో—

మాధ: నే నొకళ్ళ యిష్టంపట్టి పోయేవాణ్ణి కాదు మామయ్యా నా విషయమేదో నేనే స్వయంగా చూసుకుంటాను. ఒకళ్లేమో అనుకుంటారని చేతులారా యిబ్బందులు తెచ్చుకోను. లేనప్పుడు పెట్టేవాళ్లెవ్వరూ లేరు.

రామ: సరే నీయిష్టం. నేనేం చెప్పగల్ను. ఇందువల్ల నీకు సౌఖ్యం లభిస్తుందంటే అలాగే కానియ్......మరి చేపోయ్యా ఏడీ యీ వీరాస్వామి! వాకిట్లో కెళ్లొస్తానన్నాడురా—లేదే చూడరా ప్రభూ ఉంటే లోపలికి రమ్మను.

మాధ: ఇంకేం ఉంటం అప్పుడే దారి పట్టుంటాడు.

ప్రభా: (చూసివచ్చి) లేదు.

రామ: ఆ! అదే పోక పోయాడేరా ముండాకొడుకు. చాలా సంగతులు మాట్లాడా లనుకున్నాను. ఆ పిల్లదగ్గరకే వెళ్ళాడేమో. మరిచేపోయా ఇప్పుడా పిల్ల నీ అండలోనే ఉందా?

మాధ: ఇంకా లేదు?

రామ: మరెక్కడుంది.

పార్వ: (గుమ్మంలో ఉండి) ఇదుగో యింట్లో ఉంది. ఇదుగో వసుంధరా యిలారా మీ అన్నయ్యగారి నాన్నగారు నిన్ను చూస్తారట.

రామ: ఇక్కడే ఉందీ! అందుకనే నన్నమాట యిక్కడ పోట్లాడుకుంటున్నారు. ఏదీ (వసుంధర రాగానే మొహంవైపు చూస్తాడు.)

వసుం: (రామకృష్ణయ్యనుచూసి తెల్లబోయి) ఆ! (అదేపనిగా వెఱ్ఱిగా చూస్తుంది.)

రామ: ......అదేమిట్రా అట్లా చూస్తుంది... ఏమిటమ్మాయ్!

ప్రభా: ఏమిటి వసుంధరా?

మాధ, కనక : అరె!

వసుం: (కళ్ళనీళ్ళు గిర్రున తిరుగుతయ్) నాన్నా! (అమాంతం రామకృష్ణయ్య వళ్లో కూలిపోతుంది)

మాధ, ప్రభా, కనక : ఆ!

పార్వ: అదేమిటి?

ప్రభా: ఆ! (వసుంధర పెట్టె తెరిచి గబగబా గుడ్డలన్నీ తోసి పారేసి అడుగునున్న ఫొటో తీసి ఒక్క నిముషం చూసి మాధవరావుకిచ్చి లోపలికి వెళ్ళిపోతాడు. పార్వతి అతని వెంటే వెళ్తుంది)

రామ: ఇదేమిట్రా! ఇదేమిటమ్మాయ్. ఆ ఫొటో యేమిట్రా మాధవా! ఏమిట్రా అంతా అయోమయంగా ఉంది నాకు.

మాధ: మరేంలేదు మామయ్యా! ఈ ఫొటోలో వాళ్ళు (చూపిస్తూ) ఆ అమ్మాయి తల్లీ...తండ్రీ.

రామ: (నిర్ఘాంతపోయి) ఆ!...(నిట్టూర్చి)... 15, 16 యేళ్లనాటి కథ. లే తల్లీ...మీ...అమ్...మ్మ

వసుం: రెండు నెల్లైంది నాకా...

రామ: పిలు తల్లీ నీ మనసారా పిల్చుకో! నాబోటివాళ్ల మూలంగా ఎంతమంది అమాయకపు పిల్లలకి ఆమాట ఉచ్చరించే భాగ్యంలేకుండా పోతున్నదో!

కనక: ఫలం వెతుక్కుంటూ వచ్చి ఆసామిని చేరింది.

మాధ: అయితే కొన్నాళ్లు చూదరనికూడా తగిలించుకున్నా వేమిటి మామయ్యా.

రామ: మనపని పైలాపచ్చీసుగా ఉండే రోజుల్లో ఆమాట లేకుండా పిలిస్తే పలికేవాళ్ళం గాదోయ్.

కనక: మాధవరావుగారూ! అర్జంటుపనిఉన్నది వెళ్ళొస్తా.

రామ: భోంచేసి వెళ్దురుగాని—

కనక: క్షమించండి మరోమాటు. వస్తా తొందరపనుంది (వెళ్లిపోతాడు)

పార్వ: (నవ్వాపుకుంటూ తుండుగుడ్డలు పట్టుకుని వచ్చి) స్నానం చెయ్యండి మామయ్యా (అనియిచ్చి, వసుంధరని తనదగ్గరికి తీసుకుంటుంది) (రామకృష్ణయ్య దొడ్లోకి వెళ్తూండగా)

మాధ: కట్నంమాట చెప్పిపో మామయ్యా.

రామ: నాకు తెలియకముందే ఖాయం చేసుకున్నావుగదోయ్—కాబట్టి మరి మాట్లాడొద్దు. (వెళ్తాడు)

ప్రభా: (లోపల్నుంచి వచ్చి) ఇదిగో నడిపాతవి రెండు (అని తండ్రి చెప్పులు చూపిస్తాడు)

మాధ: (గబుక్కున మంచంమీద పడుకుని) నోరుమూసుకుని వేళ్లు పిసకరా.

ప్రభా: (ప్రక్కన కూర్చుని దవడ పగుల్తుంది)

పార్వ: ఎవరికోసం. దక్కించుకుంటూ

ప్రభా: (వెక్కిరిస్తూ) హె హె హే!

పార్వతి: (మరీ వెక్కిరిస్తూ) వె వె వె వె ఈ బస్సులో వెళ్లి అత్తగార్ని తీసుకురండి. ఎందుకమ్మా నాదగ్గరికి చేరేవు. (అని నవ్వుతూ వసుంధరని అవతలికి నెట్టి యింట్లోకి వెళ్లిపోతుంది.)

# నేటి సాహిత్యము

## అపభ్రంశ ప్రయోగములు

### శ్రీ తిరుమల రామచంద్ర

భారతి నవంబరు సంచికలో పై శీర్షికతో శ్రీ కురుగంటి సీతారామయ్యగారు ఒక వ్యాసం వ్రాసినారు. వారు పేరునకు నేటిసాహిత్యమన్నారు కాని, వారిచ్చిన ఉదాహరణలన్నిటినీ పరిశీలిస్తే, కేవలం ఇటీవల వెలువడిన "ఉదయ ఘంటలు" అన్న అఖిలాంధ్ర కవుల కావ్యసంపుటికి (తెలంగాణా రచయితలసంఘం ప్రచురించినది) మాత్రమే వారి పురోభాగిత్వం పరిమితమైనట్టు స్పష్టపడుతుంది. వారామాట స్పష్టంగా, తెలిపివుంటే పాఠకులకు సుకరంగా వుండేది. ఆ సంపుటిపేరు వారు ఎందుకు తెలుపలేదో దురూహ్యం. పాఠకుల సౌకర్యంకోసం వారిచ్చిన క్రమంలోనే వారిచ్చిన "అపభ్రంశాల"ను పరిశీలింతాము.

## అచ్చుతప్పులు

మొట్టమొదట ఒక్కమాట చెప్పవలసి వుంది. పూర్వకాలంలో లేఖక ప్రమాదాలలాగే నేడు ముద్రణప్రమాదాలు వుండడం అంగీకరించాలి. అప్పటివారు లేఖకప్రమాదాలను తొలగించుకొని సరైన పాఠాలను నిర్ణయించుకొని విమర్శకు పూనుకొనేవారు. శ్రీ సీతారామయ్యగారు అచ్చుతప్పులను కూడా అపభ్రంశాలుగా ఉదహరించడానికి వెనుదీయలేదు.

ఉదాహరణకు విద్వాన్ విశ్వంగారి "నాన్యః పంథాః" అనే గీతంలోవున్న "జనతాగతి" అన్న పదాన్నే తీసుకుందాం. ఆ గీతం పూర్వం—1949 ఆగస్టునెలలో నవ్యసాహితిలో (సాహిత్య పక్షపత్రిక, అనంతపురం) ప్రచురితమైంది. అందులోని భాగమిది.

"వంచన ఏ కించిత్తో
కనబడినా నిన్ను నన్ను
నలగద్రొక్కి ముందునకే
సాగుతుంది జనతాగతి
ఆగబోదు! ఆగబోదు!
ఆలోచించుము సఖుడా."

ఈ గీతం 'ఉదయ ఘంటల'లో 'జనతాగతి' అనడానికి మారు "జనతాగళి" అని పడింది. ఆ స్వరూపంలో అచ్చు తప్పున్నది సుస్పష్టం. కాని శ్రీ భట్టాచార్యులు "ద్విగుసమాసము చేసినాడనుకొందును కవి" అని ఒక విసురు విసిరినారు.

ఈ వరుసలోనికి వచ్చేవే మరికొన్ని. "మానవ మాతృడు". ఇది అచ్చుతప్పన్నందుకు గుర్తు అదే పద్యంలో ప్రప్రథమ పాదంలో 'మానవమాత్రుడు' అనే ఉండడం. ఆ పద్యాన్ని పూర్తిగా చదివి వుండినా, "మాత్రుడు అని కాబోలు కవిహృదయము" అని అనుకొనవలసిన అవశ్యకత వుండదు. వారి వ్యాసంలోనే (పుట 466, 2 వ కాలంలో 28 వ పంక్తి) 'శ్రుతి' అనుటకు మారు 467 వ పుట 2 వ కాలం 20 వ పంక్తిలో 'లాఘవ' మనుటకు మారు, శృతి అని 'లాఘువ'మని పడినది. దీనినిబట్టి శ్రీ భట్టాచార్యులవారికి శ్రుతి శృతులకు లాఘువ లాఘవాలకు భేదం తెలీదని చెప్ప సాహసింతుమా?

ఇలాంటివే "కృషియింప, షుప్తి, కక్షివంతుడు రక్తపాయ" మొదలైనవి. వీటి సాధురూపాలు "కృశియింప, సుప్తి, కక్షీవంతుడు, రక్తపాయి."

## "అపభ్రంశాలు"

(1) శ్రీ నార్ల వేంకటేశ్వరరావుగారు వ్రాసిన "ఆవల" అనే గీతంలో "ప్రత్యహ పరివర్తనలే" అన్నమాటమీద వీరు "అహాశ్శబ్దస్వరూప మితనికి తెలియదు" అని విమర్శించారు. రాజాహస్సఖి శబ్దాలకు 'టచ్' వచ్చి, ప్రత్యహం కావడం, ప్రత్యహం జరిగే పరివర్తనలు అన్న అర్థంలో ప్రత్యహశబ్దం పరివర్తన శబ్దంతో సమసించడం సంస్కృత వ్యాకరణం చదువుకున్నవారికి తెలియనిది కాదు.

(2) ఇక మిశ్రమ సమాసాల సంగతి. మిశ్రమ సమాస చర్చ ఈనాటిది కాదు. ఎందరో పండిత ప్రకాండులు ఆంధ్ర వాఙ్మయాన్ని అవలోడించి వీటిని వెలికితీసి వీటి ప్రామర్ష్యాన్ని తెలియజేసినారు. మిశ్రమ సమాసాల కూర్పు ఆదికవి నుండి అత్యాధునిక కవిదాక నిరాఘాటంగా సాగుతూ వచ్చినదే. వీరు తప్పన్న 'బహు మంచి' లాంటి "మహామంచి" భాస్కర రామాయణం యుద్ధ కాండంలో వున్నది. వాడి మయూఖములు, వేడి పయోధరాలు అందరూ చూచినవే. అంచయాన అందరూ ఎరిగినదే. శివకవులు మరికొంత ముందడుగు వేసి అమరలేము, భక్తకూటువులు, (సోమనాథుని బసవపురాణం) వంటి సంస్కృత పూర్వ మిశ్రమ సమాసాలను ప్రయోగించినారు. అంతేకాదు. పుష మిాశ, చేదళాబ్జంవంటి ప్రాకృత సంస్కృత మిశ్రాలను ప్రయోగించారు. శ్రీనాథుని వంటి మహాకవి కైవార, హేరాళాలవంటి అచ్చ తెలుగు పదాలను సంస్కృత సమాస మధ్యంలో బిగించారు. "కైవార దుర్భాషణంబులు"—నైషధం 7–89. హేరాళక్రీడా సంచారిణి "—భీమఖండం. 1-100, ఇలాటి వాటిని చూచే శ్రీనాథునికి సంస్కృత సమాసంలో నే సంస్కృతేతర పదాలను చేర్చే అలవాటున్నదని సూర్యారాయ నిఘంటు కారులు అనవలసి వచ్చింది. "వందిమాగధ సూత కైవార రవము" అని భాగవతం. దినవెచ్చ దినవహిలాంటివి కొల్లలు. ఇవన్నీ చూచిన తర్వాత శరద్వెన్నెల' సెగపిండాలు, విషకత్తెర, లాంటిపదాలను అపభ్రంశాలని ఎలా అనగలం? అట్లని ప్రతి ప్రుతికటు మిశ్ర సమాసాన్ని సమర్థించడం కాదు. కాని, ఇవేవో ఈనాటి అభ్యుదయ కవులకే అలవాటయినట్లు, వారికి శబ్దస్వరూపం రేఖా మాత్రంగానైనా తెలియనట్టు శ్రీ భట్టాచార్యులు గారు సూచింపదలచిన అభిప్రాయం సరికాదనిమాత్రమే నా మనవి.

(3) సంస్కృతపదాలు రూపాంతరం చెందడం కూడా ప్రాచీనకాలంనుంచి పండితులకు పరిచితమైన సత్యమే. సౌదామని సౌదామిని అయినది.

"........సౌదా
మినితోఁ జెలువొందు నీల
మేఘముపోలెన్"—సింహాసన
ద్వాత్రింశతి. 2-146.

ఏకాదశి ఏకాశి అయినది.

"కడిదిపాపంపు దశమి నేకాశి
గూడు"—శ్రీరంగమాహాత్మ్యం. 8 119.

ఏకాదశి మరికొంత ముందుకువెళ్ళి ఏకాస్తి, కాస్తి అనికూడా అయింది.

ముష్టీముష్టి ముష్టాముష్టి అయింది.

కల్హారం కలుహారము, కలహారము అయింది. నన్నెచోడని కుమారసంభవంలో చూడవచ్చు.

సమూహం సమూహి అయినది. వసుసమూహి, బకసమూహి, భక్తగణసమూహి అని కేతన, నన్నెచోడుడు, సోమనాథుడు మున్నగువారు ప్రయోగించినారు.

వ్రుటువసుడి క్రొవడి అయినది.

"కృూరాస్త్రచంద్రార్థ క్రుత్తోరుబాహులై"

"ముగునైన చేతులు ముండ్లపోవలు"

"త్రుణకణాంశంబు వ్రజమై త్రుంచునట్లు."

బాలిక బాలకిగా మారినది. యౌవనము యవ్వనమయినది. అంబుజనేత్ర అంబుజనేత్రి అయినది.

ఇలాటి విశేష ప్రయోగాలను సహృదయతతో సేకరించి శ్రీ నిడదవోలు వెంకటరావుగారు "భాషా పరిశోధన—ప్రయోగ విశేషములు" అన్న గ్రంథంలో ప్రకటించారు. మరింత జిజ్ఞాసగల పాఠకులు ఆ గ్రంథాన్ని ముదలకించవచ్చు.

సత్యం ఇలా వుండగా, శ్రీ సీతారామయ్యగారు "అలిశ్యం, పరిక్షు" అను మాటలను ఆధారంగా చేసుకుని పెద్ద ఆర్భాటం చేసినారు. "భాషాజ్ఞాన శూన్యతవలన ఇది కలుగుచున్నది" అన్నంతవరకూ వెళినారు. నేటి కవులలో భాషాజ్ఞానమే కొదు—కూలంకషమైన భాషా పాండిత్యం కలవారు చాల మంది వున్నారు. సౌందర్య ప్రలుబ్ధతతో వారి కావ్యాలను చదివి ఆనందించే సహృదయులు వున్నారు "సంస్కృత పదములను మార్చుటకు రచయితలకు ఏమి యధికారముకలదు?" అని వారు ప్రశ్నించడం, పైన నేనిచ్చిన ఉదాహరణలను పరిశీలిస్తే ఎంత తొందరపాటో పాఠకులకు తెలుస్తుంది.

భాషా పరిణామగతిని సునిశితంగా పరిశీలించి, "ప్రవాహినీ రేఖ్య" అన్న మాటను నిరూపించడానికి బాలవ్యాకరణ్యం, భాషా భేషజం లాంటి ఉత్తమ గ్రంథాలను రచించిన శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు ఈనాటి భాషాగమనాన్ని చూచి విలపించి వుండెరు.

## ద్వంద్వసమాసం

శ్రీ భట్టాచార్యులు గారు "ద్వంద్వసమాస విషయమున "తల్లీదండ్రులు" (విశ్వగీతి) గమనింపవలసిన ప్రయోగము" అని అది తప్పన్నట్టు సూచించారు. ద్వంద్వసమాసంలో మొదటి పదంమీది సముచ్చయార్థకం దీర్ఘంగా మారడం అసహజమేమాత్రం కాదు. భాషా ప్రామాణికత విషయంలో కవిత్రయాన్ని వీరు తోసి రాజనరుగదా! — ఆ కవిత్రయంలోని ఎఱ్ఱాప్రగడ "అన్నాదమ్ముల గని" అని ప్రయోగించాడు. (ఎఱ్ఱాప్రగడ హరివంశం. ఆశ్వాసం 4-15). ప్రౌఢవ్యాకరణ కారుడు సంధిపరిచ్ఛేదంలో ఇలాటి దీర్ఘాలసాధనకు ఒక సూత్రమే (6 వ సూత్రం) ప్రత్యేకంగా చెప్పి "అప్పాసెల్లెండ్రు" అన్న ప్రయోగం ఉదాహరించారు.

## తెలుగుపదాలు

దేశం, మధురం, వీరంవంటివికూడ వీరికంటికి అపభ్రంశాలయినవి. ఎందువల్లనో కాదు—కేవలం అందులోని 'ము' ప్రత్యయం 'ం' గా మారడమే వీరికి అసహజంగా కన్పట్టినది. మనది అజంతభాష గనుక హలంతాలే లేనట్టు వీరు అన్నారు. భాషా తత్త్వాన్ని తెలిసిన వీరుకూడా ఇలాఅనడం ఆశ్చర్యం. అజంతభాష గనుక దేశముల్, గుణాల్, వరాల్, మొదలయిన హలంతాలు వుండకూడదనగలమా? 'ము' విభక్తి సున్నగా మారడం ఏమాత్రం అసహజం కాదు. తమిళ కన్నడ భాషలలో ప్రథమావిభక్తి అనునాసికమే. పళం, రామం, బందం మొదలైనవి. ఆ అనునాసికం క్రమంగా తెలుగులో కన్నడంలో వు గాను, ము, వూలు గాను మారినది. కాని వ్యవహారంలోమాత్రం అనునాసికంగానే వుంది. భాషకు "సిద్ధిర్లోకాద్వ్యశ్యా." కదా! బహువచన ప్రత్యయమైన లు లోని అచ్చుపోయి లకారం మాత్రం మిగిలినప్పుడు, ము లోని అచ్చుపోయి మ్ మాత్రం మిగలడంలో ఆశ్చర్య మేముంది?

మానవుణ్ణి, దేవుణ్ణి అనడంకూడా లోకంలో వుంది. ప్రాచీన వ్యాఖ్యాతలందరూ వాడినదే. మల్లన రామస్తవ రాజంలో వాణ్ణి అని ప్రయోగించాడు. దాన్ని ఆధారంగా శ్రీ గిడుగు సీతాపతి గారు భారతశతకంలో పద్యానికి పద్యమే రచించారు.

శ్రీ పిలకా గణపతిశాస్త్రిగారు "బరువుబండి" అనే గేయంలో 'మంటల్లో' అని వ్రాయడం ఆక్షేపించినారు శ్రీ సీతారామయ్యగారు. పదమధ్యాన వున్న రెండు లకారాలలో వెనుకది ముందుదానిలోనికి తోచుకొని వచ్చుట స్వరశాస్త్ర సంసిద్ధమే.

కళ్లు నీళ్లుకూడా అప్పకవికే కాదు వీరికికూడా తప్పులుగా కనిపించినవి.

"నీళ్ళకు నిర్రితోళ్లకును నేతి కరుళ్లకు..." అని శ్రీ దాసు శ్రీరాములుగారు "తెనుగు నాడు"లో ప్రయోగించినది గుర్తుకు తెస్తున్నాను.

వాకడులో వున్న క్రియారూపాలను అల్లే ప్రయోగించడం అదేపనిగా నేటి రచయితలు అలవాటు—చేస్తున్నారు. దక్షిణాంధ్ర సాహిత్యంలో ఇలాటివి కొల్లలు. పూజ్యశ్రీ చెళ్లపిళ్ల వారివంటి వారు తమ వ్యావహారికంలో "అనియ్యేవే, ఆయాయి, అంచాత, ఏతావాతా," వంటివి ప్రయోగించడం తెనువారికి తెలియనిది కాదు.

దెయ్యాలు తప్పట. "దెబ్బకు దెయ్యం జడుస్తుంది" అన్న మనసామెత దకారాదినే సూచిస్తుంది. మన సామెతలలో యతిప్రాసలలో ఏదో ఒకటి వుండడం లోకవిదితం. ఇంతకూ ఈ దెయ్య శబ్దం దైవ, దేవశబ్దభవం. దయ్య అని ప్రాకృత హిందీలలోను, దెవ్వ అని దకారాదిగా కన్నడంలోను వుంది. కనుక వ్యవహారంలో దకారాదిగా వుండడం, దానిని నేటి కవులు ప్రయోగించడం అపభ్రంశం కాదు.

పయనము పైనమైనప్పుడు బయలుదేరడం బైల్దేరడం ఎట్లా తప్పవుతుంది?

ప్రంగ, క్రోతి, ప్రప్పులలోని క్రొవడి ఎన్నో శతాబ్దాలక్రిందే జారిపోయింది. సెనగపప్పును సెనగ ప్రప్పని అంటే హాస్యాస్పదంగా వుంటుంది. క్రొవడి లోపించటం తప్పా?

వీరు దుస్సంధులుగా భావించిన కోటొక్కటి వంటి ప్రయోగాలు తెలుగులో 'నూటొక్కటి.'

కట్టకడపట సీతారామయ్యగారు ఈ గీతములు కూడ తమ తృప్తికిని, మిత్రుల మన్ననలకును, విద్యార్థుల చప్పట్లకును వ్రాసినట్లు కనబడును అని యావదాంధ్రంలోని కవులను, ఆధునిక కవిత్వ సర్వస్వాన్ని అవహేళన చేయడానికి ప్రయత్నించడం సహృదయత కాదు. అపభ్రంశమన్నదే లేదని మా వాదం కాదు. అవి నేటికవులలోనే కాదు; ఎవరు వ్రాసినా, ఎందులో వున్నా తప్పే. అయితే ఏమాత్రం అపభ్రంశం లేనివానినికూడ తప్పుపట్టేదురభిని వేశాన్నే మేము ఖండిస్తున్నాము.

శ్రీ ప్రభాకర శాస్త్రిగారి మాటలతో ఈ మనవిని ముగిస్తాను.

'మానవుడు పుట్టింది మొదలుకొని గిట్టేదాకా స్థలస్థలమూ, క్షణక్షణమూ—అంటే ప్రతి కాలలేశంలోనూ, ప్రతిదేశంలోనూకూడా తన స్వరూపస్వభావాలలో మార్పు చెందుతూనే ఉన్నాడు అలాగే ప్రతి దేశలేశంలోనూ, ప్రతికాలలేశంలోనూకూడా మానవ ముఖయంత్రంలోనూ భాష విభిన్నలక్షణాలతో కొంతకొంత రాలిపోతూ మారి ఎంతో విజృంభిస్తూ పెంపొందుతూ ఉన్నది.

"వృక్షవిజృంభణవంటిదే మానవతా విజృంభణమూ, వారిభాషల విజృంభణమూనూ. శబ్ద శాస్త్ర వేత్తలు వృక్షశాస్త్రవేత్తలవలె దొరికే ప్రతిశబ్దమూనూ క్రమించి, దాని పుట్టుపూర్వోత్తరాలు, ఇప్పటివరకు అది చెందిన పరివర్తనాలు, అర్థంలోనూ, రూపంలోనూ కూడా గుర్తించి, నిరూపించి ప్రకటిస్తారు. భావి కాలంలో అవీ మారిపోగలవు. ఆ మార్పులను భావికాలంవారు పరిగణించి ప్రకటించగలరు. దాని స్వరూపస్వభావాలను, ఉపయోగాలను గుర్తించడము, వానిని ప్రకటించడముమాత్రమే వారిపని గాని, చంపడంగాని, పుట్టించడంగాని వారిపని గాదు...శాస్త్రకారులట్లా ఉంటూఉంటే ప్రజలు ఆయా శబ్దరూపాలకు వైరస్యసారస్యాలవల్ల సౌకర్యాసౌకర్యాలవల్ల కాలక్రమాన కుంపు పెంపులు జరిగిస్తూ ఉంటారు."



## ఎర్నెస్ట్ హెమింగ్వే

ఉత్తమ సాహిత్యవేత్తగా 1954 నోబెల్ బహుమతి నందుకున్న అమెరికన్ రచయిత; పాశ్చాత్యసాహిత్య ప్రపంచంలో ప్రసిద్ధ నవలాకారుడుగా హెమింగ్వేకు ఇదివరకే ఉన్నతమైన స్థానం వున్నది ఇప్పుడీ బహూకృతిని సాధించిన రచన 'Old Man and the Sea' అనే నవల. ఈరచనలో సృష్టించిన సాంకేతిక రూపకల్పన (Symbolism) అద్భుతమైనదని పలువురు విమర్శకులు అంటున్నారు.

# గ్రంథ విమర్శనము

## తపోవనము

ఖండకావ్య సంపుటి; రచన: శ్రీ బెళ్లూరి శ్రీనివాసమూర్తి, కళ్యాణదుర్గం, అనంతపురం జిల్లా. మూల్యం రెండు రూపాయిలు.

నిను కవితా తపస్వియని
  నీ కవనంబు తపోవనంబుగా
ననిశము లోకమెల్ల కొని
  యాడగ, సృష్టిరహస్యమాధురుల్
కనుగొని తన్మయత్వమున
  కన్నులు మోడ్చెద వెంత ధన్య జీ
వనము లభించె పొందుకొన
  వయ్య యథేచ్ఛముగాగ నిచ్చటన్

ఈపద్యం 'తపోవనం' అనే శీర్షికకు వ్యాఖ్యాన రూపంలో వుంది. ఇంకా వివరంగా రచయిత:

'నా కవితా ఖండికల సమగ్రస్వరూప మీ తపోవనము. ఇవియన్నియు నొక నిర్ణీత కాలమున రచింపబడినవి కావు. ఆబాల్యముగ కొనసాగివచ్చిన దీ తపస్సు. ఇందలి మూడు సంపుటములు పూర్వోత్తర ఖండములుగా విభజింపబడినవి. రచనలో కాలభేద మించుక సూచించుటయే దీనికి కారణము, బాల్యదశ నలుగల పుటలయందే అనువాదరచన కొద్దిగ జేర్చితిని' అని తెలుపుతున్నారు.

కాని మున్ముందు ఈ కావ్య సంచయాన్ని 'కళాజీవి (కళాతపస్వి యనుకొందము), 'సాన్నిధ్యము', 'స్వర్గద్వారము' అను మూడు ప్రధాన భాగములుగా ఏల విభజించిరో రచయిత తెలుపలేదు. రచయిత చెబుతున్న పూర్వోత్తర ఖండవిభజన ఈ మూడుభాగాలకూ జరిగిన పునర్విభజనవిషయము.

శ్రీ శ్రీనివాసమూర్తిగారు ఆస్తికులు. అందుచేత ఆబాల్యమూ సాగుతూవచ్చిన ఈ కవితాసాధనను, ప్రాచీన ఋషిసంప్రదాయాన్ని అనుసరించి లాంఛనప్రాయంగా ఈమూడు సోపానములుగా అమర్చినారే గాని ప్రత్యేక మేదో యొక దృక్పథమును సూచించుటకు చేసిన విభజన గాదేమో!

వీరి ఆస్తికత్వం, ఆధ్యాత్మిక దృక్పథం వాస్తవికజీవితాన్నుంచి పరారీ చిత్రించేబాపతు కాదు. భౌతికాధ్యాత్మిక జీవితలను సమన్వయం చేసుకుని వీటికి అభేదాన్ని కల్పించుకోగలిగారు. భౌతిక జీవితంలోనే ఈ కవితాతపస్సుద్వారా పరతత్వాన్ని సాధించటానికి ఉద్యమించారు:

సౌందర్యార్చనలో సమస్తమును కాం
  క్షల్ లీనమైపోవని!
ఎందాకన్ కవితా తపోవనములో
  నే, కోకిలంబైతి, నీ
డెందంబున్ మధురంబుగా దెరచి సృ
  ష్టిన్ ప్రేమసారించి, 'ఆ
నందో బ్రహ్మ'యటంచు దేహము పరి
  త్యాగంబు గావించెదే?

జగత్తులో గల సుఖదుఃఖముల రెంటియందూ వీరు పరతత్వాన్నే చూడగలుగుతున్నారు. 'అజ్ఞానము' అనే కావ్యంలో:

తావకీనవినూత్న సౌందర్యమరయ
చివురుటాకుల దెసకు జూచితినిగాని
రాలి పడియున్న శుష్కపత్రములయందు
నీవు దాగిపోయిన జాడ లెరుగనైతి!

తావకీనవినూత్న సౌందర్య మరయ
శీతల జ్యోత్స్నలందు జూచితినిగాని
కవిసికొనియున్న కారు చీకటులయందు
నీవు సంచార మొనరింప నెరుగనైతి!

తావకీనవినూత్న సౌందర్య మరయ
లలిత హర్మ్యము లెక్కిపోదలతుగాని

పేదల కుటీరసీమకు బోదువనుచు
నీ రహస్యవర్తనలెల్ల నెరుగనైతి!

తావకీన వినూత్న సౌందర్యమరయ
ఏవో సుఖమయ లోకము లెంతుగాని
వాగులై పారు దుఃఖబాష్పములయందు
నీవు లీనమైపోవుట యెరుగనైతి!

ఈ సాధనయొక్క సమగ్రపరిణామం 'అమృత సిద్ధి' అనే కావ్యంలో విస్పష్టంగా ద్యోతమానం చేశారు.

'అమృతమే వోయుదనుచు పేరాసబూని
దోసిలొగ్గితి మది రిక్తోపమంద
కలుష మెఱుగని నాచిన్ని కరములందు
విషము బోసితి నిర్దయాపికలమతిని!

నీదు పరిశుష్క హృదయంబు నీసడించి,
విషముకోసమె తుదకు నిన్ వేడుకొంటి
అమృతధారలు గురిసి నా హస్తయుగళి
నిండుకన్నుల నశ్రులు నించితేల!

ఈ సుధాపానమత్తత హృదయమెల్ల
నవ్యయానంద మాధుర్య మనుభవింప
చావులేని ఏ లోకమందో వసింతు—
ధన్యమైనది నా జీవితంబు నేడు

ఇటి మహత్తరమైన ఆధ్యాత్మిక దృష్టితో ఈ కవితాసాధనను నెరపుతున్నా, వీరు వాస్తవిక జీవితానికి విముఖులు గారు. ఈ కావ్య సంచయంలో గగన పథంనుంచి 'గంజికేంద్రము' వరకూ వీరు తడవి చూడని విషయమంటూ లేదు. బాధాపరిపీడితులైన సహజీవులను చూసి వీరి హృదయం కరుణావిలమై స్పందించుతుంది. 'పయనం' అనే కావ్యం:

ముసలవ్వా—ఓ ముసలవ్వా!
ఎప్పుడు—ఈలోకానికి నీ రాక
ఎప్పుడు—లోకం విడిచి నీపోక
నీ చల్లని గర్భములో
పూచిన పువ్వులుగా
కొడుకులతో బిడ్డలతో
కాలము గడిపావా?
మనమరాళ్ళను
కనుగవతో చూచావా,
ఎప్పుడు నీ పయనం—

వృద్ధాప్యం—అంధత్వం
కళేబరం కన్పిస్తుంది!
జీర్ణ శీర్ణ వస్త్రంతో
చేతియూత కఱ్ఱతో
శిథిల శిరోజాలతో
లోకాంతర సీమలకై
ఎప్పుడు నీపయనం.

కడుగాసిపడిన జీవానికి
పిడికెడు కబళం లేదా
తిరిపానికి తరిమేశారా
వయసు వచ్చినవారంతా
ఇంటినుంచి గెంటినారా
ముసలవ్వా—ఎప్పుడు నీ పయనం.

ఇంతదవ్వ ఆ యీ రచనలను ఎత్తి చూపేకంటే ఒకమాట చెబితే సరిపోతుంది: రచయిత సిద్ధహస్తుడు. ఏ విషయాన్ని స్పృశించినా దాన్ని రసమయ కావ్యంగా చేసివేయగలరు. ఈ 'మధురకవి' భారతిముఖాన ఆంధ్ర రసికలోకానికి సుపరిచితులు. ఈ సంపుటిలోని కావ్యాలలో చాలాభాగం భారతి లోగడ ఆంధ్రప్రజలకు అందజేసినవే! రచయితను గురించి ఇప్పుడు క్రొత్తగా ప్రశంసావాక్యాలు పలుకవలసిందేమీ లేకపోయినా, ఇప్పుడు వారి కావ్య సంచయాన్ని ఎలాగూ పరిచయం చేయవలసిన అవసరం వచ్చింది గనుక రచయితనుగురించి ఒకటి రెండు సంగతులు వక్కాణించటం అప్రస్తుతం కాదు. నవ్యాంధ్ర కవితారంగంలో వ్యాపించుతున్న అయోమయత్వం దృష్ట్యా ఇట్టి ప్రసక్తి అవసరమని కూడా తోసుంది.

రచయిత వారసత్వంగా లభించిన సంస్కృతాంధ్ర రచనావిధానాన్ని సంపూర్ణంగా అనుభవానికి తెచ్చుకున్నారు. వారికి సంస్కృతాంధ్ర శబ్దజాలం మీద సమగ్రమైన అధికారం వుంది. అలాంటి ఆత్మవిశ్వాసంకూడా వుంది. ఇది రచయితలో చాలా ఆరోగ్యకరమైన విషయం. 'పండితుణ్ణి కాదనుకుని పోతానేమో' ననే శంకతో లేనిపోని గందరగోళాలు చెయ్యరు. అందుచేతనే సహజము, సరళము, మధురము అయిన శైలి కరతలామలకమైంది. పదజాలానికి అందకుండా గగనపథానికి ఎగసిపోయే ఎలాంటి ఉదాత్తమైన భావాన్నయినా అలా పుణికి పుచ్చుకుని తన పదజాలంలో రూపొందించి సువ్యక్తం చేయగలరు. శతాధికంగావున్న ఈ సంపుటిలోని యే ఒక్క కావ్యాన్ని పరిశీలించినా ఈ నిజం వ్యక్తమౌతుంది. ఈ సందర్భంలో కాళిదాసు శ్లోకానికి వీరు రచించిన ఈ అనువాదం గమనార్హం.

అందంబు కొరత వడునే
చందురునకు మచ్చయున్న, శైవాలముగ
ప్పం దామరపువ్వున—ఈ
సుందరియును వల్కలముల సొంపుగులికెడిన్.

వీరికి ఆంగ్ల కవితారంగంతో కూడా విస్తృతమైన పరిచయం వుంది. వీరిమీద ఆ ప్రభావం కూడా కొంత కనుపించుతుంది. అందుచేతనే వీరిని ఒక సోదరకవి అభినందించుతూ 'మాలో—శ్రీనివాసమూర్తి కీట్సు వంటివాడు' అన్నారు. ఇది నిజానికి చాలా విచిత్రమైన మాటే! సౌందర్యోపాసనవిషయంలో వీరి ఛాయలు కొన్ని కీట్సులో కనుపించినా కీట్సులో వున్న అవాంఛనీయమైన నిరాశావాదం శ్రీనివాసమూర్తిగారిలో ఏ కోశానా కనుపించదు.

ప్రకృతిసౌందర్యంపట్ల మోజుపడేగుణాన్ని తీసుకున్నా వీరిలో వాల్మీకి కాళిదాసులఛాయలే ఎక్కువగా గోచరించులాయిగాని కీట్సు వగైరా ఆంగ్లకవుల అనుకరణ కనుపించదు. ఆంగ్లకవుల అనుభవాలను జీర్ణం చేసుకున్నా వాటిని వ్యక్తం చేసేటప్పుడు సంప్రదాయశుద్ధమూ సజాతీయమూ అయిన తన స్వంతగొంతుతోనే పలుకుతారు. శ్రీనివాసమూర్తిగారిని 'మాలోకీట్సు' అనటం, వారిని అభినందించటం కాదేమో. శ్రీనివాసమూర్తిగారు శ్రీనివాసమూర్తిగారే; ఆయా కవులతో పోల్చి చెప్పవలసిన అగత్యం లేదు. నవ్యాంధ్రసాహిత్యరంగంలో 'మధురకవి'గా ఆయనకు విశిష్టమైన స్థానం వుంది.

ప్రతిభాసంపదలున్న కవి; ఖండకృతులను కాదనటం కాదుగాని—సమగ్రమైన ఒక కావ్యాన్ని సృష్టించి సాహితీరంగానికి అందజేస్తే బాగుంటుంది.

# గ్రంథ స్వీకృతి

## సుమతిశతకము

రచన: శ్రీ కె. నారాయణరావు; ప్రచురణ: శ్రీ జయలక్ష్మి అండ్ కో, నెల్లూరు; వెల రు 0-6-0.

## ఆంధ్ర తరుణి

పద్యాలు; రచన: శ్రీ రాంపల్లి శ్రీరామచంద్రమూర్తి, పోడూరు, వయా పాలకొల్లు; వెల రు 0-4-0.

## వెంకటేశ నక్షత్రమాల

పద్యాలు: రచన: శ్రీమతి కుమారి సుందరి; ప్రచురణ: శ్రీ టి. అప్పన్న, మూరారి బిల్డింగ్స్; అమూల్యం.

## మందీ - మనిషి

నాటిక; ఎర్నస్ట్ టాలర్ రచనకు అనువాదం; అనువాదకులు శ్రీ సోమసుందర్; కళాకేళి ప్రచురణలు; శామల్‌కోట; వెల రు 1-0-0.

## మహేంద్రమణి

పిల్లల కథల సంపుటి; రచన: శ్రీ రావూరి భరద్వాజ; శ్రీనివాస పబ్లికేషన్సు, తెనాలి; వెల రు 0-3-0.

## గోదావరి దొడ్డమ్మ కౌగిళ్ళలో

గేయాలు; రచన: క్రాంతినాధ్ ప్రవాసి; ప్రచురణ: క్రాంతి ఎకాడమీ, పిఠాపురం, వెల రు 0-8-0.

## కాశ్మీరుదేశ చరిత్ర

రచన: శ్రీ కొత్త భావయ్యచౌదరి; సంగం జాగర్లమూడి; (గుంటూరు జిల్లా) వెల రు 1-0-0.

Printed & published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7. Thambu Chetty Street, Madras. Editor: S. Sambhu Prasad.


దినదినమునకు ఇంక స్వచ్ఛమైనటువంటియు,
ఇంక మనోహరమైనటు
వంటియునైన చర్మము
కేడిల్‌తోగూడిన
రెక్సోనాతో
ఈ అద్భుతమైన
మార్పును మీరు
మెచ్చుకొంటారు
రెక్సోనాయొక్క కేడిల్‌తోగూడుకొన్న నురగను మీ చర్మముమీద మెల్లగా రుద్ది తరువాత కడిగివేయండి. మీ చర్మము దినదినమునకు ఇంక మృదువుగాను, మెత్తగాను అగుటను మీరు చూస్తారు. మరియు మీరు క్రొత్త ఆకర్షతను మెచ్చుకొంటారు.
Rexona
BLENDED WITH CADYL
Rexona
BLENDED WITH CADYL
రె
ఒక్కటే కేడిల్‌తో గూడిన సబ్బు
చర్మమును పోషించేటటువంటియు, చర్మమును మెత్తగాచేయునటువంటియునైన నూనెల ఒక ప్రత్యేక మిశ్రమమునకు రిజిస్టర్డ్ పేరు.